# స్త్రీలవ్రతకథలు

(నోములకథలు 1, 2, 3 భాగములు.)




గ్రంథకర్త

బాలాంత్రపు వేంకటరావు

# స్త్రీలవ్రతకథలు

(1, 2, 3 భాగములు.)



పునర్ముద్రణము.

## బాలాంత్రపు వేంకటరావు

గ్రంథకర్త & ప్రకాశకుడు.

కాకినాడ:
[illegible] శేషగిరిరావుగారి [illegible] ప్రెస్సునందు
ముద్రింపఁబడినది.
1936.

 [ వెల 0—12—0.

# విన్నపము.

—:o:—

స్త్రీల వ్రతకథలు 1, 2, 3 భాగములుగ నాచే రచింపఁబడి, ప్రకటింపఁబడి చాలకాలమునుండి మన యాంధ్రదేశమునఁ బ్రచారములోనున్నవి. పైమూఁడుభాగములును క్రౌనుసైజున మూఁడు ప్రత్యేక పుస్తకములుగా ప్రకటించుచుంటిని.

ఇప్పుడు ఆమూఁడుభాగములను వరుసగా కలిపి డెమ్మీసైజున ఒకేసంపుటముగా ముద్రింపించి ఆంధ్రలోకమునకు అందించుచున్నాఁడను. ఇందువలన కావలసిన నోములును కథలును ఒకేచోట దొరకుటకు సౌకర్యముకలిగినది వెలయుందును సౌలభ్య మేర్పడినది కావున ఈసంపుటము సర్వవిధముల లోకాదరణము నందగలదని యాశించుచున్నాఁడను.

1–5–1936. గ్రంథకర్త.

# ప్రకటనము.

---

స్త్రీలవ్రతకథలు. 1,2,3 భాగములు అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. మూడుభాగములు కలసి ఒకే పుస్తకము వెల 0—12—0 మాత్రము.

నాచే రచింపఁబడిన ఈ స్త్రీలవ్రతకథలు (నోములకథలు) 1914 సంవత్సరము 3వ నెం॥ కాపీరైటు ఆక్టుప్రకారము నేను సంపూర్ణపు కాపీరైటు కలిగియున్నట్లు తూర్పుగోదావరిజిల్లాకోర్టు ఫయిలు అసలు సె 2/1927 నను నేను డిక్రీనిపొందియున్నాను. కాబట్టి యీపుస్తకములను నా లిఖితపూర్వమైన అనుమతి పొందకుండా గ్రంథమంతయుగాని, అందులోని భాగములనుగాని, ఎవ్వరును ముద్రింపఁగూడదని యిందు మూలముగాఁ దెలియఁజేయుచున్నది, దీని నతిక్రమించి నడచువారిపై కాపీరైటు ఆక్టుప్రకారము చర్యజరిపి నాకుఁ గలుగు యావత్తునష్టములు రాబట్టుకోవడమగును ఈపుస్తకములు నావద్దనే దొరకును. గిరివిఆర్డరుయిచ్చు వర్తకులకు మంచికమీషను యియ్యబడును.

1—5—1936,
పిఠాపురము.
తూర్పుగోదావరిజిల్లా.

బాలాంత్రపు వేంకటరావు,
గ్రంథకర్త & ప్రకాశకుడు.

పుస్తకములు దొరకుస్థలము:—
బాలాంత్రపు వేంకటరావుగారు,
ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,
పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

# విషయసూచిక.



## ప్రథమభాగము.

ద్వితీయభాగము.

పుట.



తృతీయభాగము.



శ్రీరామచంద్ర.

# స్త్రీలవ్రతకథలు.



## ప్రథమ భాగము.

--•• ✿ ••--

### 1 మోచేటిపద్మము. (మూగనోము.)

ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని కార్తికశుద్ధ పూర్ణిమవఱకును మూడుపూటల భోజనముచేసి సాయంకాల సమయమున కంఠస్నానముచేసి శుచియై తొలియేట తులసియొద్ద నాలుగు పద్మములు పెట్టుకొని నాలుగువత్తుల దీపముపెట్టుకొని మాటాడకుండ నలుగురు ముత్తైదువలకు బొట్టుపెట్టి, తరువాత నాలుగునక్షత్రములను లెక్కపెట్టవలయును. రెండవయేట యెనిమిదిపద్మములుపెట్టి యెనిమిది వత్తులదీపము వెలిగించి యెనమండుగురు ముత్తైదువలకు బొట్టుపెట్టి యెనిమిది నక్షత్రములు లెక్కపెట్టవలయును. మూడవయేట పండ్రెండు పద్మములను పండ్రెండువత్తుల దీపమునుపెట్టి పండ్రెండుగురు ముత్తైదువలకు బొట్టుపెట్టి పండ్రెండు నక్షత్రములు లెక్కపెట్టవలయును.

దీనికి ఉద్యాపనము:—తొలియేట నాలుగేసి అట్లు నలుగురు ముత్తైదువలకు వాయనమిచ్చి దక్షిణతాంబూలము, నల్లపూసలు, లక్కజోడు, ఇయ్యవలెను. నోము నోచుకున్నవారలకు, రెండు చేతుల మీద రెండుఅట్లును, రెండుడబ్బులున్ను రెండుకాళ్ళమీద రెండు అట్లున్ను, రెండుడబ్బులున్ను, ఉంచి, అన్నగారు తలుపువెనుక నుండ "తిని కుడిచేకాలానకు రాకే పెడసరగండ" అంటే "ఇప్పుడు రానా? ముప్పునరానా" అని అడుగవలయును. అప్పుడు నోముపట్టినకన్య

యిప్పుడే రమ్మనవలయును. అన్నవచ్చి పుస్తకముతో నాలుగుదెబ్బలు కొట్టి నాలుగు అట్లు నాలుగుడబ్బులు తీసుకొనవలయును. ఈప్రకారము రెండవయేట, ఎనిమిది వాయనములును మూడవయేట పంద్రెండువాయనములును ముత్తైదువల కియ్యవలయును.

ఈనోము పాట.

మాచేటిపద్మంబు పట్టేటివేళ, మొగ్గలతామర్లు పూసేటివేళ, కాకరాపువ్వుల్లు పూసేటివేళ, కడవలతో నుదకమ్ము తెచ్చేటివేళ, అనపాపువ్వుల్లు పూసేటివేళ, అటికలతో నుదకమ్ము తెచ్చేటివేళ, గుమ్మిడీపువ్వుల్లు పూసేటివేళ, గుండిగలతో నుదకమ్ము తెచ్చేటివేళ, బీరపువ్వులుచాల పూసేటివేళ, బిందెలతో నుదకమ్ము తెచ్చేటివేళ, సంధి వేళ దీపమ్ము పెట్టేటివేళ, చాకలి మడతల్లు తెచ్చేటివేళ, ఆవులూ గోవులూ వచ్చేటివేళ, అంబోతు రంకెల్లు వేసేటివేళ, అన్నలూ అందలా లెక్కేటివేళ, తమ్ములూతాంబూలం వేసేటివేళ, బావలూ పల్లకీ లెక్కేటివేళ, మరుదులూ మరిజూడ మాడేటివేళ, కోడళ్లు కొట్టుపసుపు కొట్టేటివేళ

ముద్దుమొగ మద్దానిబోలు. తనముఖము తామరపద్మాన్ని బోలు, పద్మము పెట్టిన చామకు పదివేలయేళ్లు అయిదువతనము; ముగ్గుపెట్టిన చామకు మూడువేలయేళ్లు అయిదవతనము. ఈపాటపాడుచు తులసెమ్మకు ప్రదక్షిణముచేసి అక్షతలు వేసుకొనవలయును.

2. పదారుకుడుముల తద్దెకథ.

ఒకరాజుకూతురు పూర్వజన్మమున పదారుకుడుముల తద్దె నోముపట్టి యది యుల్లంఘనముచేసినందున, ఆమెకు దారిద్ర్యమును, విధవాత్వమును సంభవించెను. ఆదరిద్రబాధ నామె యనుభవింపజాలక, ప్రాణములు విడువనెంచి యొకనాడొక యడవితోవనుబట్టి పోవుచుండెను. అప్పుడు భూపరిపాలనకై పార్వతీపరమేశ్వరు లాదారిని వచ్చుచు నాయింతినిజూచి, నీవెవరవు. ఇట్లేల యొంటరిగా నీకారడవిలో భయములేక పోవుచున్నావని యడుగగా, "నాకోలి మీకేల" అని యామె ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్లనుటకు పార్వతీపరమేశ్వరులు చిరునవ్వు నవ్వుకొని, ఎందుచేత నీ విట్లున్నదానవని యడుగగా కుడువ

కూడు, కట్టబట్టలేక దారిద్ర్యముచేత బాధపడలేక యీయడవుల బట్టి పోవుచున్నానని యామె చెప్పెను. అప్పుడు పార్వతీదేవి, నీవు పదియారు కుసుములతద్దినోముపట్టి యుల్లంఘనము చేసినావు గనుక యిట్టి బీదతనము నిన్ను బాధించుచున్నదని చెప్పెను. అది విని యారాజకుమార్తె "అమ్మా! యానోము నే నెట్లు పూర్తిచేసికోగలుగుదు. దయచేసి చెప్పవలయు"నని ప్రార్థించెను. అందుకు పార్వతీదేవి యామెతో, నీవిప్పుడుతిరుగ నింటికిబోయి భాద్రపదశుద్ధ తదియనాడు నోముపట్టి కథ చెప్పుకొని యక్షతలు వేసికొని యానోము నుద్యాపన చేసికొన్న యెడల నీదరిద్రబాధ తీరునని చెప్పెను. అదివిని యాచిన్నది పార్వతీపరమేశ్వరులకు భక్తితో నమస్కారముచేసి వారివద్ద సెలవు తీసికొని యింటికిబోయి తలంటి నీళ్ళుపోసికొని బిళ్ళకుడుములు వండుకొని చల్ల తెచ్చుకొనుటకై పొరుగింటికేగెను. ఆ సమయమున నొకకుక్కవచ్చి మోరగిలవేసిన తలుపుత్రోసికొని యాకుడుములను తిని పోయెను. అప్పుడా రాజకుమార్తెవచ్చి కుడుములు తిని పోవుచున్న యాకుక్కనుచూచి యది కుడుములు తినుట గ్రహించి నిండుమనస్సుతో నాకుక్కకే తాను తెచ్చిన చల్ల మూడుముంతలు పోసెను. అప్పుడు గౌరీదేవి యామెకు ప్రత్యక్షమై "ఓయుత్తమకాంతా! దీనికై నీవు విచారించవద్దు. సైకైశ్వర్యమునిచ్చుచున్న దానను" అని యంతర్థానము నొందెను. నాటనుండి యారాచకూతురు సిరిసంపదలు గలదైయేటేట పదియారుబిళ్ళకుడుములు నైవేద్యముచేసి, పదియారు బిళ్ళకుడుముల వాయనమును దక్షిణతాంబూలములతో నొకముత్తైదువకు వాయనమిచ్చి యుద్యాపనచేయుచు భూలోకమున నధికైశ్వర్యముల ననుభవించెను.

దీనికి ఉద్యాపనము:— పదియారుచేటలును చేటయొక్కంటికి; పదియారేసి బిళ్ళకుడుములును, పదియారుడబ్బులును, దక్షిణయు,

నల్లపూసలు, లక్కజోడుపెట్టి ఉద్యాపనముచేసికొనవలయును. కథ లోపమైన వ్రతలోపము కాకూడదు. భక్తితప్పిన ఫలముతప్పదు.

---

### 3. ఉండ్రాళ్ళతద్దెకథ.

పూర్వకాలమున నొకరాజున కిద్దరుభార్యలుండిరి. ఒక నాఁడా రాజుభార్యలును, నాపట్టణ స్త్రీలును, ఉండ్రాళ్ళతద్దెనోము నోచుకొనుచుండిరి. రాజుగా రుంచుకొనిన భోగముది రాజుగారు దానియింటికి వచ్చునరికి ముసుగువేసుకొని యొకచోట పండుకొని యుండెను. అదిచూచి యారాజు, నీవెందువలన నిట్లున్నదాన వని యడిగెను. రేపు ఉండ్రాళ్ళతద్దె. నేను నోమునోచుకొనవలయును. కాబట్టి నాకన్నివస్తువులును కావలెనని యాభోగముది చెప్పెను. నీకేమివస్తుసామగ్రి కావలెనో చెప్పుము. ఇది యెంత ? నాచేతిలోనిపని అని యారాజు పలుకగా నాభోగముది చేటగీట, పీటగీట, కూరగీర, పప్పుగిప్పు, బియ్యముగియ్యము, పుల్లగిల్ల, నెయ్యిగియ్యి, ఆకుగీకు, చెక్కగిక్క, డబ్బుగిబ్బు, పసుపుగిసుపు, కుంకుమగింకుమ, బెల్లముగిల్లము కావలెను. నేను నోము గీము నోచుకొనవలెను. పట్టించుకొని రావలెనని చెప్పెను. రాజును, ఆవస్తుసామగ్రిని తెప్పించెదననిచెప్పి యందుకై వెడలి కొందరు సేవకులను దీసికొని యాపట్టణ మెల్లచోట్ల తిరిగి వర్తకులు మొదలైనవారి నావస్తువుల నడిగెను. ఆవర్తకులు మావద్ద నన్నియు నున్నవిగాని 'గీ' అన్నవస్తువులుమాత్రము లేవని చెప్పిరి. రాజును తిరిగి తిరిగి మూడుజాములకు వేశ్యకాంతయింటికివచ్చెను. అప్పటికాభోగముది కుండలన్నియు కడిగిన నీరు యొక కుండలోపోసి యుంచెను. రాజుగారు రాగానే యావస్తువులన్నియు తీసికొని వచ్చితిరా యని యాభోగమస్త్రీ యడుగగా నాతడన్నియు దొరికినవి కాని 'గీ'

యను వస్తువుమాత్రము దొరకలేదని చెప్పెను. పోనిండు. నోము అయినదని చెప్పి యాకుండలోనుంచిన నీళ్లుతీసికొనివచ్చి యా రాజు మొగముమీద పోసెను. ఆత డందుకు కోపగించుకొనక యీవస్తువు లిక నేను తెప్పించలేను. నీయిష్టమువచ్చినట్లు నోచుకొమ్మని చెప్పెను. అప్పటికి పొద్దుగుంకు సమయమయ్యెను. అప్పుడు ఉండ్రాళ్లు వండుకొని ముత్తైదువను తీసికొనివచ్చి, అయిదుపుండ్రాళ్లు నైవేద్యముపెట్టి అయిదు ఉండ్రాళ్లు వాయనమును, దక్షిణతాంబూలము, ముత్తైదువకిచ్చి యా వేశ్యకాంత యథావిధిగ నోము నోచుకొనెను. ఈప్రకారము అయిదేండ్లు నోమునోచుకొని అయిదుగురు ముత్తయిదువులకు తలయంటి నీళ్ళుపోసి గోరింటాకిచ్చి, అయిదురవికలగుడ్డలును, అయిదు డబ్బులు తాంబూలములనిచ్చి యానోము నుద్యాపనము చేసికొనియెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు

---

## 4 అట్లతద్దెకథ.

రాచవారిఅక్కమ్మ, వెలమవారి అక్కమ్మ, బ్రాహ్మణవారి అక్కమ్మ, కోమటివారిఅక్కమ్మ, కాపవారిఅక్కమ్మ, వీరైదుగురు తద్దెనోము నోచుకొందమని ఉపవాసము లుండిరి. మూడుజాములు దాటినతరువాత సుకుమారి అయిన రాచవారి అక్కమ్మ మొగము తిరిగి పడిపోయెను. అంతట అన్నలు వచ్చి యేమమ్మా! యిట్లు పడిపోయినదని తల్లిని అడుగగా, నాయనా! తద్దినోము నోచుకుందామని యుపవాసముండి చంద్రుడు వచ్చినదాక నుండలేక పడిపోయినదని చెప్పెను. అప్పుడొకయన్నగారు చింతచెట్టెక్కి అద్దము కట్టి, ఆరిక కుప్పకు, ఆ అద్దమునకుతిన్నగా చిచ్చుపెట్టి, చెల్లెలిని లేపి అమ్మాయీ! అదుగో! చంద్రుడువచ్చినాడు, ఆ చింతచెట్టువైపునకు చూడు మని

చింతకొమ్మకు కట్టిన అద్దములో కనబడుచున్నమంటను చంద్రుడుగా భ్రమింపజేసి నోము నోచుకొమ్మని చెల్లెలితో చెప్పెను. ఆమెనిజముగా చంద్రుడువచ్చినాడనుకొని సంతోషించి నోము నోచుకొని అన్నము తినెను. అంతనామెకు పదియేండ్లు వచ్చినతరువాత పెండ్లి చేయుటకు ప్రయత్నించగా ముసలిమొగుడు వచ్చెను. ఆమె వానినిచూచి నాకు. పెండ్లి అక్కరలేదని, అయ్యో! తద్దెనోము నోచుకుంటె పడుచు మొగుడు వచ్చునని సాయంత్రముదాకనుండి నోమునోచుకొని అన్నము తింటిని. నాకీ ముసలిమగడేల దాపరించెనని విచారించుచుండెను. అంతట తలిదండ్రులు వచ్చి అమ్మా! నుసదిరాచకులము. పెండ్లి యాడకుండుట తప్పు. అని అనేకవిధములచెప్పినను వినక యొక రాత్రివేళ, అడవివెంటబడి పోవుచుండెను. అట్లు కొంతదూరము పోయి యొక కొలనుదరినున్న పుట్టక్రింద నిష్ఠతో తపస్సుచేయ మొదలు పెట్టెను. ఇట్లు కొంతకాలము తపస్సుచేయుచుండ, భూపరిపాలనకై యా పొంత నరుగుచున్న పార్వతీపరమేశ్వరు లామెనుచూచి, ఓచిన్నదానా! ఎందుచేత నీవిట్లు తపస్సు చేయుచుంటివని యడిగిరి. అందుకామె, మీరేమి ఆర్చెడివారా, తీర్చెడివారా? మీకెందుకు? అని యుత్తర మిచ్చెను. ఆర్చెడివారమును తీర్చెడివారమును మేమే చెప్పవలయునని మరల వారడిగిరి. అంత నామెలేచి వారికి నమస్కరించి, నేను తద్దెనోము నోచుకొన్నాను. నాతో నోచుకొనిన వారివలె గాక నాకు ముసలి మొగుడువచ్చినాడు. నేనేమిపాపము చేసితినో యని యామె దీనయై పలికెను. నీవుపవాసముండి మూడుజాములు తిరిగినతరువాత మొగము తిరిగి పడిపోగా నీయన్నవచ్చి చింతచెట్టుకొమ్మకు అద్దముకట్టి క్రింద చిచ్చుపెట్టి, యాయద్దములో కనబడుచున్నమంటను చంద్రుడని భ్రమింపజేయగా నీవునిజముగా చంద్రుడువచ్చినాడని నోమునోచుకొని భోజనము చేసినావు. ఆకారణముచేత నీకు ముసలిమగడువచ్చినాడు. అని

వారుచెప్పి యిప్పుడైననింటికిబోయి దీపాలవేళదాకనుండి నోము నోచుకొన్నయెడల పడుచుమగడువచ్చునని చెప్పిరి. అప్పుడా పిల్ల యింటికి వచ్చి రాత్రిదాక నుపవాసముచేసి యథావిధిగనోమునోచుకొనియెను. అంతనామెకు పడుచుమగడువచ్చెను. అప్పు డూరివారందరును, ఏమి నోము నోచితివమ్మా! ఏమివ్రతము పట్టినావమ్మా! నీకుపడుచుమగడు దొరకుటకు అని యడిగిరి. అందుకామె అట్లతద్దె, దీపాలవేళదాకనుండి నోము నోచుకొన్నాను. ముసలిమగడు పడుచుమగడు అయినాడు అని చెప్పెను.

ఉద్యాపనము:—కలియుగమం దందరును అట్లతద్దెనోము పట్టి పదేసి అట్లు నైవేద్యముపెట్టి పదేసిఅట్లు వాయినమునిచ్చి యీ విధిగా పదేండ్లు నోచుకొని యీకథచెప్పి అక్షంతలువేసుకొని పదేండ్లు అయిన తరువాత పదిమంది ముత్తయిదువలకు పదేసిఅట్లుఒకడబ్బ నల్లపూసలు లక్కజోళ్లుతో వాయనమీయవలయును. కథలోపమైనా వ్రత లోపముకాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

---

## 5 శ్రావణమంగళవారముకథ.

ఒకబ్రాహ్మణుడు సంతానములేక చింతిల్లుచు తపస్సు చేయ దొడగెను. ఆసమయమున పార్వతీపరమేశ్వరులు భూమి పాలించవచ్చి యీబ్రాహ్మణునిగాంచి ఓబ్రాహ్మణుడా! ఎందువలన నీవీ తపస్సు చేయుచుంటివి అని యడిగిరి. అందుకాతండు మీ రేమి అర్చ్చేవారా? తీర్చ్చేవారా? మీకెందుకు మీతోవ్రవను బోండని చెప్పెను. వారును ఆర్చ్చేవారము మేమే. తీర్చ్చేవారముమేమే. కారణమేమో చెప్పుమనిరి. సంతానహీనుడనై యిట్లు తపస్సుచేయదొడగితిని. నాకీ కోరిక దీర్చి నన్ను రక్షింపవలయునని దీనుడై యాబ్రాహ్మణుడు వారల వేడుకొనెను. వారు ఆయుష్యులేని మగవాడుకావలెనా? అయిదవతనము

లేని యాడుదికావలయునా యని యడిగిరి. అప్పుడా బ్రాహ్మణుడింటికి బోయి నాభార్యనడిగి వచ్చెదనని చెప్పెను. వారట్లనే కానిమ్మనిరి. బ్రాహ్మణుండింటికిబోయి భార్యనుచూచి, ఆయువుమాలినమగవాఁడు కావలయునా? అయిదువతనములేని యాడుది కావలయునా? యని యడిగెను. పుట్టి చచ్చినను పుత్రుడేమేలు. పుత్రునేయిమ్మని యాసాధ్వి యుత్తరమిచ్చెను. అంతనా బ్రాహ్మణుం డతివేగముగ దాను తపస్సు చేయుచోటికి బోయి పుట్టి చచ్చినను పుత్రుడేమేలు. కాబట్టి పుత్రునే కోరమని నాభార్య వేడికొనెనని చెప్పెను. అంతవారు ఊరి వెలుపల నొక మామిడిచెట్టున్నది. దాని నొకపండు కోసికొనిపోయి నీ భార్య కిమ్మని వారంతర్ధానమునొందిరి. అప్పుడా బ్రాహ్మణుఁ డొక ముంత మామిడిచెట్టుదగ్గరకు పోయి చాలపండ్లుకోసికొని వడిలో వేసుకొని యింటికివచ్చి చూచుకునేసరికి వడిలో నొక్కపండుమాత్రమే యుండెను. ఆతడాపండును తినుమని భార్యకిచ్చెను. ఆపండు నామె భక్షించి గర్భముదాల్చి యంత తొమ్మిదినెలలు నిండినవెనుక నొకకొడుకును గనియెను. ఆశిశువు పుట్టీ పుట్టకపూర్వమే యమభటులువచ్చి వానిని మాకిమ్మని తల్లినడిగిరి. ఆమెయు నాయనలారా! యీశిశువునకుపురుడు బోసినామా యని దీనవదనయై పలికెను. అంతనాయమభటులు వెళ్ళిపోయి పురుడు పుణ్యములైనతరువాత వచ్చి యెప్పటియట్ల పిల్లవాని నీయుమనియడిగిరి. అందుకామె, యీనాకన్నకొడుకు భారసాలచూచినామా? ఆటపాటలుచూచినామా ? అనిపలికెను. అంతట వారేగి, తిరిగి భారసాల అయినపిమ్మటవచ్చిరి. వారినిచూచి పుట్టువెండ్రుకలు చూచినామా? వడుగు చూచినామా? నాయనలారా! అని బ్రతిమాలెను. వారును, ఎప్పటియట్ల మరలిపోయిరి. అంత గొన్నాళ్ళకా పిల్లవానికి దలిదండ్రు లుపనయనమహోత్సవము గావించిరి. తరువాత నొకనాఁడు తల్లి కొడుకునకు తలంటుచునేడ్చెను. ఆమెకంటినీళ్ళా పిల్ల

వానిపై బడుటచేత దెలిసికొని, ఏమి? అమ్మా! ఇట్లు దుఃఖించుచు న్నానని యడుగగా, ఆమె నాయనా! నీవుపుట్టినదిమొదలుకొని యమ భటులు నీకొరకువచ్చుచున్నారు. నీవడుగయినదాక జరుపుకొని వచ్చి నాము. ఇక నెట్లుజరుపవచ్చునాయని యేడ్చుచున్నానని చెప్పెను. అంతనాపిల్లవాడు ధైర్యమవలంబించి అమ్మా! నాకువచ్చిన భయము లేదు. మా మామనుజతయిచ్చి నన్ను కాశికిబంపుమనిచెప్పెను. అందు కామెసమ్మతించి మేనమామకు కబురంపి కొడుకునకాతని జతయిచ్చి పంపుచు నేమియుబలుకలేక కన్నులనీరుబెట్టసాగెను. అమ్మా! ఎందుల కేడ్చెదవు. నేను తులసిమొక్కనొకదానినిందువేసి వెళ్ళెదను. దాని శాగోగులం బట్టి నా స్థితిగతులు నీకు తెలియుచుండును. అది చచ్చిన యెడల నేను నశ్లెయగుదునని తెలిసికొనుము. అని చెప్పి చాలినంతధనము పుచ్చుకొని కాశికి ప్రయాణమై పోవుచుండె. వారికి త్రోవలో నొకపూలతోట గనబడగా, ఆరోజున నచ్చట బసదిగిరి. అంత నాపట్టణపు రాజకుమార్తెయును, పురోహితునికూతు రును, సెట్టికూతురును, సెత్తనదారుకూతురును కలసి పూలు కోసికొ నుట కా వనమునకువచ్చిరి. వారు పువ్వులను గోసికొని తిరిగి వెళ్లుచు మాటపట్టింపులచే పోట్లాడి, నీవు ముండవు అంటే నీవుముండవు అని తిట్టికొనిరి. ఆ తిట్లకు రాచవారిపిల్ల కోపగించుకొని నాకీరాత్రి పెండ్లి. మాఅమ్మగారు శ్రావణమంగళవారము నోమునోచుకొని నాకు వా యనమిచ్చును. నన్ను ముండా అని తిట్టకండి. అని పువ్వులు పారపో సెను. చూచువారికి ఆశ్చర్యముగ నాపువ్వ్వలేకొమ్మవి ఆకొమ్మకు అంటుకొనెను. ఆచిత్రము నాబ్రాహ్మణకుమారుడుచూచి యాశ్చర్య పడి ఆహా! యీచిన్నది యెంతసత్యవాదినియో అని పొగడికొని యీమె నాకు భార్య అయినయెడల బాగుండునుగదా యని తనలో ననుకొనెను. ఆసంగతులను ప్రక్కనున్న మేనమామ గ్రహించి

అబ్బాయీ! మనము కాశీవెళ్లుచున్నాము. మన పుట్టినిలంపులను తలపెట్టరాదు అని పలికెను. ఇంతలో ప్రొద్దుగ్రుంకు సమయము కాగా నాపిల్లలు వారివారియిండ్లకేగిరి. రాజకుమార్తెను పెండ్లికుమార్తెను జేసి ముహూర్తము సమీపించుచున్నందున పెండ్లికుమారుని రాకకై రాజు మొదలైనవా రెదురుచూచుచుండిరి. ఇంతలో పెండ్లికుమారునకు మూర్ఛవచ్చి పడిపోయినాడు. ఇప్పుడు పెండ్లికి రావీలు లేదని యొకజాబు రాజుగారికి అందెను. ముహూర్తము సమీపించుచుండుటచేత, ఆహా! వేళ మిగిలిపోవును. ఎరవుపెండ్లికొడుకెవరు దొరకునా యని యాతడు పట్టణమందరిని అడిగెను. ఎరవుపెండ్లికొడుకున కెవ్వరును వప్పుకోరైరి. నగ యెరవుండును. బట్ట యెరవుండును గాని పెండ్లికొడుకు, ఎరవేమిటి అని నవ్వసాగిరి. అంత నాతడూరంతయు తిరిగి బ్రాహ్మణకుమారుడున్నతోటలోనికివచ్చి యక్కడ యెవరో మనుష్యులున్నారని వారివద్దకేగి వారిని లేపెను. వారు ఉలికిపడిలేచిరి. రాజాపిల్లవాని మేనమామనుచూచి అయ్యా! యీ పిల్లవానినొకసారి యెరవిచ్చెదరా యని యడిగెను. అయ్యా! ఎరవేమిటి? మేము తెల్లవారుజామున లేచి కాశికిపోవనున్నాము. కావున వీలులేదని చెప్పెను. రాజుగారు ముహూర్తము దాటిపోవుచున్నది. కాదు కూడదని బలవంతముచేసి, మేనమామను ఒప్పించి, యా పిల్లవానిని తనయింటికి దీసికొని పోయెను. అట్లు తీసికొనివెళ్ళి మంగళస్నానాదుల నాచరింపజేసి యాపిల్లదానితోగూడ పెండ్లి అరుగుపైకి దీసికొనిపోయి సంతోషముతో వివాహకార్యమును జరిగించెను. తరువాత నాపిల్లవానికి బంగారుగిన్నెలో ఫలహారము లుంచగా నాతడవి తినుచుండ వ్రేలియుంగరము జారి యాగిన్నెలో పడిపోయెను. ఆయుంగరము నాచిన్నది పదిలముగ దీసికొని తనవ్రేలిని పెట్టుకొని యారాత్రి నిద్రించుచుండగా కలలో పార్వతీదేవి యామెకు కనిపించి, నీపెనిమిటికి సర్పగం

డమున్నది. కాచుకొమ్మని యానతిచ్చెను. అందుప కారాజకుమార్తె అమ్మా! ఏమిచేసిన నది తప్పునో సెలవియ్యవలయునని ప్రార్థించెను. నీతల్లి శ్రావణమంగళవారము నోముపట్టినకుండను పాము రాగానే పట్టుము. అందులో నది పడునని చెప్పెను. ఆరాత్రి భర్త నిద్రించుచుం డగా బుస్సుమని బుసకొట్టుచు పాము వచ్చుచుండెను. అది కనిపెట్టి యాచిన్నది భయపడక పైనున్న కుండకై చేయిచాచెను. అది అందక పోయెను. ఓహో! కార్యము తప్పి వచ్చుచున్నదే యని చెప్పి భర్త తొడపై కెక్కి యాకుండనందుకొని చప్పున పాముదిక్కునకు ఒగ్గెను. ఆపాము వచ్చి యాకుండలో పడగా ఆచిన్నది యొకరవికెలగుడ్డచే నా కుండకు వాసిన కట్టి యొకచో దాచిపెట్టి నిద్రపోయెను. అంత తెల్ల వారుజాముకాగా పిల్లవానిమేనమామ వచ్చి యాతని లేపుకొని తీసి కొనివెళ్ళెను. అంత తెల్లవారెను. మరల పెండ్లిప్రయత్నముచేసి పెండ్లి కొడుకును దీసికొనిరాగా నాకతడు భర్త కాడు. కాశీకివెళ్ళినయాతడే కాని యని యామె చెప్పెను. దానికేమి ఆనమాలు అని అందరు నడి గిరి. అప్పు డాచిన్నది తండ్రినిచూచి, తండ్రీ! నీవు యేడాది అన్న దానముచేయుము. నేను తాంబూలదానము చేయుదునని చెప్పి ఆప్ర కారము జరిగించుచుండెను. అంత యేడాది పూర్తి కాగా కాశీకిబో యిన అల్లుడు మామలు కాశినుండి తిరిగి వచ్చుచు మునుపటిపూవుల తోటలోనే దిగిరి. అక్కడ వారు పడుకొనబోతే వారినిచూచినవారు, అయ్యా! మీరూరక యేల పడుకొనెదరు? ఈపట్టణపురాజుగారన్న దానము చేయుచున్నారు. ఆయనకుమార్తె తాంబూలదానము చేయు చున్నది. మీరక్కడికి బోవుడని తెల్పిరి. ఆప్రకారము వారు వెళ్ళిభోజన మొనర్చి తాంబూలమునిమిత్తమై యాచిన్నది యున్నచోటికిబోయిరి. బ్రాహ్మణకుమారుని మేనమామకును, వానికిని, తాంబూలమిచ్చి ఇదిగో నాపతి యని యాచిన్నది వానిచేయిపట్టుకొనెను. నీపెనిమిటి

యగుటకేమి యాధారమున్నదని యందరు నడిగిరి. అప్పుడు భర్తవంక దిరిగి మీరు, పెండ్లినాడు భోజనమొనర్చువేళ బంగారపుగిన్నెలో మీవేలియుంగరము జారిపడిపోయినది. అది ఇదిగో యని యాతని వ్రేలినుంచెను. అది సరిగ సరిపోయెను. తరువాత పెండ్లినాడు పార్వతీదేవివచ్చి నీభర్తకు సర్పగండ మున్నదని చెప్పెను. దానికి నేనేమి చేయవలెనని అడిగినాను. మీఅమ్మ శ్రావణమంగళవారము నోము నోచుకున్నది. ఆకుండ నొగ్గవలసిన దనిచెప్పి యంతర్థానమొందగా నే నాకుండను నగ్గుటకు పామువచ్చినప్పుడు ప్రయత్నించినాను. అంది నదికాదు. అప్పుడు నాపెనిమిటితొడలపై కాలువైచి అందుకున్నాను. అదిగో చూడండి. పసుపుపారాణికాలు తొడమీద నున్నది. అని చూపించెను. పరీక్షించి చూడగా ఆ యానవాలా తొడలపై కనిపించెను. కుండపట్టుకొని వచ్చి విప్పిచూడగా బంగారుసర్పమైయుండెను. అందున కందరును ఆమోదించిరి. అప్పుడు అబద్ధము. ఇప్పుడు నిజము అని, ఆకాశమంత పందిరివేసి భూమిదేవంత అరుగువేసి గుచ్చిన ముత్యాలు తోరణాలుకట్టి గుచ్చనిముత్యాలు తలబ్రాలుపోసి దెబ్బది యోగముల వారిరువురకు నారాజు పెండ్లిచేసెను. అటుపిమ్మట నా చిన్నది శ్రావణమంగళవారము నోముపట్టి ఆకాటుక పట్టుకొని వారితో సత్తవారింటికి వెళ్లెను. ఇట్లు వెళ్లుసరి కత్తగారును మామ గారును కుమారుని వియోగదుఃఖముచేత కన్నులు కాళ్లులేనివారై యుండిరి. ఊరివారందరు పరుగు పరుగునవచ్చి సోమయాజులుగారూ! సోమిదేవమ్మగారూ! మీకొడుకు కోడలు వచ్చుచున్నారని చెప్పిరి. అయ్యో! మాకెక్కడికోడలు? మాకెక్కడికొడుకు? నాడే పోయి నారు అని వగచుచుండిరి. అప్పుడు బాజాచప్పుడు చెవులలో ప్రవేశించి వారికి చెవులు వచ్చెను. కోడలువచ్చి అత్తమామలకు నమస్కారము చేయగా వారికి కాళ్లువచ్చెను. కౌగిలించుకొనగా నడుము వచ్చినది.

కొట్టుకపెట్టగా కన్నులువచ్చెను. ఏమినోముపట్టినావు ? ఏమివ్రతము పట్టినావు ? అని అందరు అడిగిరి. నేను శ్రావణమంగళవారమునోము పట్టినానని వారికిజబాబుచెప్పెను. ఆమె నోచిననోము కలియుగములో నందరు నోచి యామెవలెనే సౌభాగ్యవతులై భూలోకమున ప్రసిద్ధిగాంచిరి. కథలోపమైనా వ్రతలోపముకారాదు. భక్తితప్పినా ఫలంతప్పదు.

దీనికి ఉద్యాపనము:—తొలియేట ఐదుగురు ముత్తయిదువలకు, మలియేట పదిమంది ముత్తయిదువలకు, మూడవయేట పదిహేనుమంది ముత్తయిదువలకు, నాలుగవయేట యిరువదిమంది ముత్తయిదువలకు, అయిదవయేట ఇరువది అయిదు ముత్తయిదువలకు, వాయసములు ఇచ్చుకొని, అయిదుయేళ్ళు అయినతరువాత పెండ్లినాడు పెండ్లికూతురునకు మట్టెలు మంగళసూత్రములు క్రొత్తకుండలో ముప్పది మూడుజోడుల అరిసెలుపెట్టి క్రొత్తరవికలగుడ్డచే వాసెనకట్టి పెండ్లికూతురునకు అందియ్యవలయును.

## 6. వరలక్ష్మీవ్రతకథ.

సకల మహర్షులను గాంచి సూతుం డిట్లనియె. మునీశ్వరులారా! స్త్రీలకు సకలసౌభాగ్యముల నొసంగునట్టి వ్రతరాజమును పార్వతీదేవికి పరమేశ్వరుడు చెప్పియున్నాడు. దానిని చెప్పెద వినుండు. కైలాసమున మణిగణఖచితమగు సింహాసనమున గూర్చుండియున్న పరమేశ్వరునిగాంచి పార్వతీదేవి నమస్కరించి దేవా ! లోకములో స్త్రీలు ఏవ్రతమాచరించిన సకల సౌభాగ్యంబులును పుత్రపౌత్రాదులుం గలిగి సుఖంబుగ నుందురో యావ్రతంబు చెప్పవలెననిన పరమేశ్వరుండు సంతసమున నిట్లనియెను. ఓ మనోహారిణీ! స్త్రీలకు అట్టిసౌభాగ్యాదిసంపత్తి కలుగజేసెడివ్రతము వరలక్ష్మీవ్రతంబను నది కలదు. ఆవ్రతమును శ్రావణమాసశుక్లపక్షపూర్ణిమకుముందువచ్చు శుక్రవారమునాడు చేయవలయు ననిన పార్వతీదేవియిట్లనియె. ఓలోక

వంద్యా ! నీ వానతిచ్చిన వరలక్ష్మీవ్రతంబు నెట్లు చేయవలయును ? ఆవ్రతంబునకు విధి యేమి ? ఏదేవతను పూజింపవలయును ? పూర్వమెవరిచే యీవ్రత మాచరింపబడియె ? వివరంబుగ దెలుపవలయు ననిన పార్వతికి పరమేశ్వరుడు చెప్పుచున్నాడు. ఓగౌరీ! వరలక్ష్మీవ్రతము సవిస్తారముగ చెప్పెదవినుము. మగధదేశంబున కుండినంబను నొకపట్టణంబు కలదు. ఆపట్టణము బంగారుగోడలచేతను బంగారుయిండ్లతోడను ప్రకాశించుచుండెను. అట్టిపట్టణమున చారుమతియనునొక బ్రాహ్మణసాధ్వికలదు. ఆమానినీమణి భర్తను దేవునితో సమానునిగాదలంచి ప్రతిదినమును, నుదయమున మేలుకొని స్నానముచేసి పూవులచే భర్త పాదంబులు పూజించి పిదప నత్తమామలకు వివిధోపచారంబు లొనర్చి యింటిపనులు చక్కజేసికొని గయ్యాళికాక మితముగాను ప్రియముగాను భాషింపుచుండెను. ఇట్లుండ ఆ పతివ్రతయందు మహాలక్ష్మికి అనుగ్రహముకలిగి యొకనాడు స్వప్నమున కనబడి, ఓ చారుమతీ ! నేను వరలక్ష్మీదేవిని నీయందు నాకు దయవచ్చి ప్రత్యక్షమైతిని. శ్రావణశుక్ల పూర్ణిమకు ముందుగావచ్చెడు శుక్రవారమునాడు నన్ను పూజించిన నీకోరికలు నెఱవేర్చెదనని యానతిచ్చిన, చారుమతి స్వప్నములోనే వరలక్ష్మీదేవికి ప్రదక్షిణ నమస్కారములు చేసి.

శ్లో. "నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే
శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే."

అని యనేకవిధములుగ స్తుతియించి, ఓతల్లీ ! నీకటాక్షంబు కలిగెనేని జనులు ధన్యులుగను, విద్వాంసులుగను, సకలసంపన్నులుగను నయ్యెదరు. నేను పూర్వజన్మమునచేసిన సుకృతవిశేషమున నీపాదసందర్శనము నాకు లభించెను, అని స్తుతియించిన మహాలక్ష్మి సంతోషము చెంది చారుమతి కనేకవరంబులొసగి యంతర్ధానమయ్యెను. చారు

సతి వెంటనే నిదుర మేల్కొని గృహము నాలుగుతట్టులను కలయం జూచి వరలక్ష్మీదేవిని గానక, ఓహో! నేను కలగంటినని యాస్వప్న వృత్తాంతమును భర్త మొదలగువారితో జెప్ప, వారు, ఈస్వప్నము మిగుల నుత్తమమైనది. శ్రావణమాసంబు వచ్చినతోడనే వరలక్ష్మి వ్రతమును తప్పక చేయవలయునని చెప్పిరి తరువాత చారుమతియు స్వప్నంబువిన్నస్త్రీలును శ్రావణమాస మెప్పుడువచ్చునని యెదురు చూచుచుండిరి. ఇట్లుండ వారిభాగ్యవశమున శ్రావణపూర్ణిమకు ముందుగవచ్చెడి శుక్రవారమువచ్చెను. అంత చారుమతి మొదలగు స్త్రీలందఱును, ఈదినమేకదా వరలక్ష్మీదేవి చెప్పినదినంబని స్నానాదుల నాచరించి చీనిచీనాంబరంబులు ధరించి చారుమతిగృహంబున నొక చోట గోమయంబుచే నలికి మంటప మేర్పరచి యం దాసనమువైచి దానిపై క్రొత్తబియ్యముపోసి మఱ్ఱిచిగుళ్లు మొదలగు పంచపల్లవములచే కలశంబు నేర్పరచి, యందు వరలక్ష్మీదేవిని ఆవాహనముచేసి వారందఱును మిగుల భక్తియుక్తులై సాయంకాలమున

శ్లో॥ "పద్మాసనేపద్మకరే సర్వలోకైకపూజితే
నారాయణప్రియేదేవి సుప్రీతాభవసర్వదా."

అనుశ్లోకముచే ధ్యానావాహనాది షోడశోపచారపూజలుచేసి తొమ్మిది సూత్రంబులు కల తోరంబును దక్షిణహస్తంబులకు గట్టుకొని వరలక్ష్మీదేవికి భక్ష్యభోజ్యంబులచే నైవేద్యమొనర్చి ప్రదక్షిణంబు చేసిరి ఇట్లొక ప్రదక్షిణము చేయగనే యాస్త్రీల కాళ్లయందు ఘల్లుఘల్లు మను నొకశబ్దము కలిగెను. అంత కాళ్ళను జూచుకొనిన గజ్జెలు మొదలగు నాభరణంబులు కనబడెను. వారలందరు, ఓహో! వరలక్ష్మీదేవి దయవలన కలిగినవని పరమానందబునొంది మరియొక ప్రదక్షిణముచేయగా, హస్తంబుల ధగద్ధగాయమానంబుగ వెల్గుచు రత్న

మణికంకణంబులు మొదలగు నాభరణంబులు కనబడెను. ఇంతయేల ? మూడవ ప్రదక్షిణంబు గావించినతోడనే యాస్త్రీలందరు సర్వభూష ణాలంకృతలైరి. వారిగృహంబులు సువర్ణమయంబులై రథగజతురగాది వాహనంబులతో నిండియుండెను. అంత నా స్త్రీలం దొడ్డొక్కనిపోవు టకు వారివారియిండ్లనుండి గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, నా వరలక్ష్మీపూజచేయుస్థలమునకు వచ్చి నిలిచియుండెను. తరువాత చారుమతి మొదలగుస్త్రీలు తమకు కల్పోక్త ప్రకారంబుగ పూజచే యించిన బ్రాహ్మణుని పూజించి పండ్రెండుకుడుములు వాయనదాన మిచ్చి దక్షిణతాంబూలము లొసంగి నమస్కరించి యాబ్రాహ్మణు నిచే నాశీర్వాదము నొంది వరలక్ష్మీదేవికి నైవేద్యము గావిం చిన భక్ష్యాదులను బంధుమిత్రబృందముతో భుజించి తమతమవాహన ములనెక్కి తమతమగృహంబులకు జనుచు, నొకరితో నొకరు ఓహో! చారుమతీదేవిభాగ్యమేమని చెప్పనొప్పును ? వరలక్ష్మీదేవి తనంతట తానే స్వప్నములో దర్శనమిచ్చెను! ఆచారుమతీ దేవివలననే కదా మనకిట్టి భాగ్యము కలిగె! అని చారుమతీదేవిని మిక్కిలి కొని యాడిరి. తరువాత చారుమతీదేవి మొదలగు కాంతలెల్లరును నీవ్రతం బును ప్రతిసంవత్సరమున జేయుచు పుత్రపౌత్రాభివృద్ధికలిగి ధనకనక వస్తువాహనసమృద్ధిం గాంచి సుఖంబుగ నుండిరి. కావున నో పార్వతీ! యీయుత్తమవ్రతమును బ్రాహ్మణులు మొదలగు నాలుగుజాతుల వారును జేయవచ్చును. అట్లుచేసిన సర్వసౌభాగ్యంబులు గలిగి సుఖిం తురు. ఈకథ వినువారలకును చదువువారలకును వరలక్ష్మీప్రసాదము వలన సకలకార్యసిద్ధి కలుగును.

---

## 7. చిట్టిబొట్టుకథ.

చిట్టిబొట్టు పట్టవలె. సిరిగలయింట పుట్టవలె. ఏడుగురన్నలతోడ బుట్టవలె ఏకచక్రిముగా నేలవలె. పదుగురన్నలతోడ బుట్టవలె. పట్టభద్రునిచెట్టపట్టవలె.

మాఘపూర్ణిమముందు రథసప్తమినాడు, ఈకథచెప్పి అక్షతలు వేసుకొని, ఏడాదిదాక, అయిదుగురు ముత్తయిదువలకు ప్రతిదినమున బొట్టుపెట్టుకొనుచు, ఏడాది నిండినతరువాత ఉద్యాపనము చేసికొనవలయును.

ఉద్యాపనము:—అయిదుగురు ముత్తయిదువలకు తలంటి నీళ్లు పోసి పిండివంటలతో భోజనము పెట్టి బంగారపు బొట్లుచేయించి అయిదుగురుముత్తయిదువలకు, అయిదుబొట్లు, అయిదురవికలగుడ్డలు దక్షిణ తాంబూలమునిచ్చి నల్లపూసలు లక్కజోడు, యివ్వవలెను. కథ లోపమైన వ్రతలోపము కారాదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

---

## 8. పసుపుగౌరి.

నూరుపసపు నోచినదానికు నూఱువేలేండ్లు అయిదువతనము. కోట్టుపసపు నోచినదానికు కోటివేలయేండ్లు అయిదువతనము. ఈకథ చెప్పి అక్షతలు వేసుకొని యేడాది అయిన తరువాత మానెడుసోలెడు పసపు వెదురుపెట్టెలో పోసి రవికలగుడ్డ, దక్షిణ, తాంబూలము నల్లపూసలు లక్కజోడులతోడ ముత్తయిదువకు వాయనము ఇవ్వవలెను. పసపు నరగదీసి గిన్నెనిండపెట్టి రవికలగుడ్డ, దక్షిణ, తాంబూలము నల్లపూసలు లక్కజోడుపెట్టి ముత్తైదువ కివ్వవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

---

## 9. మొగదోసిళ్లకథ.

ఒక బ్రాహ్మణునికూతురు మొగదోసిళ్లనోముపట్టి యదియుల్లంఘనచేసి చనిపోయెను. ఆమె మరుజన్మమున మరియొక బ్రాహ్మణుని యింట పుట్టెను. అల్పకాలములోనే తల్లిచనిపోవుటచేత నామెకు సవతితల్లివచ్చెను. ఆమె దరిద్రబాధ కలిగినదై యది సహింపజాలక యొకనాడు దేవాలయములోనికి వెళ్ళి ధ్వజస్తంభమువద్ద కూర్చుండి యెండనక వాననక విచారించుచు పరమేశ్వరుని ప్రార్థించుచుండెను. కొంతకాలమున కామెయందు దయగలవాడై యీశ్వరుడు ప్రత్యక్షమై, ఏమియోచిన్నదానా! యిట్లు విచారించుచున్నావని యడిగెను. బ్రాహ్మణరూపముచే ప్రత్యక్షమైన యాయీశ్వరునినామె సామాన్యమనుజునిగ నెంచి నాయనా! మీ కెందుకు వెళ్ళుండని ప్రత్యుత్తరమిచ్చెను అది విని భగవంతుడు, ఓకాంతా! నీతలంచుకార్యంబు నేనుదీర్చువాడ చెప్పుమని యడిగెను. అంతనామె, నేనొక్కబ్రాహ్మణుని కుమార్తెను. నాకు సవతితల్లి యున్నది. దరిద్రముచేత, సవతితల్లిచేత బాధపడలేక యిట్లు విచారించుచున్నానని చెప్పెను. అంత నీశ్వరుండు, ఓయింతీ! నీవు పూర్వజన్మమున మొగదోసిళ్ళనోముపట్టి యుల్లంఘనచేసినావు. కాబట్టి నీకీ దరిద్రబాధ, సవతితల్లిపోరు సంప్రాప్తమైనవి. నీవిప్పుడానోముపట్టి ప్రతిదినము నోడలికి నీళ్ళుపోసుకొని పసుపు కలిపి యొకపళ్ళెములో రోజూమూడుదోసిళ్లు నీళ్లులెక్కచూచి పోసికొని యేడాదియైనతరువాత మూడుదోసిళ్ల ముత్యములు, మూడుదోసిళ్లపగడములు శివుని యాలయములోనికి పట్టుకొనివెళ్ళి శివుని రుద్రపాదముమీద పూజచేసి యథాశక్తి దక్షిణతాంబూలాదుల నియ్యవలెను. అని చెప్పి యీశ్వరుం డంతర్థానము నొందెను. ఆబ్రాహ్మణచిన్నదియు భగవంతుడు చెప్పినరీతి నాచరించి సకలైశ్వర్య సంపన్నురాలై సుఖంబున

నుండె. కథ లోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

---

## 10. చిత్రగుప్తునినోముకథ.

ఒకరాజుభార్య, ఒకమంత్రిభార్య, బ్రాహ్మణముత్తైదువలను పెట్టుకొని నోములు వ్రతములు చేయుచుండెడివారు. ఆ వ్రతములలో మరువకుండ మంత్రి భార్య చిత్రగుప్తుని నోము నోచెను. రాజుభార్య ఆవ్రతము పట్టక మాని వేసెను. కొన్నాళ్లకు మంత్రిభార్య చచ్చిపోయెను. చిత్రగుప్తుడు, ఆమె పాపములువిడిచి పెట్టి ఈమె అంతయు పుణ్యమేచేసినదని చెప్పి యామెకు పుణ్యలోకప్రాప్తి కలిగించెను. పిమ్మట రాజుభార్యచచ్చిపోయి చిత్రగుప్తుని యొద్దకు వెళ్లగా, ఈమె అంతయు పాపమే చేసినదని చెప్పెను. అందు కామె దుఃఖించుచు నేనును మంత్రిభార్యయు సమముగా వ్రతములు నోచుకొన్నాము. ఆమెకు పుణ్యము వచ్చి నాకు పాపము యెందుకు వచ్చినదని యాచిత్రగుప్తు నడిగెను, అప్పుడు మంత్రిభార్యవచ్చి, నీవు చిత్రగుప్తునినోము పట్టలేదు. అందుచేత నీకునరకమువచ్చినదనిచెప్పెను. అందుకు రాజుభార్య, నేనిప్పుడేమిచేసిన నాకీ నరకబాధ తప్పునో చెప్పవలెనని అడిగెను. నీవు చిత్రగుప్తునినోముపట్టి ఏడాది అక్షతలు వేసుకొని ఎన్మత్తొక్కనివడ్లు అయిదుకుంచములు కట్టులేనిగంపలో పోసి, అయిదుమూళ్ళ పట్టుపంచె, అర్ధడుతవ్వెడు బియ్యము ఒకగుమ్మడిపండు యథాశక్తి దక్షిణతాంబూలముపెట్టి వెండిఆకు పైడిగంటము నుంచి తోడబుట్టినవానికైనను, గ్రామకరణమునకైనను అందియ్యవలయునని చెప్పెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినాఫలము తప్పదు.

---

## 11. విష్ణుకాంతకథ.

ఒక బ్రాహ్మణుని భార్య తనతోడబుట్టినవానికి పెండ్లితలపెట్టినప్పుడెల్ల భర్తకు వ్యాధి సంభవించుచుండెను. ఈయాటంకముచేత అనేక పర్యాయములు సిద్ధమైన పెండ్లికార్యము మానివేయుచు వచ్చిరి. కొన్నాళ్ళకు బంధువులందరు ప్రాణము విసిగినవారై, యెన్నాళ్ళీలాగున పెండ్లికార్యము మానుదుమని పెండ్లిముహూర్తము నిశ్చయించిరి. అంత నాబ్రాహ్మణునికి ప్రాణముమీదికివచ్చెను. అతనిభార్య యాజబ్బు సరకుసేయక వానిని యింటిలోనుంచి తలుపుగొళ్లెముపెట్టి తోడబుట్టిన వాని వివాహమునకు వెళ్ళిపోయెను. ఆమె చెరువుగట్టు వద్దకు వెళ్లుసరికి యచ్చట విష్ణుకాంతపువ్వులు విడిచియుండెను. ఆ పువ్వుల నామె కాలదన్నుకొని చక్కపోవుచుండెను. అంత విష్ణుకాంత నోచినది. విను కాంతనోచినది. నోచినపువ్వులు కాలనుతన్నుకొని పోవుచున్నది. చెఱువులోనున్న చామంతులారా! చూచినారా? అని యొకధ్వని వినబడెను. ప్రేమముగల ప్రాణేశ్వరునకు ప్రాణముమీదకు రాగా, చాపనిచుట్టి నట్టింటపెట్టి దయగలతమ్మునిపెళ్ళికి వెళ్ళుచున్నది ఊరకొందు విష్ణుకాంతా! అని మరల ప్రత్యుత్తరమిచ్చెను. ఈమాటలాబ్రాహ్మణునిభార్య విని యేమి మాట్లాడకుండ వెళ్ళిపోయెను. ఆమె తమ్మునిపెండ్లి అయినతరువాత తిరిగి యామార్గమున వచ్చుచుండెను. వెళ్ళబోయే సమయమున తానాపువ్వుల నెచ్చటచూచెనో యాచోటికి బోయి, విను విష్ణుకాంతా! మీరందరు ఏమి చెప్పుకొన్నారని యడిగెను. విన్నప్పుడు మానినావుగనక నా యిప్పుడు నీకెందుకు. వెళ్ళమని విష్ణుకాంత చెప్పగా నాబ్రాహ్మణునిభార్య, అమాటలుచెప్పినగాని వల్లకాదు. నేను వెళ్లనని చెప్పెను. ఓబ్రాహ్మణకాంతా! ప్రేమగల ప్రాణేశ్వరునకు ప్రాణముమీదికిరాగా నట్టింటపెట్టి, దయగలతమ్ముని పెండ్లికివెళ్ళిన దన్నానని చెప్పెను. నీ వెందుచేత నీలాగు చెప్పినావని

యడుగగా నాబ్రాహ్మణ స్త్రీకి విష్ణుకాంత యిట్లని చెప్పెను. నీవు ముందు జన్మమున విష్ణుకాంత నోముపట్టి ఉల్లంఘన చేసినావు. అందుచేత నీతమ్మునికి పెండ్లి తలపెట్టి నప్పుడు నీపెనిమిటికి ప్రాణమునీూదికి వచ్చుచుండెను. ఇప్పుడు నీవానోముపట్టి ఉద్యాపన చేసుకొని అక్షతలువేసుకొన్నయెడల నీకు సిరి, సంపద, అయిదువ తనము వృద్ధియగునని చెప్పెను

ఉద్యాపనము:—ఏడాది అయినతరువాత పదమూడుజోడుల నేతిగారెలు వాయనము, పదమూడుజోడులు నైవేద్యంపెట్టి, విష్ణుకాంతపుష్పలతో పూజచేసుకొని దక్షిణతాంబూలముతో ముత్తయిదువకు ఇవ్వవలయును. కథలోపమయినా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పును.

---

## 13. కందగౌరి.

ఒకబ్రాహ్మణునకొక కుమార్తె కలదు. ఆచిన్నది అస్తమానము ఏడ్చుచుండెడిది. ఎన్నినోములునోపించినను, ఏడ్చుట మానలేదు. తండ్రికూతుగుని అడవిలోకి తీసుకొనివెళ్ళి విచారించుచు కూర్చుని యుండగా పార్వతీపరమేశ్వరులు భూమి పాలించడమునకువచ్చి, ఏమి బ్రాహ్మణుడా! ఇక్కడ కూర్చుండి విచారించుచున్నావని యడిగిరి. మీూ కెందుకు, ఆర్చెడివారా! తీర్చెడివారా? వెళ్ళండి, అని యా బ్రాహ్మణుడుచెప్పగా, ఆర్చేవారము మేమే తీర్చేవారము మేమే. చెప్పవలసినదని తిరిగి యాబ్రాహ్మణుని పార్వతీపరమేశ్వరులడిగిరి. అప్పుడాబ్రాహ్మణుడు ఈపిల్ల, ఊరక యేడ్చుచుండును. అందుచేత భరింపజాలనివాడనై యిక్కడికి తీసికొనివచ్చి ఏమియుతోచక విచారించుచున్నానని చెప్పగా పార్వతీపరమేశ్వరులు, ఈచిన్నది. క్రిందటి జన్మమున కందగౌరి నోముపట్టి ఉల్లంఘన చేసినది. అందుచేత

నీయేడుపు సంభవించినది. ఇప్పుడైనా, ఏడాదికథ చెప్పి అక్షతలువేసికొని నీసేయేబులం కందదుంప వెండిదుంప బంగారపుదుంప చేయించి ముత్తైదువకు రవికలగుడ్డ దక్షిణతాంబూలము నల్లపూసలు లక్కజోడు పెట్టి వాయన మిచ్చినయెడల నీయేడుపుకుదురునని చెప్పి వారంతర్ధానము నొందిరి. అప్పుడాబ్రాహ్మణుడు కూతురును తీసుకొని యింటికివెళ్ళి పార్వతీపరమేశ్వరులు చెప్పినప్రకారము యథావిధిగ కందగౌరినోము పట్టించి ఉద్యాపనము చేయించెను. నాటినుండి యాబ్రాహ్మణుని కుమార్తె యేడుపుమాని సకలసంపదలతో భూలోకమున సమస్తసౌఖ్యముల ననుభవించెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 13 ఉప్పుగౌరి.

దాకనిండా ఉప్పుపోసిన దేకినదాక, అయినుపలేనము. క్రొత్త కుండలో మానెడుసోలెడు ఉప్పు పోసి రవికలగుడ్డవాసినకట్టి దక్షిణ తాంబూలముతో ముత్తైదువకిచ్చి ఉద్యాపనము చేసికోవలెను. ఏడాది దాక, ఈకథ చెప్పి అక్షతలువేసుకోవలెను.

## 14 గణేశుని నోముకథ.

ఒకబ్రాహ్మణునిభార్య గణేశునినోము పట్టి ఉల్లంఘనచేసెను. గణేశు డామెకు నోము పట్టుటచేత సిరిసంపదలిచ్చి, ఉల్లంఘనచేయుట వల్ల మితిలేనిశోకము పెట్టెను. అందుచేత రోజు కొడుకులకు కూతుం డ్రకు వండిపెట్టినతరువాత ఆమెయొకచోటకూర్చుండి యేడ్చుచుండెను. ఊరివారందరును కూకలువేయుగా వినక, అడవిలోనికిపోయి అక్కడ యేడుపుమొదలుపెట్టెను. అట్లు ఏడ్చుచుండగా నొకనాడు పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకై వచ్చుచు, ఆమెనుజూచి, ఏమమ్మా!

ఈలాగున నేడ్చుచున్నావని అడిగిరి. అందుకామె మీరేమిఆర్చేవారా? తీర్చేవారా ? మీదారిని మీరు వెళ్ళండని చెప్పగా ఆలాకాదు. ఆర్చే వారము మేమే తీర్చేవారము మేమే. చెప్పవలసినదని మరల నడిగిరి. మీదయవలన నాకు అన్నిసిరిసంపదలున్నవి. ఏమికారణముచేతనో యీలాగు ఏడవవలెనని బుద్ధి పుట్టుచుండునని ఆమెచెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరు లిట్లనిరి. ఓకాంతా ! నీవుపాతాడిపామును పట్టుకొని పోయి పట్టిమంచముమీద వేయుము. అది నీకొడుకును కఱచును. అప్పుడు ఆయ్యో ! నాకొడుకును పాము కఱచినదని యేడ్వుమనిరి. ఆమె ఆలాగేయని పాముపట్టుకొనివెళ్ళి పెద్దకొడుకు మంచముమీద పడవేసెను. పెద్దకొడుకు ఇంటికివచ్చి మంచముపై పుసరు చూడగా, అందు బంగారపుగొలుసు కనబడెను. అతడు తల్లినిపిలిచి, అదేమని అడుగగా, అయ్యో ! దానివల్లయేడ్చుటకు వీలుకలిగినది కాదని యా రాత్రి మరల యేడ్చుచుకూర్చుండెను. ఆసమయమున తిరిగి పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యింకను ఎందుకు ఏడ్చుచున్నావని యడి గిరి. మీరుచెప్పినట్లు చేసినాను. ఆపాము నాకొడుకును కఱునలేదు. అందుచేత మళ్ళీ యేడ్చుచున్నానని యామెచెప్పగా, పార్వతీపరమేశ్వ రులు తేలును పట్టుకువెళ్ళి నీకూతురు బొట్టుపెట్టుకునే కుంకుమబరిణె లో వేయుము. అది కుట్టును. అప్పుడు ఏడ్చుదువుగా నని చెప్పిరి. అప్పు డామె తేలును పట్టుకొనివెళ్ళి కుంకుమబరిణెలోవేయుగా మరునాటి యుదయమున నాబరిణెను తీసి బొట్టుపెట్టుకొనుటకు, అందులోచేయి పెట్టగా అందులో నా తేలు చేర్చుక్క బొట్టయి కనబడెను. ఆమె తల్లిని పిలిచి, ఇందులోచేర్చుక్క బొట్టు పడవేసినా వేమనియడిగెను. అయ్యో ! ఇది కుట్టినది కాదని యూరాత్రి యడవికిబోయి మరల నేడ్చుచున్న యామెను పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై యేమి యింకను ఏడ్చెద వని యడిగిరి. అయ్యో ! తేలు నాకూతురుని కుట్టలేదు. అందుచేత

వచ్చి యేడ్చుచున్నానని చెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు, అమ్మా! నీవు పెంచినపిల్లియున్నది. దానిని చంపి వడిలో పెట్టుకొని యేడ్వుమనిరి. ఆమెయింటికివచ్చి పిల్లినిచంపి వడిలోనుంచుకొని యేడ్చు చుండగా నూరివారందఱు వచ్చి యిదేమమ్మా! యని యడిగిరి. అయ్యో! నాపెంపుడుపిల్లి చచ్చిపోయినదని మరింతయేడువగా ఆమె కంటినీళ్లుపడి బంగారపుపిల్లిఅయి వడిలోనుండి క్రిందికి దుమికిపోయెను అప్పుడు పార్వతీపరమేశ్వరులువచ్చి, ఓకాంతా! నీవు గణేశునినోము పట్టి ఉల్లంఘనము చేసినావు. నీవు నోముపట్టినందులకు సిరిసంపద వచ్చి నది ఉల్లంఘన చేయుటచేత విచారము వచ్చినది. కాబట్టి యీనోము పట్టి పదాఱు అక్షతలువేసుకొని ఉద్యాపన చేసినయెడల నీయేడ్పుపోవు నని చెప్పిరి. ఆబ్రాహ్మణస్త్రీ ఆప్రకారము నోము నోచుకొని దుఃఖ ములు విడిచి భూలోకమున చిరకాలము సిరిసంపదలతో సుఖపడెను.

ఉద్యాపనము:—సోలెడుగిద్దెడు నూనె క్రొత్తమూకుటిలో పోసి వత్తివేసి దీపముపెట్టి, స్వయంపాకము, ఒకయణాడబ్బులు దక్షిణ తో శివునియాలయమున పూజచేసుకొని నందివద్దర ఆదీపము పెట్టవల యును. కథ లోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

---

## 15 గొడిసెనోము.

గొడిసెనోముపట్టిన గొంతి పట్టణములో వెదకిచూచినను విధవ లేదు.

ఉద్యాపనము:—పదాఱు కథ చెప్పి అక్షతలువేసుకొని పదాఱు చింతపండు తినకుండ నియమముజరపి, సంవత్సరముపూర్తియైనపిమ్మట పదముగ్గురు ముత్తైదువలకు పదమూడురవికలగుడ్డలు దక్షిణతాంబూ లము పదమూడు మానికలబియ్యము పులిహోరచేసి పదమూడుమూకు

ళ్లలోపెట్టి వాయనములియ్యవలయును. కథ లోపమయినను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పును.

---

## 16 వావిలలక్ష్మివారపుకథ.

ఒకబ్రాహ్మణునకు నలుగురు కుమారులును, నలుగురు కుమార్తెలును కలరు. ఆతడు కుమార్తెలకు పెండ్లిపేరంటములు గావించి యత్తవారింటికి పంపివేసెను. కడసారపుకూతురు మిక్కిలిదరిద్రముకలవారికోడలౌటచేత, ఆమెను సోదరులు పుట్టినింటికి తీసుకొనిరారైరి. ఆమె దరిద్రబాధచేతను, తన్ను అన్నలు ఒకసారియైనపుట్టింటికి తీసుకువెళ్లకపోవుటచేతను, మిక్కిలి దుఃఖించుచుండెను. ఇట్లుండగా, నామె పుట్టింట కడసారపుతమ్మునకు పెండ్లితలపెట్టిరి. ఆవివాహమునకు యీ కడసారపు చిన్నదానిని తప్ప తక్కినవారిని తీసికొనివచ్చినారు. పెండ్లి చేసికొనిరి. ఆపెండ్లిలో తమ్మునుపిలువకపోయినను, యీచిన్నదానికొడుకులు, తాతగారింటికి వచ్చి, తాత! పందిరివేయుమా। చాపలు పఱచమా? అని యడుగగా నతడుతిట్టుచు మీరేమిచేయుదురు పొమ్మని కసరికొట్టెను. ఆబ్రాహ్మణుని పెద్దకోడలుమాత్రము కడసారపు ఆడుబిడ్డ రాకుండుటకు విచారించుచు, ఆమెదరిద్రదేవతను తిట్టుచు, వంటబ్రాహ్మణులు బియ్యము కడుగుచుండగా, నేను చాలకాలముక్రిందట వావిలగౌరీదేవినోము పట్టినాను. ఉద్యాపన మట్టియున్నది. అని చెప్పి కడిగినబియ్యములోనుండి అర్ధెడుతవ్వెడు తీసి యొకచేటలోపోసి కడుగనిబియ్య మొకయర్ధెడుతవ్వెడుగూడ పోసి పైనొకపాతచేట మూత పెట్టి వావిలికొమ్మపెట్టి, యందరవికలగుడ్డ దక్షిణతాంబూలమునుంచి యీచిన్నయాడుబిడ్డ యిల్లు తనయింటిప్రక్కనే యుండుటచేత వానిని గోడమీదనుండి ఆమెకు అందిచ్చెను. అవి పుచ్చుకొని యామె యింటిలో పెట్టునరికి, సిరిసంపదవచ్చెను. అటుతరువాత ఆచిన్నదానిపుట్టింట,

అన్నగారికుమార్తెకు వివాహముకాగా, ఆమెను పెండ్లికి రావలసిన దనివచ్చి పిలిచిరి. ఆమెయు పెండ్లినాడు ఉదయమునవచ్చెద నని చెప్పెను. ఆయుదయమున సవారీమీద ఆమెను తమయింటికి తీసికొని వచ్చి పీటవేసి కూర్చుండబెట్టి పంచభక్ష్య పరమాన్నములును ఆమెకు వడ్డించిరి. అప్పుడామె తనయొడలివస్త్రుపులనుదీసి పీటమీదనుంచి, వుస్త్రె లారా! ఆరగించుడు. పూసలారా! ఆరగించుడు. అనిచెప్పి పల్లకీ యెక్కి తనయింటికి వెళ్ళిపోయెను. అప్పుడువారివారందఱు ఏమమ్మా! తిరిగి యింటికి వెళ్లుచున్నావని యడుగగా, నాపుట్టింటివారు నన్ను చూచి పిలిచినారా? లేదు. నాపాలిటి మహాలక్ష్మినిచూచి పిలిచినారు అని చెప్పెను. వారందరు నీకింతభాగ్య మేలాగున వచ్చినదని యడు గగా, నేనేమినోమును పట్టలేదు. నా పెద్దవదినగారు వావిలిగౌరీదేవి నోముపట్టి మొన్న నే యుద్యాపనముచేసుకొని యీవాయనము నాకి చ్చినది. నా కా వాయనమందుకున్న ఫలమేగాని మరేమియు లేదు. అని యామె చెప్పెను.

దీనికి ఉద్యాపనము:—కథచెప్పి ఏడాది అక్షతలు వేసుకొని యేడాది అయినతరువాత క్రొత్త చేటలోకడిగినబియ్యము అడ్డెడుతవ్వెడు, కడగనిబియ్యము అడ్డెడుతవ్వెడుపోసి వావిలకొమ్మపెట్టి పాతచేట మూతవేసి రవికలగుడ్డ దక్షిణతాంబూలముతో గోడమీదనుండి ముత్తైదువకు వాయనము అందియ్యవలయును. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 17. మారేడుదళముకథ.

ఒకరాజునకు ఒకకుమారుడుకలడు. ఆకుమారుడు చనిపోగా నాతనితోడునకు పిల్ల నెవ్వరైన నిచ్చెదరా యని పట్టణమంతయు నడు గుచు దిరిగిరి. ఎవ్వరును పిల్లనియ్యరైరి. ఆ పట్టణమున నొక బ్రాహ్మ

ఋున కొక కూతురుకలదు. ఆచిన్నదానికి తల్లిపోవుటచేత సవతితల్లి తట స్థించెను. ఆమె ధనాశచేత, ఆపిల్లనిచ్చి పిల్లమెత్తుధనము పుచ్చుకొనెను. రాజభటులాచిన్నదానిని తీసికొనిపోయి చచ్చిపోయిన రాజకుమారుని శవముతోకట్టి తీసికొనిపోవుచుండగా నంతట వానవచ్చెను. ఆవర్ష ములో నాకటుకును తీసికొని వెళ్ళలేక సమీపముననున్న యొకపాడు దేవాలయములో దింపి తమదారిని హారుపోయిరి. అంతట సూర్యుడ స్తమించి యెల్లెడల చీకటిగ్రమ్మెను. అంతట నాచిన్నది కట్లువిప్పికొని దేవాలయమునకు ప్రదక్షిణముచేయుచు, శివశివ! చిటికెన వ్రేలైన పట్టనీయ నైతివి; హరహర! అక్షతలగింజైన వేయనీయనైతివి. మహా దేవ! మంగళసూత్రమైన కట్టనియ్యనైతివి. అని యనుచు, మూడుసార్లు ప్రదక్షిణముచేసెను. పార్వతీదేవి ప్రత్యక్షమై నీవెవ్వరవని యడిగెను. నేను బ్రాహ్మణుని కూతురను. సన్నిచనిపోయినవానితోకట్టి పడవేయగా నాయదృష్టముచేత నీయాలయమునకు వచ్చినాను. ఇప్పుడు నాయవ స్థనుగుఱించి చెప్పుకొనుచు ప్రదక్షిణముచేయుచున్నానని యాబ్రాహ్మ ణస్త్రీ చెప్పెను. అప్పుడు పార్వతీదేవి, నీవు క్రిందటిజన్మమున మారేడు దళమునోముపట్టి యుల్లంఘనచేయుటచేత నీకీగతివచ్చినదని చెప్పి అక్షతలు నీళ్లు ఇచ్చి, మూడుప్రదక్షిణములుచేసి యవి యాపిల్లవాని మీద చల్లుమనిచెప్పెను. ఆచిన్నది ఆప్రకారము చేయగా రాజకుమా రుడు నిద్రబోయి లేచినవానివలె లేచి కూర్చుండెను. తరువాత అన్ని సంగతులు బ్రాహ్మణకుమార్తెవలన విని కాలక్షేపమునకై యామెను పుస్తకము చదువుమని తాసర్థముచెప్పసాగెను. ఇంతట తెల్లవారెను. తిరుగ యెప్పటియట్ల రాత్రి గుడివద్ద వీరిని విడిచిపెట్టినవాండ్రిందరు, వచ్చి, ఇదేమిచిత్రమని, ఆశ్చర్యముతో నడుగగా పార్వతీదేవియొక్క వరప్రభావమును యాచిన్నది వారితోచెప్పెను. అందుకు వారందరును సంతోషించి, ఇంటికితీసుకొనివెళ్ళి వారిరువురకును మహావైభవముతో

వివాహమును జరిగించిరి. అప్పుడా బ్రాహ్మణచిన్నది మారేడుదళము నోముపట్టి వెండిదళము బంగారుదళము చేయించి, చెట్టుదళమొకటి తెచ్చి, ఆమూడుదళములు మూడుదోసిళ్ళబియ్యము శివునకు పూజ చేసి, చిరకాలము సౌభాగ్యసంపదలతో సుఖమనుభవించెను. దీని కిదియే యుద్యాపనము. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలముతప్పదు.

---

## 18. సంపద + శుక్రవారమునోము.

ఒకబ్రాహ్మణునకు ఏడుగురుకుమాళ్లుకలరు. వారందఱును దరిద్రముచేత బాధపడుచుండిరి. ఒకనాడు ఉదయమున శుక్రవార మహాలక్ష్మివచ్చి ముందుగా వారిపెద్దకోడలి యింటికివెళ్ళెను. ఆమె ప్రొద్దున్నే లేచి పిల్లలకు, అన్నముపెట్టి తానుకూడ దినుచుండెను. అది సంపద శుక్రవార మహాలక్ష్మిచూచి ఛీ! వీరింటికేల వచ్చినానని గిరుక్కున తిరిగి వెళ్ళి రెండవకోడలియింటికివెళ్లగా, ఆమె ప్రాచివాకట్లో పేడచేసుకొనుచుండెను. ఛీ! ఛీ! దీనింటికేలవచినానని తిరిగివెళ్ళి మహాలక్ష్మి మూడవకోడలియింటికివెళ్లగా, ఆమె పాతగుడ్డలుకుట్టుచు కూర్చుండెను. ఛీ! దీనియింటికేలవచ్చితినని మహాలక్ష్మి నాలుగవ కోడలియింటికివెళ్లగా, ఆమె ప్రాచివాకటిలో గుంటలో వడ్లుపోసుకొని దంపుచుండెను. అదిచూచి మహాలక్ష్మి ఛీ! దీనింటికేలవచ్చినానని, అయిదవకోడలియింటికివెళ్లగా, ఆమె ప్రొద్దున్నే తలదువ్వుకొనుచు కూర్చుండెను. ఆమహాలక్ష్మి ఛీ! దీనింటికేలవచ్చినానని ఆరవకోడలి యింటికివెళ్లగా; ఆమె ప్రాచివాకటిలో నలుగురిపిల్లలకుతలంటి తాను తలంటుకొనుచుండెను. అదిచూచి మహాలక్ష్మి ఛీ! దీనింటికేలవచ్చినా నని యేడవకోడలియింటికి వెళ్లిగా, ఆమె నల్లగా అలుకుకొని, తెల్లగా ముగ్గుపెట్టుకొని పసపురాసి బొట్టుపెట్టుకొని కట్టుకొన్నబట్ట మగనికి

యిచ్చి తలుపువెనక కూర్చుండెను. ఆమహాలక్ష్మి యిక్కడ యెంత చల్లగానున్నది అని ఆయింటివద్ద పండుకొనెను. లోపలినుండి, ఎవ రమ్మా యీలారండని ఏడవకోడలిని పిలువగా, అమ్మా! నామగడు యీయవారమునకువెళ్ళినాడు. మాకు కట్టుకొనుటకు ఒక్కటే బట్ట. అందుచేత నాబట్ట ఆయనకిచ్చి నేను తలుపువెనుక కూర్చున్నానని చెప్ప గా, మహాలక్ష్మి, అయితేయేమి? యీలారావమ్మా! కట్టుకొనుటకు బట్ట నేను ఇచ్చెదనని చెప్పెను, అట్లు చెప్పి తన కట్టుబట్టలో సగము చింపి యీమెకిచ్చి, అమ్మా! నాకు సోలెడుబియ్యముపెట్టి అన్నము వండిపెట్టుమని చెప్పెను. అందుకాబ్రాహ్మణస్త్రీ, అయ్యో, ఇంట్లో బియ్యములేవు. నాపెనిమిటిరావలెనని చెప్పగా, ఆలాకాదమ్మా! నీవు కోమటియింటికివెళ్ళి మాయింటికి శుక్రవారమహాలక్ష్మి వచ్చినదని చెప్పుము. వారిచ్చెదరనిచెప్పెను. ఆప్రకారము ఆమె కోమటియింటికి వెళ్ళి అడుగగా వారు పప్పు ఉప్పు బెల్లము బియ్యము మొదలైనవి యియ్యగా అవి పుచ్చుకొని తెలకలియింటికివెళ్ళి అదేప్రకారము చెప్పగా ఆతడు నూనె, తెలకపిండి యిచ్చెను. అవి ఆమె పుచ్చుకొని కంచరివానియింటికి వెళ్ళి మాయింటికి శుక్రవారమహాలక్ష్మివచ్చినదని చెప్పుమన్నదని చెప్పగా గిన్నెలు బిందెలు మొదలైనవి వాడిచ్చెను. తరువాత ఆమె సాలివానియింటికివెళ్ళి అదేప్రకారముచెప్పగా, వాడు బట్టలనిచ్చెను. ఆమె యవి యన్నియు పట్టుకొని యింటికివచ్చి, నవకాయపిండివంటలు నాలుగుకూరలువండి మహాలక్ష్మికి భోజనముపెట్టెను. ఆరోజున ఆమెభర్త కందరును ముష్టిపెట్టిరి. అప్పుడా బ్రాహ్మణుడు, ఎడమూట పెడమూట వేసుకొని మోయలేకుండ నింటికివచ్చెను. ఇంటికిరాగానే భార్య వానికి భోజనముపెట్టెను. భోజనముచేసి బ్రాహ్మ ణు డివియన్నియు నేలాగువచ్చినవని భార్యనడిగెను. ఆమె మనపాలిట

శుక్రవారపు మహాలక్ష్మివచ్చినది అని అందరిని అడిగి పట్టుకొని వచ్చి నాననిచెప్పెను. అప్పుడు శుక్రవారపు మహాలక్ష్మి వెళ్ళెదనని చెప్పగా, ఇప్పుడుకాదు రాత్రిదాకనుండి భోజనముచేసి వెళ్లుదువుగానియని చెప్పి రాత్రిభోజనము పెట్టినతరువాత తిరుగ వెళ్ళెదనని చెప్పెను. అందుకు బ్రాహ్మణునిభార్య, ఇప్పుడు చీకటిపడినది. రేపటిరోజున వెళ్ళవచ్చు నని చెప్పెను. ఆరాత్రి యందరును సుఖముగా నిద్రించిరి. కొంతరాత్రి వేళ మహాలక్ష్మిలేచి అమ్మా! కడుపునొప్పిగా నున్నది అని చెప్పగా, చీకటిగానున్నది. వీథిలోకి వెళ్ళవద్దు. ఆమూల కూర్చుండు మని బ్రాహ్మణునిభార్యచెప్పెను. అట్లు నాలుగుజాములును నాలుగుసారులు లేచి మహాలక్ష్మి నాలుగుమూలల కూర్చుని మాయమైపోయెను. తెల్లవారగనే బ్రాహ్మణుడును భార్యయునులేచిరి. బ్రాహ్మణునిభార్య చీపురు చేత పుచ్చుకొని యిల్లు బాగుచేయుటకు తుడువపోగా సట్టింట అన్ని చోట్ల బంగారముకుప్పలుండెను. అందుకామె యాశ్చర్యపడి మహాసంతోషముతో, నాసంగతి భర్తతో చెప్పి పాల, నేత కడిగి, యాబంగారురాసులు పళ్ళెములో పెట్టుకొని, నాపాలింటి శుక్రవారపు మహాలక్ష్మి వచ్చినది గనుక యీభాగ్యముకలిగెనని శుక్రవారపునోము పట్టుటకు మనస్సులో సంకల్పించుకొనెను. ఆలాగనుకొని సట్టింట నాలుగుమూలలు అలికి, ముగ్గుపెట్టి, తలదువ్వి బొట్టుపెట్టుకొని పసపు రాచుకొని పయిమీదనీళ్లుపోసుకొని మహాలక్ష్మిని పెట్టి నోమునోచుకొని కథచెప్పి అక్షతలు వేసుకొనెను.

దీనికి ఉద్యాపనము:—అయిదేండ్లు ప్రతిశుక్రవారము ఒంటిపూట భోజనముచేసి అయిదుగురు ముత్తైదువలకు తలంటి నీళ్లుపోసి అయిదురవికలగుడ్డలిచ్చి పిండివంటలతో భోజనముపెట్టి దక్షిణతాంబూలము నియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపము కాకుండదు. భక్తితప్పినను ఫలముతప్పను.

---

## 19. మార్గశిరలక్ష్మీవారముకథ.

ఒక బ్రాహ్మణున కొకకూతురుకలదు. ఆమెకు సవతితల్లి పిల్లను ఎత్తుకొమ్మనిచెప్పి కొంచెము బెల్లముముక్క పెట్టుచువచ్చెను. ఆచిన్నది సవతిపిల్లను తీసుకొనివెళ్ళి మట్టితో బొమ్మనుచేసుకొని ఆబొమ్మకు రవంతబెల్లముముక్క నైవేద్యముపెట్టి ఆడుకొనుచుండేది. అట్లుండగా కొన్నాళ్ళకాపిల్లకు పెండ్లిచేసిరి. ఆమె అత్తవారింటికి వెళ్ళబోవునప్పుడు తాను చిన్నప్పటినుండి చేసుకొనిన బొమ్మలను సవారీలో పెట్టుకొని మరీ వెళ్లెను. అమెకూడ మహాలక్ష్మికూడ వెళ్ళెను. అంతట నాపిల్ల పుట్టింటివారికి దరిద్రమువచ్చెను. ఆమె యత్తవారింటివద్ద సిరిసంపదలతో తులదూగుచు, పుట్టింటివారికి దరిద్రమువచ్చెనని తెలిసికొని తోడబుట్టినవానికి కబురంపి ఒకకర్ర దొలిపించి, ఆకర్రనిండ వరహాలుపోసి అన్నగారికిచ్చెను. అది పట్టుకొని అన్నగారు వెళ్ళుచు త్రోవలో కడుపునొప్పివచ్చి, ఆకర్ర చెట్టునకు జేరవైచి కొంచె మావలికివెళ్లెను. అంతట నాత్రోవవెంబడిని కొందరువెళ్లుచు ఆకఱ్ఱపట్టుకొని చక్కబోయిరి. అప్పుడా బ్రాహ్మణచిన్నవాడాకఱ్ఱ వెదకి యెందునుగానక యింటికివెళ్ళిపోయెను. తరువాత కొన్నాళ్లకు తమ్ముని వర్తమానము తెలియక మరల నాచిన్నది కబురంపగా నాతడువచ్చెను. ఆతనిగాంచి నాయనా! స్థితి యేలాగున్నదని యడుగగా మునుపటివలెనేయున్నదని యాతడు చెప్పెను. అప్పుడామె యొకచెప్పులుజోడు కుట్టించి దానినిండ వరహాలు పోసి అంచులో గడ్డిపెట్టి, యీజోడుపట్టుకొనివెళ్ళి నాన్నకీయుమని తమ్మునకిచ్చెను. ఆతడా చెప్పులజోడు పుచ్చుకొని యొకచెరువుగట్టుదగ్గరకువెళ్ళునరికి వానికి దాహమై యాజోడు నక్కడపెట్టి చెఱువులోనికి వెళ్ళెను. అప్పుడొకకుక్కవచ్చి యాజోడెత్తుకొనిపోయెను. దాహము పుచ్చుకొని పైకివచ్చి యాతడు గట్టుపై పెట్టినజోడునుగానక యింటికి వెళ్ళెను. కొన్నాళ్లకు తిరుగ వానికి అక్కగారు కబురంపగా నాత

డాయూరి కేగెను. ఏమి నాయనా! ఏలాగున్నది మీస్థితియని వాని యడిగెను. ఎప్పటిలాగేయున్నదని యాతడుచెప్పెను. అప్పుడామె యొక గుమ్మడికాయ దొలిపించి దానినిండ వరహాలుపోసి యది పట్టుకొని వెళ్లుమని యాతనికిచ్చెను. ఆకాయ నాతడుపట్టుకొనివచ్చి చెరువుగట్టు మీదపెట్టి కాళ్ళు కడుగుకొనుచుండగా, నాదారినిపోవుచున్న కోమటి యొక డాకాయను పట్టుకొని పోయెను. ఒడ్డునకువచ్చి కాయగానక బ్రాహ్మణుఁడు తనయింటికిపోయెను. కోమటితనయింటివద్దకు వెళ్లియా కాయను కొట్టగా యందు వరహాలునిండియుండెను. అప్పుడాబ్రాహ్మణ చిన్నది తనపుట్టింటివారి సంగతి యెట్లున్నదో తెలిసికొందమని యచ్చటికి వచ్చెను. వారు మిక్కిలి దరిద్రులైయుండిరి. అప్పుడామె తల్లిని తీసుకొనివెళ్లి మార్గశిరలక్ష్మివారము నోము నోపించిన నింత యన్నము కలుగునని తలంచినదై యట్లు తల్లిని తీసుకొనివెళ్లెను. ఇంటికి వెళ్ళిన తరువాత అమ్మా! యీరోజునమార్గశిరలక్ష్మివారము. కాబట్టి నోట్లో యేమీ వేసుకొనవద్దని చెప్పెను. ఆమె సరే అనిచెప్పి పిల్లలకు చద్దియన్నముపెట్టుచు నొకముద్ద నోటిలో వేసుకొనియెను. అప్పుడు బ్రాహ్మణ చిన్నది తల్లితో అమ్మా! స్నానముచేయుము, నోము నోచుకొందమని చెప్పగా తల్లి, అయ్యో! పిల్లలకు అన్నముపెట్టుచు మరచిపోయి యొకముద్ద నోటవేసుకొన్నానని చెప్పెను. అప్పుడా చిన్నది, ఇంక నేవిధముచేతను పీండ్రకు భాగ్యము అంటదనుకొని తానుమాత్రము నోచుకొన్నదట. అంతట రెండవవారమున తల్లిని బిలిచి అమ్మా! ఈవేళ లక్ష్మివారము నోట యేమి వేసుకొనకని చెప్పెను. అందు కామె ఆలాగేనని పిల్లలకు తలంటుచు ఆగిన్నెలో నూనెమిగులగాతలకు రాసుకొన్నదట. అంత కూతురువచ్చి అమ్మా! స్నానము చేయుమని చెప్పగా, అయ్యో! అమ్మా! పిల్లలకు రాయగా మిగిలిననూనె యుండనా తలకు రాసుకొన్నానని చెప్పెను. పోనీలే యనిచెప్పి తాను

మాత్రము నోచికొనెను. అంత మూడవవారము రాగా, తల్లినిబిలిచి, అమ్మా! ఈవేళ లక్ష్మివారము. నోటిలో నేమియు వేసుకొనవద్దని చెప్పగా నామె యాలాగే యని పిల్లలకు తలమువ్వుచు తలదువ్వి కొప్పు పెట్టుకొనెను. ఆవారముకూడ తానుమాత్రమే నోచుకొని యాచిన్నది నాలుగవవారము రాగా గోయితీసి యందులో తల్లిని కూర్చుండబెట్టి బల్లమూత వేయించెను. పిల్లలందరు యరటిపండ్లు తిని యాతొక్కలు తీసికొనిపోయి. అమ్మా! ఇవిగో నని బల్లసందులనుండి పడవేయగా నామె వానిని తినివేసెను. అంత కూతురువచ్చి స్నానము చేయుమని చెప్పగా, అయ్యో! ఆమ్మాయీ! అరటిపండుతొక్కలుతిన్నానని చెప్పె ను. అయిదవవారము చెంగుచెంగుముడివేసికొని తా నెక్కడికిబోయిన నక్కడికి తీసికొనిపోవుచు రెండుజాములైనతరువాత, స్నానముచేయించి నోమునోపించెను. అప్పుడు పూర్ణపుకుడుములువండి నైవేద్యముపెట్టు కొనిరి. కూతురునైవేద్యముపెట్టుచుండగా, ఊరుకొని తల్లినైవేద్యము పెట్టుటకు వచ్చేసరికి మహాలక్ష్మి వెళ్లి మొగలిగి నిలుచుండెను. అప్పు డు కూతురుచూచి అదేమని యడుగగా, నీచిన్నతనములో, ఆడుకొనెడి సమయమున నీవు బొమ్మలనుపెట్టుకొని, ఆడుకొనుచుండగా మీయమ్మ చీపురుపుచ్చుకొని కొట్టినది. అందుచేత నేనువెళ్లిపోయినా నని మహా లక్ష్మి చెప్పెను. అయ్యో! నేరము వచ్చినది అని యీవలికివచ్చి, అమ్మా! క్షమియించి నైవేద్యముపుచ్చుకొని వాండ్రకు భాగ్యము వచ్చేలాగు చేయవలసినదని కూతురు వేడుకొనగా నీతల్లిచేత నోము పట్టించుమని చెప్పి మహాలక్ష్మి యదృశ్యయయ్యెను. అప్పుడాచిన్నది తల్లిచేత మార్గశిరలక్ష్మివారము నోము నోపించి, పట్టినవారము పుల గము రెండవ వారము పరమాన్నము, మూడవవారము ముద్దకుడు ములు, నాలుగవవారము చిత్రాలుకలమాన్నమువండి, పుష్యమాసపు వారము పూర్ణపుకుడుములు వండి, తల్లిచేతనోమునోపించెను.

ఉద్యాపనము:—నాలుగు వారములు నోము నోచుకొని కథ చెప్పి అక్షతలువేసుకొని ముత్తైదువను పెట్టుకొని నేతిపిండివంట వండుకొని నోమునోచుకొనవలయును. కథ లోపమయినను వ్రతలోపము కాకూడదు, భక్తితప్పినను ఫలముతప్పును.

---

## 20. శోకములేని సోమవారముకథ.

ఒకబ్రాహ్మణునకు నలుగురుకొడుకులు నొకకుమార్తెయుకలరు అతడాకుమార్తెకు వివాహముచేయగా, ఆమెమగడు దేశాంతరము వెళ్లెను. అందు కాచిన్నది మిక్కిలి దుఃఖించుచుండెను. అట్లేడువగా, ఏడువగా, ఆయుసురుతగిలి ఆబ్రాహ్మణునకు దరిద్రమువచ్చెను. అప్పుడా బ్రాహ్మణుడొక చెరువుత్రవ్వించినాడు కాని యందులో గంగ పడలేదు. అందుకాబ్రాహ్మణుడు మిక్కిలి విచారించుచు భార్యతోగూడి తపస్సుచేయగా పార్వతీపరమేశ్వర్లు ప్రత్యక్షమై ఎందుకు తపస్సు చేయుచున్నారని యడిగిరి. అప్పుడా బ్రాహ్మణుడు నా కొక్క కుమార్తెయున్నది. అది అస్తమానము ఏడ్చుచుండును. దాని యుసురు తగిలి మాకు దరిద్రము సంప్రాప్తమైనది. అందుకే చెరువు త్రవ్వించినాము. ఇందులో నీళ్లుపడినవికావు. అందుచేత తపస్సు చేయుచున్నామని చెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు, మీపెద్దకొడుకును తీసికొని వచ్చి యీతూమున కడ్డమువేసినట్టయితే యిందులో నీళ్ళుపడునని చెప్పిరి. బ్రాహ్మణుడందుకు వప్పుకొని పెద్దకొడుకును తీసుకొనివచ్చి తూమున కడ్డమువేయగా, వెంటనే గంగ పడెను. తరువాత పార్వతీపరమేశ్వరులు, నీకూతురు క్రిందటి జన్మమున శోకములేని సోమవారమునోమువట్టి, ఉల్లంఘనచేసినది. ఆకారణముచేత నీమేడుపు వచ్చినది. ఇప్పుడు తిరుగ నోముపట్టించి కథచెప్పి అక్షతలువేసి, ఏడాది సోమవాము సోమవారము, ఒంటిపూట భోజనముపెట్టి, ఏడాది అయినతరు

వాత ఉద్యాపనచేయించవలసినదని చెప్పి అదృశ్యమైరి. ఆ బ్రాహ్మణుని కూతురు నాప్రకారము నోపించి ఉద్యాపనచేయించగా ఆమె యేడ్పు మానెను. సంపద కలిగెను.

ఉద్యాపన:—మానెడునో లేకుబియ్యము పులగమువండి అడుగుఅట్లు, పైఅట్లు, తీసి రవికలగుడ్డ వాసినకట్టి దక్షిణతాంబూలము పెట్టి ముత్తయిదువకు వాయనమియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పును.

---

## 21. పూర్ణాదివారముకథ.

ఒకరాజుకూతురు చిన్నప్పటినుండి కడుపుశోకముకలిగినదై అయిదుగురు బిడ్డలను పోగొట్టుకొనెను. తరువాత ఆదుఃఖము నామె భరించలేక అడవిలోనికిపోయి పార్వతీపరమేశ్వరులను ప్రార్థించుచుండగా, పార్వతీపరమేశ్వరులామెకు ప్రత్యక్షమై యేమి యిట్లు విచారించుచు కూర్చున్నావని యామె నడిగిరి. అంత నామె, నాయనా! పుట్టి చావగానున్న బిడ్డలతో పడలేక యీలాగువచ్చినానని చెప్పగా, పార్వతీపరమేశ్వరులు, నీపూర్వజన్మమున పూర్ణాదివారమునోముపట్టి ఉల్లంఘనచేసినావు. ఆకారణమున నీకీదుఃఖము సంప్రాప్తమైనది. ఇప్పుడు తిరుగ నీవానోముపట్టి కథ చెప్పుకొని అక్షతలువేసుకొని యుద్యాపనము చేసుకొన్నయెడల నీకీదుఃఖముపోవునని చెప్పి అంతర్థానమునొందిరి. ఆరాజకుమార్తెయు పార్వతీపరమేశ్వరులు చెప్పినప్రకారము నోముపట్టి ఉద్యాపనచేసుకొని అంతటినుండి కడుపుశోకములేనిదయ్యెను.

దీనికి ఉద్యాపనము:—కథచెప్పి అక్షతలువేసుకొని ప్రతిఆదివారము ఒంటిపూట భోజనముచేసి ఒక ముత్తయిదువకు తలంటి నీళ్ళుపోసి దక్షిణతాంబూలముఇచ్చి అయిదుమానికలబియ్యము పూర్ణపు

ఉండ్రాములువండి వాయనమియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 22. గ్రామకుంకుమనోముకథ.

ఒకబ్రాహ్మణునిభార్య గ్రామకుంకుమనోముపట్టి వీసె యేబులముపసపు, వీసేయేబులముకుంకుమ, పండ్లుపట్టుకొని వెళ్ళి గ్రామములో పంచిపెట్టుచుండెను. ఒకవీధి పంచిపెట్టేసరికి ఒక కొడుకువచ్చి అమ్మా! మానాన్నగారికి జబ్బుగానున్నది రమ్మని పిలిచెను. అందు కామె నాయనా! ఒక్కవీధి అయినదని చెప్పి రెండవవీధికి వెళ్ళెను. అంత రెండవకుమారుడువచ్చి మానాన్నగారికి చాలజబ్బుగానున్నది రమ్మని చెప్పెను. అప్పుడామె మూడవవీధికివెళ్ళి పంచిపెట్టసాగెను. అంతట మూడవకుమారుడువచ్చి అమ్మా! మానాన్నగారిని క్రిందపడవేయు చున్నారని చెప్పిరమ్మనగా ఇంక రెండువీధులున్నవి వచ్చెదనని చెప్పి యూమె నాలుగవవీధికివెళ్లెను. నాలుగవకుమారుడువచ్చి మానాన్న గారికి ప్రాణముపోయినదని చెప్పగా యిక నొక్కవీధి యున్నదని చెప్పి యూమె అయిదవవీధికివెళ్ళి పంచిపెట్టుకొని యింటికివచ్చేసరికి భర్త దిగ్గునలేచి కూర్చుండెను. అప్పుడు ఊరందరు ఆశ్చర్యముతో అమ్మా! ఏమినోముపట్టినావు. ఏమివ్రతముపట్టినావనియడిగిరి: గ్రామకుంకుమ నోముపట్టి అది అయిదువీధులను పంచిపెట్టుకొని వచ్చేసరికిలేచి కూర్చున్నారని చెప్పినది.

దీనికి ఉద్యాపనము:—వీసేయేబులము కుంకుమ వీసేయేబుల ముపసుపు పండ్లు ఊళ్ళో పంచిపెట్టుకోవలెను. కథలోపమైనను వ్రత లోపము గాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 23. వెలగలగౌరి.

వెలగవెలగ అనరాదు. వేలుపెట్టి చూపరాదు. వెలగచెట్టు యొక్క నీడకు వెళ్లరాదు. వెలగపండు తినరాదు.

ఉద్యాపనము:—పదమూడుజోడాల ముచికలతోనున్న వెలగకాయలు తెచ్చి దక్షిణతాంబూలము నల్లపూసలు లక్కజోడుపెట్టి పదముగ్గురు ముత్తయిదువలకు ఇయ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 24. ఆపదలేని ఆదివారముకథ.

ఒకబ్రాహ్మణున కొకకుమారుడుకలడు. ఆచిన్నవాని కాతడు వివాహముచేసి కోడలిని తనయింటికి తీసుకొనివచ్చెను. ఆమె ఆపద యనిన నేమో తెలియక ప్రతిదినము మామగారింటికి రాగానే మామా! ఆపద అంటే యేమిటియని యడుగుచుండేది. ప్రతిదినమిట్లు అడుగుచుండగా విసుగువచ్చి ఆబ్రాహ్మణుడు దర్భాసనపు త్రాడు పుచ్చుకొని పెద్దమనుమని కొట్టెను. ఆపిల్లవాడాదెబ్బకు మూర్ఛపడి పోయెను. ఆయాపద చూడలేక యాచిన్నవానితల్లి అడవిలోనికివెళ్ళి విచారించుచుండగా పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చి, ఆమెనుచూచి యేమి యిట్లున్నావని యడిగిరి. ఆమె నాజోలి మీ కెందుకు వెళ్ళుమనగా పార్వతీ పరమేశ్వరులు, అలాగుకాదు చెప్పవల సినదని యడిగిరి. నాకు ఆపదమనసులయి ప్రతిదినము మామామ గారిని ఆపదయంటే యేమిటియని యడుగుచుండగా, ఆయనకు కోపమువచ్చి దర్భాసనపుత్రాటితో నాపెద్దకొడుకును కొట్టినారు. అతడు మూర్ఛపడినాడు. ఆయాపదభరింపలేక యీలాగువచ్చినానని బ్రాహ్మణస్త్రీ చెప్పగా పార్వతీపరమేశ్వరులు నీవు క్రిందటిజన్మమున ఆపదలేని ఆదివారము నోముపట్టి ఉల్లంఘనచేసినావు. అందుచేతనీకు ఆపదమన

సైనది. ఇప్పుడు నోముపట్టి క్రమముగా ఉద్యాపనముచేసుకొన్న యెడ లనీకీయాపదపోవునని చెప్పి పార్వతీపరమేశ్వరులు అంతర్థానమునొందిరి. ఆబ్రాహ్మణస్త్రీ యింటికివెళ్ళి యానోముపట్టి క్రమముగ ఉద్యాపన చేసికొని యేవిధమయిన ఆపదలులేక సుఖముగా నుండెను.

ఉద్యాపనము:—అయిదుమూని కెలపాలలో మానెడు సోలడు బియ్యముపోసి పరమాన్నమువండి అడుగుఅట్టు పైఅట్టు తీసుకొని సూ ర్యునకు నైవేద్యముపెట్టి, ఆమధ్యపరమాన్నము-అయిదుమూళ్ళపంచ, అయిదుడబ్బులు దక్షిణతాంబూలముతో బ్రాహ్మణునకు వాయన మియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పి నను ఫలముతప్పదు.

---

## 25 ముప్పదిమూడుపున్నములనోముకథ.

ఒకబ్రాహ్మణుడు తనకుమార్తెకు వివాహముచేయగా అల్లుడు మూడవనాడు చనిపోయెను. అప్పుడాపిల్ల ఆడుకొనుటకువెళ్లి వచ్చుచుం డెను. ఒకరాజుభార్య ముప్పదిమూడుపున్నములనోముపట్టి ముత్తయి దువ నిమిత్తము వీధిగుమ్మమువద్ద నిలుచుండి, యీ బ్రాహ్మణుని కూతురు ఆదారినివచ్చుచుండగా చూచి నీవెవరి అమ్మాయివు అని యడిగెను. ఆచిన్నది నేను బ్రాహ్మణులపిల్లను అని చెప్పగా నేను ముప్పదిమూడుపున్నములనోము పట్టినాను. వాయనమిచ్చెదను వచ్చె దవా యనియడిగెను ఆచిన్నది ఆలాగేపట్టుకువెళ్ళెద నియ్యమని యడి గెను. ముప్పదిమూడుఆకులు, ముప్పదిమూడుచెక్కలు,ముప్పదిమూడు డబ్బులు, ముప్పదిమూడునల్లపూసలకోళ్లు, ముప్పదిమూడు లక్కజోళ్లు, ముప్పదిమూడుఅట్లు, ముప్పదిమూడుతట్లజల్లిడ,ముప్పదిమూడుజోతులు, చీర రవికలగుడ్డ క్రొత్త జల్లిడిలోపెట్టి పాతజల్లిడిబోర్లించి రాజుభార్య, ఆచిన్నదానికివాయనమిచ్చెను. ఆచిన్నది ఆవాయనమందుకొని జోతులు

వెలుగుచుండగా యింటికిపట్టుకొనివెళ్ళెను. ఆజోతులువెలుగు చూచి ఆపిల్లభర్త లేచికూర్చుండెను. అప్పు డందరు ఏమినోము పట్టినావని యడిగిరి. ఏమినోముపట్టలేదు. రాజుగారిభార్య ముప్పదిమూడు పున్నములనోము నోచుకొని వాయనమిచ్చినది పట్టుకు వచ్చినానని యా చిన్నది చెప్పెను. అప్పుడాచిన్నవాని నిమిత్తమువచ్చిన యమభటులు యమధర్మరాజునొద్దకుపోయి, మహారాజా! మీరు తీసుకొని రమ్మని పంపిన బ్రాహ్మణులచిన్నవానినిమిత్తము మేమువెళ్ళి తీసుకొనిరాబోవు చుండగా అతనిభార్య ఎక్కడినుండో నోము నోచుకొని వాయనము తెచ్చుచున్నందున వానిప్రాణములు మాచేతనిలువక తిరుగ బొందెలో ప్రవేశించినవి. మేమాతనిరమ్మని బలవంతపెట్టినా వచ్చినాడు కాడని మనవిచేసుకొనిరి. అప్పుడు యముడుగుఱ్ఱై యాచిన్నవాని ప్రాణము లుతీయుటకై వచ్చెను. వచ్చి యా బ్రాహ్మణచిన్నవాని ప్రాణములు తీసుకొనిచక్కపోవుచుండెను. అంతనాచిన్నదివానివెంబడించెను. కొంత దూరమువెళ్ళి ఏమిఅమ్మాయి! వచ్చుచున్నావని యముడడుగగా నా పెనిమిటిప్రాణమునిమిత్తము వచ్చుచున్నానని యామెచెప్పెను. అంత నాతడు నీపెనిమిటిప్రాణములుకాక మఱియొక టేదియైన కోరుమని యెను. నేను ముప్పదిమూడు అట్లవాయనము తెచ్చుకొన్నాను. ఆ అట్లకు ఎన్నిదొళ్ళులుండెనో అన్నివేలయేండ్లు అయిదువతన మియ్యమని యామెకోరెను. యముడును ఆలాగేయిచ్చినానని చెప్పి వెళ్ళుచుండెను. ఆబ్రాహ్మణచిన్నదియు వానివెనకనే వెళ్ళుచుండెను! తిరుగ కొంత దూరము వెళ్ళి తిరిగిచూచి ఏమి అమ్మాయీ! యింకనువచ్చుచున్నా వని యముడడుగగా యామె నా భర్తనిమిత్తము వచ్చు చున్నానని చెప్పెను. అతనిప్రాణములుతప్ప మరేమియైన నడుగుమని యముడు చెప్పగా, నాకు ఏమీఅక్కరలేదు. ముప్పదిమూడు నల్లపూసలకోళ్లు తెచ్చుకున్నాను. ఆకోళ్ళపూసల కెన్ని బెజ్జములున్నవో అన్నివేలయేం

ష్లునాక యిదువతనము నీయవలయునని యా చిన్నది యడిగెను. అప్పు డామె భక్తికి సంతసించి యముడు అట్లే యిచ్చినాను. పుచ్చు కొమ్మని యాతని ప్రాణములు విడిచి చక్కాబోయెను. ఆచిన్నది యిం టికివచ్చేసరికి పెనిమిటి లేచికూర్చుండెను. అందరు ఇదియేమిమహాత్మ్య మమ్మా యనియడిగిరి. ఏమీ లేదు. నేను ముప్పదిమూడు పున్న ములనోము వాయనము తెచ్చుకొన్నాను ఆఫలమేయిది. ఇది వాయ నము తెచ్చుకున్న ఫలమని యామె చెప్పెను. వాయనమునకే యింతఫల మున్నది. నోమునోచుకొన్న నెంతఫలమో యని అందరు ముప్పది మూడుపున్నములనోముపట్టి ముప్పదిమూడు పున్నములుపవాసముండి క్రమముగా నుద్యాపనముచేసికొనిరి.

ఉద్యాపనము:—ముప్పదిమూడుఅట్లు, ముప్పదిమూడుఆకులు, ముప్పదిమూడుపోకలు, ముప్పదిమూడుడబ్బులు, ముప్పదిమూడు నల్ల పూసకోళ్లు, ముప్పదిమూడులక్కజోళ్లు, ముప్పదిమూడుజోతులు, చీర రవికలగుడ్డ, ముప్పదిమూడుకన్నుల క్రొత్తజల్లెడలోపెట్టి పాత జల్లెడ మూతవేసి ముత్తయిదువకు వాయనమియ్యవలయును. కథలోపమయి నను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 26 కుందేటి అమావాస్యనోముకథ.

ఒకకుందేలు చాకిబానలో పిల్లలనుపెట్టి మేతకొరకు యెక్క డికోపోయినది. చాకలదివచ్చి పొయిమీద నాచాకిబాననుంచి మంట పెట్టుచున్నది. అంతట మేతకొరకుపోయిన కుందేలు తనపిల్లల యొద్దకు వచ్చిచూచేసరికి పొయిమీద బానలో పిల్లలు ఉడికిపోతూ ఉడికిపోవు చున్నామే యమ్మా అని యరచుచున్నవి. తల్లియు నాబానచుట్టు తిరు గుచు నుడకకండిబిడ్డలారా! ఉడకకుండా ఉండాల్సివాయనము నిచ్చి నాను. అని తల్లిచెప్పినది. పిమ్మట పిల్లలు చచ్చితిమే యమ్మా అని

యరచినవి. చావకండిబిడ్డలారా! చావకుండా చలిమిడి వాయన మిచ్చితినని తల్లిపలికెను. అంత చిమిడితిమే యమ్మా యని పిల్లలరచినవి. చిమడకండిబిడ్డలారా! చిమడకుండాచిమిలివాయన మిచ్చినానని తల్లియనెను. తరువాతపిల్లలు వేగితిమే యమ్మా అని యరచినవి. వేగకండిబిడ్డలారా! వేగకుండావేపుడుబియ్యము వాయనమిచ్చినానని పలికెను. పేలిపోతిమె యమ్మా యనిపిల్లలరచినవి. పేలకండిబిడ్డలారా పేలకుండా పేలాలు వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. అడుగంటితిమే యమ్మా యని పిల్లలరచినవి. అడుగంటకండి బిడ్డలారా! అడుగు పట్టకుండా అట్లవాయనమిచ్చినానని తల్లిపలికెను. కాలిపోతిమే యమ్మా యని పిల్లలరచినవి. కాలకండి బిడ్డలారా! కాలకుండా కఱ్ఱలు వాయన మిచ్చినానని తల్లిపలికెను. పాకితిమే యమ్మా యని పిల్లలరచినవి. పాకకండిబిడ్డలారా! పాకకుండా పరమాన్నము వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. పొంగితిమే యమ్మా యని పిల్లలరచినవి. పొంగకండి బిడ్డలారా! పొంగకుండా పోలులు వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. నానితిమే యమ్మా యని పిల్లలరచినవి. నానకండి బిడ్డలారా! నానకుండా నానబియ్యము వాయనమిచ్చితిని యని తల్లిపలికెను. మాడితిమే యమ్మా యని పిల్లలరచినవి. మాడకండి బిడ్డలారా! మాడకుండా మాడలు వాయనమిచ్చినానని తల్లిపలికెను. కందితిమే యమ్మాయని పిల్ల లరచినవి. కందకండి బిడ్డలారా! కందకుండా గారెలు వాయన మిచ్చినానని తల్లిచెప్పెను. ఇట్లుచెప్పుచు తల్లి బానచుట్టు తిరుగునప్పటికి పిల్లలన్నియు పయికివచ్చి తల్లిదగ్గరకు వెళ్ళిపోయినవి. ఇది యంతయు చూచుచున్న చాకలిది ఆశ్చర్యమునొంది కుందేలు నెట్లుపిల్లలన్నియు బ్రతికివచ్చెనని యడిగెను. అప్పుడాకుందేలు చాకలిదానితో నీవు నా పిల్లలున్న బాన పొయిమీదపెట్టి ఉడికించుచున్నావు. నాపిల్లలన్నియు నరచుచున్నవి. ఆమేడుపువిని సహింపలేక శోకముతో బానచుట్టు తిరిగి

నాను. అంతకన్న నేనేమియెరుగనని చెప్పెను. అప్పుడు చాకలిది యీ రోజున అమావాస్య ఈరోజుమొదలుకొని కథచెప్పి అక్షతలువేసికొని దీనికి కుందేటిఅమావాస్య అని పేరుపెట్టుకొని నోముపట్టెను. నోము పట్టి పైకథ చెప్పుకొని అక్షతలువేసుకొనెను. ఈప్రకారము పదమూడు అమావాస్యలు నోచుకొని అమావాస్యకొక్క రకము నొప్పున చలిమిడి మొదలైనవి చేసికొని దక్షిణతాంబూలముపెట్టి ముత్తయిదువలకు వాయనమిచ్చెను.

దీనికి ఉద్యాపనము:—మూడుమాని కెల బియ్యము చలిమిడి చేసి అది కుందేటి తల్లిపిల్లలుగాచేసి చాకలిబానకొని దానిలోపెట్టి చీర రవికలగుడ్డ నల్లపూసలు లక్కజోడు దక్షిణతాంబూలముతో ముత్తయిదువకు వాయనముఇయ్యవలెను. కథ లోపమైనను వ్రతలోపము కాగూడదు. భక్తి తప్పినను ఫలముతప్పదు.

---

## దంపతుల తాంబూలమునోము.

ఒకరాజుభార్య దంపతితాంబూలము నోముపట్టి ఉల్లంఘున చేసెను. అందువలన భార్యాభర్తల కెడబాటువచ్చెను. సిరిసంపదకూడ తక్కువయ్యెను. ఇట్లు కొన్నాళ్లుండి సహింపలేక యాచిన్నది అడవిలోకివెళ్ళి యచ్చట యేడ్చుచు కూర్చుండెను. పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చి ఎందుకేడ్చుచున్నావని యడుగగా నాయనా! మీకెందుకు వెళ్ళుమనిచెప్పెను. అందుకు వారు లాగుకాదు చెప్పవలసినదని యడిగిరి. ఆమె నాపెనిమిటి దేశాంతరము వెళ్ళినాడు. సిరిసంపద తగ్గిపోయినది. అందుచేత విచారించుచున్నానని చెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు నీవు కిందటి జన్మమున దంపతితాంబూలముల నోముపట్టి ఉల్లంఘునముచేసినావు. అందుచేత నీ కీ విచారము కలిగినది. ఇప్పుడీకథచెప్పి అక్షతలు వేసుకొని ఏడాది తాంబూలమిచ్చి

పడాదియైనతరువాత ఉద్యాపన చేసుకోవలసినదని చెప్పి యదృశ్యులైరి. ఆమె ఆప్రకారము జరుపగా భర్త వచ్చెను. సిరిసంపదలతో సుఖముల ననుభవించెను.

దీనికి ఉద్యాపనము:—దంపతులకు తలంటి నీళ్లుపోసి మున్నాట అరువది ఆకులు మున్నాట అరువది పోకలు తాంబూలసరంజాము ఒకపళ్లెమైనను, పాందానమైనను కొని దానిలోనుంచి, దంపతులకు భోజనముపెట్టి అందియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలముతప్పదు.

---

## 28. పదహారుఫలములనోముకథ.

ఒకరాజుభార్యయు ప్రధానిభార్యయు పదునారుఫలములనోము పట్టి ప్రధానిభార్య మంచిఫలములనన్నిటిని యెంచి యథాశక్తి దక్షిణతో నొకముత్తయిదువకిచ్చినది. రాజుభార్య నేనుగదా గొప్పదానని గర్వించి పదునారురకముల ఫలములు తెప్పించి కొట్టులో వేయించి మంచిచెడ్డలు చూడకుండ దానముచేసినది. తరువాత ప్రధానిభార్యకు మంచి సంతానముకలిగెను. రాజుభార్యకు గుడ్డివాండ్రు, కుంటివాండ్రు పిల్లలుకలిగిరి. అప్పుడు రాజుభార్య ప్రధానిభార్యను జూచి యేమమ్మా! మనమిద్దరముకూడ నోముపట్టినాము. ఉద్యాపనచేసినాము. నీకు మంచిపిల్లలు పుట్టడమేమి ? నాకిట్టిసంతానముకలుగడమేమి యని యడిగెను. అంతట ప్రధానిభార్య నీవుగర్వించి అన్నిఫలములను ఒక్కసారి దానముచేసినావు. నేను ఏ ఫలముకాఫలమేర్చి చేసినాను. అందుచేత నీకు ఇట్టి సంతానముకలిగినది. నాకట్టిసంతానము కలిగినది అనిచెప్పినది. అప్పుడురాజుభార్య యేమిచేయుమన్నావమ్మాయిప్పుడని ప్రధానిభార్య నడిగెను. తిరిగి పదునారుఫలములనోముపట్టి మంచి మంచి ఫలముల నెంచి తగిన దక్షిణతో నుద్యాపన చేసుకుంటె మంచిసంతానముగును

అని ప్రధానిభార్య చెప్పెను. ఆప్రకారము రాజుభార్య నోముపట్టి పదహారు ఫలాలు ఉద్యాపన చేసుకొనెను.

---

## 29. సౌభాగ్యతదియలు.

ఒకబ్రాహ్మణున కొక ఆడపిల్లకలదు. ఆమెకు, చిన్ననాటనే విధవరికము సంభవించెను. అందునుగూర్చి తలిదండ్రులు మిక్కిలి విచారించుచుండెడివారు. ఆ జననీజనకులు కొంత కాలమువరకుండి దుఃఖశాంతిగానక పిల్లతో కానలకుబోయి విచారించుచు తిరుగుచుండగా భూమి పాలించుటకు పార్వతీపరమేశ్వరులు వచ్చి ఏమి మీరు యీలాగు విచారించుచు తిరుగుచున్నారు అని యడిగిరి. అప్పుడువారు మీకెందుకునాయనా వెళ్ళండి యని చెప్పగా పార్వతీ పరమేశ్వరులు కాదు కూడదు. చెప్పవలసినదని యడిగిరి. అప్పుడా తలిదండ్రులు లేక లేక మాకీపిల్ల యొకర్తుకయే పుట్టినది. దీనికి పెళ్ళిచేసినాము. పెండ్లి కాగానే భర్త పరలోకగతుడాయెను. ఆదుఃఖము భరించలేక యీలాగుపిల్లతో తిరుగుచున్నాము. అని చెప్పినారు. అప్పుడా పార్వతీ పరమేశ్వరులు అయ్యో! ఆపిల్ల క్రిందటిజన్మమున సౌభాగ్యతదియలు నోముపట్టి ఉల్లంఘనచేసినది. అందుచేత నిట్టి యాపదాచిన్నదానికి సంభవించినది. ఆథదపోవుటకుగాను తిరిగి యానోముపట్టి యుద్యాపన చేసుకొనవలసినదని చెప్పినారు. మంచిదియని యపుడీనోము పట్టించి సంవత్సరముపొడుగున పౌర్ణమివెళ్ళిన తదియ యుపవాసముండి ఎడచేర పెడచేర బియ్యంపోసి యెదుటమనిషితో మాటలాడకుండా ఉప్పువేయని చప్పిడి తిని మేడాది అయినతరువాత నుద్యాపన చేసికొనెను.

ఉద్యాపన:—పీసెయేబులంపసుపు, మనిషితో మాటలాడకుండా కలియగొట్టి 13 వెదురుపెట్టెలలో పోసి పదమూడుకానులు దక్షిణ

తాంబూలము 13 లక్కజోళ్లు 13 రవికెలగుడ్డలు 13 నల్లపూసలకోడు లుపెట్టి 13 గురు ముత్తయిదువులకు వాయనము యివ్వవలెను. కథ లోపమయినను వ్రితలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

---

## 30 మాఘపాదివారము.

మాఘపూర్ణిమముందర రథసప్తమునాడు సోమిలారిసోమిదేవమ్మ పసుపువ్రాసుకొని స్నానముచేసి పచ్చనియక్షతలుచేతపట్టుకొని కుమారులారా! నాపాలింటి మాఘపాదివారములకథ వినవలయునని కొడుకులను పిలిచియడిగెను. అంతట నొకకుమారుడు మాకేమికథ, మాకేమికారుణ్యమమ్మా! రాజుగారు కచ్చేరికి వచ్చువేళయైనది. అక్కడికి పోవలెనని చెప్పి యట్లు కచ్చేరికివెళ్ళెను. రాజుగారు నింతకు ముందుగానే కచ్చేరికివచ్చి యాలస్యముగా వచ్చిన యీబ్రాహ్మణకుమారుని దేవిడి మన్ననచేసినారు. అప్పుడాకుమారుడు, సోములారి సోమిదేవమ్మ కథ విననిదోషము కట్టికుడిపినదని చింతించుచు తనగృహమునకువెళ్లెను సోమిదేవమ్మ మనుమలనుబిలిచి మనుమలారా! నాపాలింటి మాఘపాదివారములకథ వినెదరా అని యడుగగా బడికిపోవలెను. పంతులు కొట్టిపోవును అనిచెప్పుచు మనుమలు బడికివెళ్ళిరి. ఇంత పొద్దుపోయి రావడమేమి యని పంతు లాబాలురను కొట్టెరె. అప్పుడా చిన్నకుఱ్ఱలు సోములారి సోమిదేవమ్మకథ విననిదోషము కట్టి కుడిపింది యని యనుకొనిరి. సోములారిసోమిదేవమ్మ తనకోడలనుపిలిచి కోడలా! నాపాలింటి మాఘపాదివారములకథ వినవా యని యడుగనాకేమికథ? నాకేమి కారుణ్యమమ్మా? నాపిల్లకు పాలు,ఉగ్గు పోసుకొనవలెనని కోడలుచెప్పి ఉయ్యాలలోనున్న తనబిడ్డయొద్దకు వెళ్ళి చూచునప్పుడు ఉయ్యాలలోని బాల కొయ్యపారిపోయెను. అప్పుడాకోడలు అయ్యో! సోములారి

సోమిదేవమ్మకథ విననిదోషము కట్టెకుడిపిసదని విచారించెను. తిరిగి సోములారిసోమిదేవమ్మ నీళ్ళరేవుదగ్గరకు వెళ్ళి నీరాడెడుయక్కలారా! పాలాడెడు యక్కలారా! యని నీళ్ళరేవున స్నానముచేయు కాంతలను పిలిచి నాపాలింటిమాఘపాదివారములకథ వినెదరా యని యడిగెను. అప్పుడా స్త్రీలు మేము నీళ్ళు పాలు తెచ్చుకొనవలెనమ్మా అని చెప్పి నీళ్ళకడవలు భుజములపై నుంచుకొని బోగా నవి విచ్చిపోయినవి. అయ్యో! సోములారిసోమిదేవమ్మ కథవిననిదోషము కట్టెకుడిపిసది యని యాస్త్రీలందరు విచారించిరి. పిమ్మట సోములారి సోమిదేవమ్మ వీధి లోనికివచ్చి నిలుచుండగా నొకబ్రాహ్మణు డెదురుగుండా వచ్చెను. అప్పుడా సోమిలారి సోమిదేవమ్మ బ్రాహ్మణునిపిలిచి బ్రాహ్మణుడా! నాపాలింటి మాఘపాదివారములకథవినవాయనియడుగనాబ్రాహ్మణుడు పంచాంగము చెప్పికోవలెనని చెప్పి రాజుగారియింటికివెళ్ళేసరికితలుపులు మూయబడి వెళ్ళుటకు వీలులేకపోయెను. అంతటబ్రాహ్మణుడు సోమిలారి సోమిదేవమ్మకథ విననిదోషముకట్టె కుడిపిందనివిచారించుచుపోయెను. తరువాత సోములారి సోమిదేవమ్మకు మేదరివాడెదురుగావచ్చేసరికి నాపాలింటి మాఘపాదివారముకథ వినవా యని వానినడుగ మాకేమి కథ మాకేమికారుణ్యామమ్మా! తట్టబుట్టనల్లుకోవలెనని మేదరవాడువెళ్లి తట్టలల్లుకొనుచుండగా కత్తి విరిగిపోయినది అయ్యో! సోములారిసోమిదే వమ్మకథవినని దోషముకట్టెకుడిపిసదని మేదరివాడుచింతించెను. పిమ్మట ఉప్పరివాడు కనపడ, వానినిపిలిచి ఉప్పరీ! నాపాలింటిమాఘపాదివార ములకథ వినెదవా యని యడుగ వాడు మాకేమికథ మాకేమికారు ణ్యామమ్మా! గట్టుపుట్టపెట్టుకొనపోవలెనని చెప్పి గట్టుపుట్ట పెట్టుకొను టకు పోగా గడ్డపార విరిగిపోయెను. అయ్యో! సోములారి సోమిదేవ మ్మకథ విననిదోషము కట్టెకుడిపిం దని యుప్పరివాడనుకొనెను. తరు వాత చాకలివాడు యెదురుగా వచ్చుచుండ చాకలివానినిపిలిచి

చాకలీ! నాపాలింటి మాఘపాదివారములకథ వినెదవా యని సోము లారిసోమిదేవమ్మ అడిగెను. వా డందుకు మాకేమికథ మా కేమికా ర్యమమ్మా! రాజుగారికి బట్టలారవేయుటకుపోవలెనని బనులుచెప్పి యింటికిపోగా, గాలివానవచ్చి బట్టలెగరగొట్టుకొనిపోయినవి. అయ్యో! సోములారి సోమిదేవమ్మకథ వినని దోషముకట్టి కుడిపినదని యను కొనెను. తరువాత కుమ్మరివా డెదురుగావచ్చెను. అప్పుడు వానిని పిలిచి కుమ్మరీ! నాపాలింటి మాఘపాదివారములకథ వినెదవా యని యనుగ నాకేమికథ నాకేమి కార్యమమ్మా! రాజుగారికి వెండిబాన పయిడిబాన చేయుటకు పోవలెనని చెప్పి యింటికిపోయి వెండిబానపయి డిబాన చేయబోవునప్పుడు కుమ్మరిసాన విరిగిపోయెను. అప్పుడు వా డయ్యో! సోములారిసోమిదేవమ్మకథ విననిదోషముకట్టి కుడిపిందని యనుకొనెను. కొంతకాలమున కుప్పరమాదేవి యెదురుగరాగా సోము లారి సోమిదేవమ్మ ఉప్పరమాదేవిని పిలిచి నాపాలింటి మాఘపాది వారములకథ వినెదవా యని యామె నడిగెను. అప్పు డామె యిట్లు చెప్పెను. "వినెదను. నిన్న శనివారము వంటిపూట భోజనము. ఈరోజు ఆదివారము మా నెదు పాలలో చేరెడుబియ్యముపోసిపెట్టిన, కథవినెద" నని చెప్పెను. మంచిదని సోములారిసోమిదేవమ్మ మానెదు పాలలో చేరెడుబియ్యముపోసి పెట్టినది. తిని యుప్పరమాదేవి గట్టుమీద పడు కొని నిదురపోయినది. ఆమెకడుపులోనున్న పిల్లసోములారి సోమిదేవ మ్మతో మాఅమ్మబొడ్డుమీద నక్షతలువేసి కథ చెప్పుకోవమ్మా వినెద నని చెప్పెను ఇట్లు బొడ్డుమీద నక్షతలువేసి, సోములారిసోమిదేవమ్మ.

"పాడుపూర్యాపట్నాలవును, పట్టిజోజో, పాపజోజో
పట్టిమూరినూపండ్లుపండు-పట్టిజోజో-పాపజోజో
పట్టియావుపాలనిచ్చు-పట్టిజోజో-పాపజోజో
గొడ్డువాండ్రుబిడ్డలగందురు-పట్టిజోజో-పాపజోజో
వేచివేసినా వెయివేలుపండు-పట్టిజోజో-పాపజోజో

నూర్చివేసినానూరువేలుపంను-పట్టిజోజో-పాపజోజో
కోసివేసినాకోటివేలుపండు-పట్టిజోజో-పాపజోజో
రాతిమీదనూగాజనాలపండు-పట్టిజోజో-పాపజోజో
పత్తిగింజలూముత్యాలౌను-పట్టిజోజో-పాపజోజో
వచ్చినపురుషుడు లేచివచ్చును-పట్టిజోజో-పాపజోజో
ఏడువారాలనగలూనట్టేటిలోపడినా నట్టింటికివచ్చు - పట్టిజోజో -
పాపజోజో"

అని పాడుచు కథచెప్పుకొనెను. అప్పుడుప్పరమాదేవి లేచి సోమిదేవమ్మా! కథచెప్పుకోవమ్మా వినెదను అని సోములారి సోమిదేవమ్మతో పలికెను. "అమ్మా! నీకడుపులోనిపిల్ల ఆలకించినది. నేను కథచెప్పుకున్నాను. ఆడశిశువుపుట్టినను, మగశిశువుకలిగినను నాకు కబురు చేయు"మని సోములారి సోమిదేవమ్మచెప్పెను. అప్పుడుప్పరమాదేవి యుప్పరపాకలలోనికివెళ్ళి సోమిదేవమ్మకిట్లని వర్తమానముచేసెను. "ఉప్పరమాదేవి నీళ్ళాడినది. ఆడశిశువు కలిగెను. రావలసిన"దని వర్తమానముచేసెను. ఈవర్తమానమువిని సోములారి సోమిదేవమ్మ ఉగ్గునకొకగిన్నెయు, ఉయ్యాలకు నొకచీర, పట్టుకొని వెళ్ళి ఆపిల్లను తీసికొని వచ్చి యడవిలో నశ్వత్థవృక్షమున కుయ్యాలవేసి పక్షులారా! పాడండి, వృక్షవరులారా! ఊచండి అనిచెప్పి కనినతల్లి గట్టుపుట్ట పెట్టుకొనుటకు పోగా, పెంచినతల్లి యింటికివచ్చినది. పక్షులానందముగపాడుచుండెను. వృక్షములూచుచున్నవి. ఒకరాజు సవారియెక్కి యామార్గమున బోవుచు పక్షులపాటయు బాలరోదనమును విని యిది యేమియోకనుగొనుమని తనపరిచారకునితో చెప్పెను. వాడు వెఱచి చెప్పుదునా, వెఱవక చెప్పుదునా? అనిఅడుగ రాజు వెఱవక చెప్పుమనెను. అప్పుడువాడు, మహారాజుగారితో "మాకయినమాత, దేవరవారికయినదేవి" యని చెప్పెను. అంతట నామహారాజు తనసవారి యాయశ్వత్థ వృక్షసమీపమునకు పట్టించి యాబాలను తనపల్లకిలో నుంచికొని పాడుపూరిలోనికి

తీసికొని వచ్చినాడు. ఆపాడుగ్రామము గొప్పపట్టణమయి కడు అందముగా నొప్పుచుండెను. అంత యిదేమిచోద్యముగంటివి అక్కా-అనెను. తరువాత నాపసిబాలలను పత్తిగింజలలో పరుండబెట్టి పయిని పత్తిగింజలే కప్పినారు. ఈబాలశరీరస్పర్శచే పత్తిగింజలన్నియుముత్యాలయినవి. ఇదేమిచోద్యముగంటివి అక్కా- అనెను. వేయించివేయగా వేనవేలు పండినవి. ఇదేమిచోద్యముగంటివి అక్కా- అనెను. కోసివేయగా కోటివేలు పండెను. ఇదేమిచోద్యముగంటివి అక్కా-యనెను. నూర్చివేయగా నూరువేలుపండినవి. ఇదేమిచోద్యముగంటివి అక్కా- యనెను వట్టియావును తీసికొనివచ్చి కట్టిపెట్టినారు. పాలుయిచ్చినది. ఇదేమిచోద్యముగంటివి అక్కా-యనెను. వట్టిమ్రాను తీసికొనివచ్చి పాతిపెట్టగా పండ్లుపండెను. ఇదేమిచోద్యముగంటివి అక్కా-యనెను. రాజుగారి పెద్దభార్యయొద్దకు ఆపిల్లను తీసికొనిపోగా నామెకు కొడుకుపుట్టెను. ఇదేమిచోద్యముగంటివి అక్కా-యనెను. రాజుగారి పెద్దభార్యయొక్క-యు, చిన్నభార్య అయిన ఉప్పరమాదేవికూతురుయొక్క-యు శరీరమందున్న నగలుతీసి యొకబరణిలోనుంచి యాబరణి సముద్రములో పారవేయగా దాని నొకచేప మింగెను. పల్లెవాడొకడు వలవేయగా నాచేప వానికి దొరికెను. అప్పుడాపల్లెవాడాచేపను రాజుగారికి కానుకగా పంపించెను. తిన్నగా నాచేపను రాజుగారి పెద్దభార్య గృహామునకు పట్టుకొనిపోయి యిచ్చిరి రాజుగారు పెందలకడ వంటచేయవలసినదనియు భోజనమునకు వచ్చెదననియు తనపెద్దభార్యకు వర్తమానము చేసెను. అంతట నగనాణెం దానికిని, చేప, జెల్ల నాకునాయని చేపను యుప్పరమాదేవికి పెద్దభార్య పంపివేసినది. ఉప్పరమాదేవియు మంచి కూరవచ్చినదని కత్తిపీట ముందరవేసుకొని తరగబోయేసరికి ఘల్లున చేపకడుపులోనుంచి నగలబరిణె పడినది. నాపాలింటి మహాలక్ష్మి నాయింటికివచ్చినదని పాల, నేతకడిగి పళ్ళెరములోపెట్టుకొని యుప్పరమా

దేవి యేడువారాలనగలు ధరించి పద్మాలపట్టుచీర కట్టుకొని రాజుగారిని భోజనమునకురమ్మని కబురుచేసినది. నగలుపోతే నగలు తెచ్చుకొన్నది. నేపోయిన తిరిగి నన్నేలాగున తెచ్చుకొనునో చూతముగాక యని చిన్నభార్యయయిన యుప్పరయాదేవి యింట్లో భోజనముచేసి పెద్దభార్యయింట్లో విషముతిని చనిపోయెను. అప్పుడు చచ్చినపురుషుని వంటయింటపెట్టి పెద్దభార్య తన సవతిని సహగమనమునకు రమ్మని పిలిచినది. సవతి యగు ఉప్పరమాదేవియు పసపు కలిపి పళ్లెరములో పోసుకొని కుంకుమకొని కుసురుమీంద పెట్టుకొని తలుపున తడకవేసి వెళ్లుచున్నది. అప్పుడాదినారాయణమూర్తి ఆమెకు ప్రత్యక్షమయి ఏమమ్మా! యెక్కడకు వెళ్లుచున్నావు అని యడిగెను. చచ్చినపురుషుడు నట్టింటయున్నాడు. సవతి సహగమనముచేయుచున్నది రాచమాదేవి వచ్చింది ఉప్పరమాదేవినిరమ్మనికబురుపంపించినారు. పసుపుకొనిపళ్లెములోపోసుకొని కుంకుమకొని కుదురుమీందపెట్టుకొనితలుపునతడకవేసి తొందరగావెళ్ళుచున్నానుఅని యుప్పరమాదేవిచెప్పెను. అప్పుడాయన సౌభాగ్యవతీభవ. అంతపనిపుట్టరాదు. నాకు కాళ్లుకడుగుకొనుటకునీళ్ళు యిచ్చి నీవుకూడా కాళ్లుకడుగుకొనవమ్మా అని పలికినాడు. ఆమెయు నాబ్రాహ్మణవేషముతో వచ్చిన నారాయణమూర్తికి కాళ్లుకడుగుకొనుటకు నీళ్ళుయిచ్చి తానుగూడ కాళ్ళుకడుగుకున్నది. తిరిగి యాబ్రాహ్మణుడు నాకు దాహమిచ్చి నీవు దాహము పుచ్చుకోవమ్మా యని చెప్పినాడు. చచ్చిన పురుషుడు నట్టింటయున్నాడు. సవతిసహగమనము చేయుటకు వెళ్ళుచున్నది. పసపుకొని పళ్ళెములోపోసినాను. కుంకుమకొని కుదురుమీందపెట్టినాను. తలుపునతడకవేసినాను. కాళ్లుకడుక్కొని కాళ్ళు దాచిదాను. దాహ మెక్కడదాచనయ్యా అని యుప్పరమాదేవి చెప్పెను. అప్పుడాబ్రాహ్మణుడు సౌభాగ్యవతీభవ. అంతపనిపుట్టరాదు. నాకు దాహమిచ్చి నీవు దాహము పుచ్చుకోవమ్మా యని

చెప్పెను. ఆప్రకార మాబ్రాహ్మణునికి దాహమిచ్చి తానుకూడా దాహముపుచ్చుకొన్నది. తరువాత నాబ్రాహ్మణుడు నాకు తలయంటి నీవుకూడ తలయంటుకోవమ్మా అనిచెప్పెను. చచ్చినపురుషుడు నట్టింట నున్నాడు. సవతిసహగమనము చేయుచున్నది. పసుపుకొని పళ్లెములో పోసినాను. కుంకుమకొని కుదురుమీద పెట్టినాను. తలుపున తడక వేసి నాను. కాళ్ళుకడుగుకొని కాళ్ళుదాచినాను. దాహముత్రాగి దాహ ముదాచినాను తలయంటుకొని తల యెక్కడ దాచనయ్యా అనెను. సౌభాగ్యవతీభవ. అంతపని పుట్టరాదు. నాకు తలయంటి నీవుకూడా తలయంటుకోవమ్మాఅని బ్రాహ్మణుడు పలికినాడు. ఆప్రకార మా బ్రాహ్మణునికి తలయంటి తానుకూడా తలయంటుకొనెను. తరువాత నాబ్రాహ్మణుడామెను అడిగిన దేమనగా తనకుగంధమిచ్చి యామెను పసపుపూసుకొనుమనెను. చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు. సవతి సహగమనము చేయుచున్నది. పసపుకొని పళ్ళెములోపోసినాను. కుంకు మకొనికుదురుమీద పెట్టినాను. తలుపునతడక వేసినానుకాళ్లుకడుగుకొని కాళ్ళుదాచినాను. దాహముపుచ్చుకొని దాహము దాచినాను. తల యంటుకొనితలదాచినాను.పసుపురాసుకొనిమొగమెక్కడదాచనయ్యా అనియామెజవాబుచెప్పెను. సౌభాగ్యవతీభవ అంతపనిపుట్టరాదు.నాకు గంధమిచ్చి నీవు పసపురాసుకోవమ్మా! అనిబ్రాహ్మణుడు తిరిగిచెప్పెను. ఆప్రకారము బ్రాహ్మణునికి గంధమిచ్చి తాను పసపు పూసుకొనెను. తిరిగి యాబ్రాహ్మణుడు నాకుబొట్టునిచ్చి నీవుకూడాబొట్టు పెట్టుకొన వమ్మా యనిచెప్పెను. చచ్చినపురుషుడు నట్టింటనున్నాడు. సవతి సహ గమనముచేయుచున్నది. పసపుకొని పళ్ళెములోపోసినాను. కుంకుమ కొని కుదురుమీదపెట్టినాను. తలుపున తడకవేసినాను. కాళ్లు కడుగు కొని కాళ్ళుదాచినాను. దాహముపుచ్చుకొని దాహము దాచినాను. తలయంటుకొని తలదాచినాను. పసుపురాసుకొనిమొగముదాచినాను

బొట్టుపెట్టుకొని బొట్టెక్కడదాచనయ్యాఅనెను. సౌభాగ్యవతీభవ. అంత పనిపుట్టరాదు. నాకుబొట్టునిచ్చి నీవుబొట్టుపెట్టుకొనవమ్మా అని బ్రాహ్మణుడు పలికెను. ఆప్రకారము బ్రాహ్మణునికి బొట్టునిచ్చి తాను కూడాబొట్టుపెట్టుకొనెను. తిరిగి యాబ్రాహ్మణుడునాకు భోజనముపెట్టి నీవు భోజనముచేయువమ్మా అని యామెతోచెప్పెను. చచ్చినపురుషుడు నట్టింటనున్నాడు. సవతి సహగమనముచేయుచున్నది. పసపుకొని పళ్ళెములోపోసినాను. కుంకుమకొనికుదురుమీాదపెట్టినాను, కాళ్ళుకడుగుకొనికాళ్లుదాచినాను. దాహముపుచ్చుకొని దాహముదాచినాను. తలయంటికొనితలదాచినానుపసపురాసుకొనిపసపుదాచినాను. బొట్టుపెట్టుకొనిబొట్టుదాచినాను. అన్నముతినికడుపెక్కడదాచనయ్యాఅని ఆమెచెప్పెను. సౌభాగ్యవతీభవ అంతపనిపుట్టరాదు. నాకుభోజనముపెట్టి నీవు భోజనముచేయువమ్మాఅనిబ్రాహ్మణుడుపలికెను. ఆప్రకారముబ్రాహ్మణునకు భోజనముపెట్టితానుకూడాభోజనముచేసెను. అప్పుడాబ్రాహ్మణుడు నాకు తాంబూలమిచ్చి నీవుకూడా తాంబూలము వేసికొనవమ్మాఅనిచెప్పెను. చచ్చినపురుషుడు నట్టింటనున్నాడు. సవతిసహగమనముచేయుచున్నది. పసపుకొనిపళ్ళెములోపోసినాను. కుంకుమకొని కుదురుమీాదపెట్టినాను కాళ్ళుకడిగికొని కాళ్లుదాచినాను. దాహముపుచ్చుకొనిదాహముదాచినాను. తలయంటుకొని తల దాచినాను. పసపు రాసుకొని పసపు దాచినాను. బొట్టు పెట్టుకొని బొట్టుదాచినాను. అన్నముతిని అన్నముదాచినాను. తాంబూలము వేసుకొని నోరెక్కడ దాచనయ్యా అని ఆమె చెప్పెను. సౌభాగ్యవతీభవ అంత పని పుట్టరాదు. నాకు తాంబూలమిచ్చి నీవుకూడా తాంబూలమువేసుకొనవమ్మా అని బ్రాహ్మణుడుపలికెను. ఆప్రకారము బ్రాహ్మణునికి తాంబూలమిచ్చి తానుకూడా తాంబూలమువేసికొనెను. అప్పుడాబ్రాహ్మణుడు దివ్యమంగళవిగ్రహుండై శంకచక్రగదాధారుండై యాదినారాయణమూర్తి

యామెకుప్రత్యక్షమయ్యెను. అప్పుడామె మెచ్చితినయ్యా శంఖచక్రగదా ధరుండా! నిన్నుకోరితి వరమీయవయ్యా అనికోరెను ఇచ్చి పుచ్చుకోమని పచ్చనియక్షతలుఆమెచేతిలో నారాయణుండుంచినాడు. నీవువెళ్ళేసరికి కటుకుమీదపురుషుని కాటిమీదపెట్టుచుందురు. అప్పుడు నీవు మూడుప్రదక్షిణములుచేసి యక్షింతలు మీదచల్లవలెను. చల్లిన వెంటనే నీపురుషుఁడు లేచికూర్చుండును. అని నారాయణమూర్తి చెప్పెను. ఆప్రకారమామె యక్షతలుపట్టుకొనివెళ్ళి మూడు ప్రదక్షిణములుచేసి ఆయక్షతలు మీదచల్లేసరికి యెంతనిద్రపోయి లేచినాను అని యామెభర్త లేచికూర్చుండెను. అప్పుడందరు ఆశ్చర్యము నొంది యేమినోముపట్టితివమ్మా యని యాబాలగోపాల మామెను అడుగసాగిరి. ఏమినోముపట్టలేదు ఏమివ్రతము పట్టలేదు. మాఘపూర్ణిమ ముందర రథసప్తమినాడు మాఘపాదివారములనోముపట్టి సోములారి సోమిదేవమ్మ కథచెప్పుకొని యక్షతలువేసికొన్నది. ఆకథ నేనువిన్నాను విన్నఫలమే కాని పట్టినఫలముకాదిది అని యామె చెప్పెను. విన్నంత మాత్రాన యింతఫలమువచ్చినది. నోముపట్టిన యెంతఫలమువచ్చునో యని రాజు తనయిద్దరిభార్యలచేతను నోముపట్టించినారు. వారు పట్టిన నోమే కలియుగమందలియందరూ పట్టినారు. నోముపట్టినసంవత్సరము పాలుత్రాగరాదు. మరుసటిసంవత్సరము మజ్జిగత్రాగరాదు. మూడవ సంవత్సరము పప్పుతినరాదు. నాలుగవయేడు తలంటుకోరాదు. అయిదవయేడు తాంబూలము వేసికొనరాదు. అయిదేండ్లనంతరము ఉద్యాపనచేయవలెను.

దీనికిఉద్యాపన:—తలయంటుకొననిసంవత్సరము అయిదుగురు ముత్తయిదువులకు తలంటి, పప్పుతిననియేడు బూరెలువండి, పాలుత్రాగనియేడు పరమాన్నమువండి, చల్లత్రాగనియేడు పెరుగువడ్డించి తాంబూలమువేసుకొననియేడుతాంబూలమిచ్చి యీప్రకారముఅయిదుగురు

ముత్తయిదువులకు అయిదురవికెలగుడ్డల నిచ్చి ఆదినారాయణమూర్తికి అయిదుమూళ్ల అంగవస్త్రమిచ్చి ఉగ్గునకు గిన్నెయు ఉయ్యేలకుచీరయు నిచ్చి ఉద్యాపనచేసుకొనవలెను.

---

## 51 సూర్యపద్మము.

ఒకానొక గ్రామమున నొకబ్రాహ్మణుండు నొకరాజు నొక కోమటి యొకకాపు నొకగొల్లవాడు నుండిరి. వీరయిదుగురు అయిదు కుంచములను కొనుక్కొనిరి. ఈ అయిదుకుంచములు రోజురోజు నా గ్రామముననున్న దేవాలయమునకు బోయి తమలో తాము నాతో నిన్న వరహాలు కొల్చినారు, నాతోనిన్న వడ్లు కొలిచినారు అనిచెప్పు కొనుచుండేవి. వాటిలో బ్రాహ్మణకుంచము తనయజమాని యగు బ్రాహ్మణునికి దరిద్రమగుటను తనతో, యేమేమి కొల్చినారో చెప్పక యూరక కూర్చుండినది. ఒకనాడు తక్కిన నాలుగుకుంచములు యథాప్రకారముగ దేవాలయమునకు వెళ్లెనుగాని బ్రాహ్మణకుంచ మారోజున రాలేదు. ఎందుచేత బ్రాహ్మణకుంచమురాలేదు. అని తమలో దాము కొంతసేపు తర్కించుకొని కొంతసేపు కూర్చుని తమ తమయిండ్లకు తిరిగి వెళ్ళిపోయెను మరుచటిరోజున కుంచములన్నియు నాదేవాలయముసజేరి నాతో నిన్నివరహాలు కొలుచుకున్నారు. నాతోనిన్నివడ్లుకొలుచుకున్నారు అని చెప్పుకొనుచున్నవి. అప్పుడు బ్రాహ్మణకుంచమునుజూచి తక్కినకుంచములు నిన్న నెందుకువచ్చినావు కావు అని యడిగినవి. పోలడునూకలుండగా మాయమ్మగారు నాలో పోసి మూతవేసినందున నిన్నటిరోజున నేను వచ్చుటకు వీలులేకపోయి నదని బ్రాహ్మణకుంచము చెప్పెను. అందుమీద తక్కిన వన్నియు నెప్పుడుచెప్పినా నూకలు అల్లు కొలిచినారని చెప్పుచుండెదవు, అని నిరసించి పలికెను. అంత నాబ్రాహ్మణకుంచము "యేమిచేయు

మన్నారు ? మరి మెల్లకాల మీలాగే యుంటానా యేమిటి ! కొన్ని నాళ్ళకు మాఅమ్మకు కుమార్తెపుట్టును. ఆపిల్లబొడ్డున మాణిక్యము పెట్టుకొని మరి పుడుతుంది. ఆసంగతి యొకబ్రాహ్మణుడు గ్రహించి యాబాలికను తన కిం డని యడుగును. అప్పుడు మాకెంతైన భాగ్యముకలుగును. అప్పుడు మేముకూడా వరహాలుకొలుచుకొనెదము” అని చెప్పెను. ఎవ్వడో కొలుచుకుంటారట అని నవ్వి తక్కినకుంచములు వెళ్ళిపోయెను. బ్రాహ్మణకుంచమును తనదారిని యింటి కేగెను. ఈపయిసంభాషణనంతయు నొక బ్రాహ్మణుడు విని సమయముకొరకు వేచియుండెను. అందులో బ్రాహ్మణకుంచముగల బ్రాహ్మణునికి బొడ్డున మాణిక్యముపెట్టుకొని యొక ఆడపిల్లపుట్టెను. ఆపిల్లయొక్క బొడ్డునుండి ప్రతిరోజున నొకమాణిక్యము పడుచుండునది. దానివలన వారు కావలసినంత భాగ్యవంతులయిరి. ఇదివరలో కుంచముల సంభాషణ విని సమయమున కెదురుచూచుచున్న బ్రాహ్మణుడు బ్రాహ్మణకుంచముగారి యింటికివచ్చి యజమానిగారిని నీకూతురును నాకు యిచ్చి వివాహముచేయవలసినదని యడిగెను. ఆప్రకారము తమకూతునిచ్చి యాబ్రాహ్మణునికి వివాహముగావించిరి. తరువాత పెండ్లికుమారుడగు నాబ్రాహ్మణుడు వివాహానంతరము తనయింటికి వెళ్ళెను. కొంతకాలమైన తరువాత తిరిగివచ్చి తన భార్యయగు ఆపిల్లను తీసికొనిపోయెను. ఈచిన్నది వెళ్ళినతరువాత వారుకూడా మంచి భాగ్యవంతులయిరి. ధనాశచే నాబ్రాహ్మణుడు తనభార్యను పుట్టింటికి పంపుట మానినవాడు. ఒకనాడాచిన్నది, తల్లినిచూడవలెనను తలంపుతో భర్తయెక్కడికో వెళ్ళినప్పుడు తనపుట్టింటికివెళ్ళి చూచి తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమందు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షులయి యీచిన్నదానిని యెక్కడకుబోవుచుంటివని యడిగిరి. అప్పుడాచిన్నది మాయమ్మను చూడవలసియుండి వెళ్ళి తిరిగి వెళ్ళుచున్నానని చెప్పెను

అప్పుడు పార్వతీపరమేశ్వరులు యీమెతో నయ్యో వెఱ్ఱిదానా! అలాకాదు. నీతలిదండ్రులకు నీవు పుట్టుటచేత భాగ్యము వచ్చినది. అందుచే వారు నిన్ను వదలిపెట్టలేదు. ఈకారణముచేతనే నీభర్తయు నిన్ను వదలిపెట్టలేక నిన్ను పుట్టింటికి పంపినాడుకాదు. అంతేగాని మరేమికాదు అని చెప్పినారు. ఇప్పుడేమిచేసినట్టయితేనాకు మావారికి కలియునో చెప్పవలెననివారిని యీచిన్నది ప్రార్థించెను. క్రిందటిజన్మమున సూర్యపద్మమునోము పట్టినావుగనుక నీవు బొడ్డున మాణిక్యముపెట్టు కొని పుట్టినావు. అప్పుడు ఉదయముచూచి యుద్యాపన చేసినావు కావు కాబట్టి మీయిద్దరికి యిష్టము తక్కువగానున్నది. ఇప్పుడీనోము పట్టి యుద్యాపనచేస్తే మీరిద్దరు యిష్టముగా నుండెదరు.

దీనికి ఉద్యాపన:—ప్రొద్దుపొడవకుండా దంపతులిద్దరికి తల యంటి నీళ్లుపోసి మట్టెలు మంగళసూత్రము యిచ్చి చీరయు జామారు నొసంగి ప్రొద్దుపొడవకుండా యుద్యాపన చేసుకొమ్మనిచెప్పి పార్వతీ పరమేశ్వర్లంతర్థానము నొందిరి.

---

## 32. నందికేశ్వరవ్రతకథ.

ఒకనాడు కైలాసపర్వతమున వినోదమందిరమున పార్వతిపర మేశ్వరునకు పాదము లొత్తుచుండగా పరమేశ్వరుడు పార్వతితో నిట్ల నియె. ఓపార్వతీ! నీచేతులు మృదువుగానుండక నాపాదములు నొ చ్చుచున్నవి. కావున నీవు నాపాదములొత్త వద్దనియె. అందుకు పార్వతి చింతాకులస్వాంతయై, దేవా! ఎందుచేత నిట్లుండెనో చెప్పవలయునని ప్రార్థించగా పరమేశ్వరుడు నీవు పరోపకారముచేసినావుకావు. అందు చేత నిట్లుండె ననియెను. ఇందుకేమిచేసిన నీకర్కశతపోవునని యడుగ నీశ్వరుడు, నీవు నీళ్లరేవున నీళ్లపొయ్యివేసుకొని నీళ్లుకాచుచు వచ్చి

పోవువారికి తలంటి నీళ్లుపోసిన నీచేతులకు మృదుత్వమువచ్చునని చెప్పెను. పార్వతి ఆప్రకారము నీళ్లుకాచి వచ్చిపోయేవారికి పోయుచుండగా నొకపేదరాలు తలంటి నీళ్లుపోసుకుందామని పిల్లలు తాను వచ్చుటికిరాగా వారికిగూడ తలంటి నీళ్లుపోసెను. పిమ్మట వారు పార్వతి యొద్ద సెలవుతీసుకొని పోవుచుండగా వారినిజూచి పార్వతి వీరికిభాగ్యమిచ్చెదనని మనస్సులో సంకల్పించుచునెను. ఆపేదరాలు ఇంటికివెళ్లుసరికి పెనిమిటి యెడనొకమూట పెడనొకమూట వేసుకొని వచ్చెను. ఆరోజు కారోజు వారికి క్రమముగ భాగ్యమువచ్చెను. అంత నా బ్రాహ్మణుని భార్య బంగారుతూగుటుయ్యేలలో కూర్చుండి వచ్చిపోవువారికందరికి పని చెప్పుచుండెను. అది పెద్దవాడుకగా నూళ్లవెంట చెప్పుకొనుచుండిరి. అప్పుడు పార్వతి నేను భాగ్యమిచ్చిన బ్రాహ్మణస్త్రీ కాబోలు. ఇంతకు వచ్చినదనుకొని ఒక పేదముత్తయిదువయై యాబ్రాహ్మణ స్త్రీయింటికివచ్చి వాకటిలో నిలువబడెను. ఆబ్రాహ్మణస్త్రీ బంగారపు తూగుటయ్యేలలో నూగుచుండి యాముదుసలియవ్వను గాంచి అమ్మా! పాలుపొంగు వచ్చినవి. పాలమీద నొక్కనీళ్లచుక్క చల్లి వెళ్లుమనెను. అప్పుడామె పాలమీద నీళ్లుచల్లి యింటికివెళ్లి తలగట్టుకొని పడుకొన్నెను. అప్పుడు పరమేశ్వరుడు వచ్చి యెందుచేత నీలాగుంటివని యడుగగా బ్రాహ్మణునిభార్యకు తానుభాగ్య మిచ్చినదిమొదలుకొని జరిగినచర్య చెప్పినన్ను అవమానించిన యామెభాగ్యము తీసివేయవలసినదని పరమేశ్వరుని ప్రార్థించెను. పరమేశ్వరుడు వినాయకుని పంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ ఐదుమాని కెలబియ్యము ఉండ్రాళ్ళు వండి సోలెడుగిద్దెడు నెయ్యిపోసి చల్దియుంచక పుల్దియుంచక చాకికి పెట్టక వేకికి పెట్టక వినాయకునికి నైవేద్యము పెట్టెను. అతడవితిని భాగ్యము తీసివేయుట నాతరముకాదని ఇంకనుభాగ్యము నిచ్చిచక్కబోయెను. అప్పుడు తిరిగి నందినిపంపగా, అతడు వెళ్ళేసరికి యాబ్రా

హ్మణస్త్రీ అయిదుమానికెల సెనగలు నీళ్ళలో పోసి నైవేద్యము పెట్టెను. ఆసెనగలుతిన్ని యాతడు భాగ్యము తీయుట నాతరము కాదని యింకను భాగ్యము నిచ్చివెళ్ళెను. అప్పుడు పార్వతి హరుని పంపగా యాతని నాబ్రాహ్మణస్త్రీ చూచి అయిదుమానికెల బియ్యము అట్లు వండి సోలెడుగిద్దెడు నేయిపోసి బెల్లముపెట్టి యాతనికి నైవేద్యము పెట్టెను. ఆతడవితిని భాగ్యముతీసివేయుట నాతరముకాదని యింకను భాగ్యమునిచ్చి చక్కవచ్చెను. తిరిగి అర్జునుని పంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెలబియ్యము అప్పాలవండి నైవేద్యముపెట్టగా నాతడవితిని మరింతభాగ్యమిచ్చివెళ్ళెను. అప్పుడు శివుని పంపగా నాతనినిచూచి యా బ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల నువ్వుపప్పు చిమ్మిలి త్రొక్కి నైవేద్యముపెట్టెను. ఆతడదితిని మరింతభాగ్యమునిచ్చి చక్కపోయెను. తరువాత కాలభైరవుని పంపగా నాతని చూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల మినపపప్పు గారెలువండి నైవేద్యముపెట్టెను. అతడవితిని యామెభాగ్యముతీయుట నావల్ల కాదని వెళ్ళిపోయెను. పిమ్మట చంద్రుని పంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల బియ్యము చలిమిడిచేసి నైవేద్యము పెట్టెను. అతడదితిని యీమెభాగ్యము చెరుప నాతరముకాదని మరింతభాగ్యమిచ్చి వెళ్ళెను. తరువాత సూర్యుని పంపగా నాతనిచూచి యాస్త్రీ అయిదు మానికెలబియ్యము పరమాన్నమువండి నైవేద్యము పెట్టెను. ఆతడదియారగించి యామె కింకను భాగ్యమిచ్చి చక్కపోయెను. తరువాత నెవ్వరిని వెళ్ళుమన్న "మావల్లకాదు నీవేవెళ్ళు" మనిరి. అప్పుడు పార్వతీదేవి స్వయముగ బయలుదేరి వెళ్ళగా నామెనుచూచి యాబ్రాహ్మణస్త్రీ మిక్కిలి భక్తిశ్రద్ధలతో అయిదుమానికెలబియ్యము పులగమువండి నేయి బెల్లముతో నైవేద్యముపెట్టెను. ఆమె అది తిని కోపముపోయినదై అమ్మా! మొదట నీమీద నాకుకోపమువచ్చి

నీభాగ్యము తీసివేయుట కందరిని పంపినాను. వారందరికి అన్నిచేసి పెట్టినావు. అందుచేత నీభాగ్యము మరింత వృద్ధి అయినది. అందుచేత నాకుకూడ సంతోషమువచ్చినది. ఈనోముపట్టి కథచెప్పి అక్షతలు వేసుకొని ఈతొమ్మిది దినుసులు మిగలకుండాచేసి ఉద్యాపన చేసుకొన్నయెడల సకలభాగ్యములు కలుగునని పార్వతీదేవి యదృశ్యయయ్యెను.

ఉద్యాపనము:—అయిదుమానికెల పెసరపప్పు బిందెతో అత్తెసరుపెట్టి అయిదుమూళ్ళ అంగవస్త్రము చుట్టపెట్టి బంగారపు నందిని చేయించి అయిదుడబ్బులు దక్షిణతాంబూలముతో పడకవేళ నంది మోహంపు పెండ్లికొడుకునకు అందియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

ఇది ప్రథమభాగము.



శ్రీరామచంద్ర.

# స్త్రీల వ్రత కథలు.

## ద్వితీయ భాగము.

### 1. గాజుల గౌరిదేవికథ.

ఒక బ్రాహ్మణుని కోడలు గాజులగౌరిదేవి నోముపట్టి ఉల్లంఘనముచేసెను. అందుచేత ఆమెనుచూచి అంతా చిట చిట లాడుచుండే వారు. ఇరుగుచిటచిట పొరుగుచిటచిట అత్తా చిటచిట మామచిటచిట మగడుచిటచిట ఎవరుచూస్తేవారే ఇలాగున్నారని యీచిన్నది విచారించుచు, అడవిలోనికిపోయి తిరుగుచుండెను. అంతట పార్వతీపరమేశ్వరులు భూమిపాలించుటకువచ్చి, ఆచిన్నదానినిచూచి ఏమి ? ఆలాగువిచారించుచు తిరుగుచున్నావని యడిగిరి. అందుకామె ఇరుగుపొరుగు అత్తామామ మగడు నన్నుచూస్తే కోపంగా ఉంటారు. అందుచేత నందరికి కోపమైతే ఎట్లుబ్రతుకనని ఇలా తిరుగుచున్నానని చెప్పెను. ఆలాగుకాదమ్మా ! నీవుగాజులగౌరిదేవినోముపట్టి ఉల్లంఘనచేసినావు. ఆకారణమున నిన్నుచూచిన అందరికి కోపముగానున్నది. నీవు తిరుగ ఆనోముపట్టి ఉద్యాపనముచేసుకుంటే నిన్ను అంతా ప్రేమతోచూస్తారుఅని పార్వతీదేవి చెప్పెను. ఆప్రకారము ఆమె యింటికివెళ్ళి ఆనోము నోచుకొని యథావిధిగ ఉద్యాపనముచేసుకోగా అప్పటినుండి ఆమె అందరికి ఇష్టముకలదయ్యెను.

దీనికి ఉద్యాపనము:—ఒక ముత్తయిదువును తీసుకొనివచ్చి ఆమెకు ఇష్టమైన గాజులు తొడిగించి, తలంటి, నీళ్ళుపోసి, చీర రవికల

గుడ్డ ఇచ్చి పిండివంటలతో భోజనముపెట్టవలెను. భక్తితప్పినా ఫలముతప్పదు. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు.

## 2. గ్రిహాణగౌరికథ.

ఒకబ్రాహ్మణునకు నలుగురుకొడుకులును, ఒకకూతురును కలరు. ఆకూతురుపుట్టినరోజు మొదలుచేసుకొని రాత్రిపురుగులుగాను పగలు మనిషిగా అగుచుండేది. రాత్రివేళ తల్లి ఆపురుగులను పోగుచేసుకొని విచారించుచుండేది. ఆలాగున నుండగా కొన్నాళ్లకు ఆపిల్లతల్లిని పుట్టింటికి తీసుకొనివెళ్ళునిమిత్తమై అన్నగారువచ్చి, అమ్మాయి! పిల్లకు ఏడాదివెళ్ళినది, గనుక ఒకసారి పుట్టింటికిరమ్మని పిలచెను. ఆమె యిప్పుడు కాదు ముందువస్తాను అని చెప్పెను. ఆమాటలు విని ఆతడు వెళ్ళిపోయెను. తరువాత నాలుగేండ్లుఅయిన పిమ్మట మరల అన్నవచ్చి అమ్మాయీ రమ్మనుమని పిలువగా ఇప్పుడుకాదు వస్తానులే! అని జవాబుచెప్పెను. ఆమాటలకు సరేఅని ఆతడు వెళ్ళిపోయెను. ఈపిల్ల పెద్దదైనకొలది పురుగులు ఎక్కువగా జొచ్చెను. ఆ పురుగులను రాత్రి తల్లిజాగ్రితగా కాపాడుచుండెను. అంతట ఆపిల్లకు పదిసంవత్సరములు యీడువచ్చెను. అప్పుడు తిరుగా అన్నగారువచ్చి, ఇప్పుడైనా నీవువచ్చినగాని లేనియెడల నీకు మేములేము మాకు నీవు లేవు. అని గట్టిపట్టుచేయగా ఆమె మరోమాటచెప్పలేక కోడండ్రవద్దకువెళ్ళి నాలుగురోజులు పిల్లనుచూచుచుండెదరా? అని యడిగినదట. వారు మావల్లకాదనిరి. అప్పుడు నాలుగోకోడలు నేనుచూచెదను మీరువెళ్లిరండని చెప్పెను. ఆబ్రాహ్మణునిభార్య నాలుగోకోడలిని తలుపుచాటునకు తీసుకొనిపోయి పగలస్తమానము పిల్ల, రాత్రి పురుగులును, రాత్రిమాత్రము ఆపురుగులు చెదరకుండా క్రింద గుంటతీసి దీపముపెట్టుకొనినది మొదలు జాగ్రితగా గుంటలోకి పోగుచేసుకొని

ఒక్కపురుగైనా పోకుండా చూడవలయునమ్మా! అని చెప్పి కూతురు నామె కొప్పగించి పుట్టింటికి వెళ్లెను. అంత దీపాలుపెట్టేసరికి వంటచేసి మామగారికి భర్తకు భోజనముపెట్టి ఆపిల్లను గుంటవద్దచాపవేసి పరుండబెట్టి నాలుగవకోడలాపిల్లవద్ద పరుండెను. తరువాత ఆపిల్ల పురుగుల గుచుండగా వాటినన్నిటిని గుంటలోనికిత్రోసి తెల్లవారినదాక చూచు చుండెను. అంతట ఆమెభర్త, ఇది నాయొద్దకు రావడములేదు. ఎక్కడికో పోవుచున్నది. అని అనుమానపడి మూడురోజులైనతరువాత నాలుగోరోజున దీపాలు పెట్టగానే భోజనముచేసి ఆచిన్నది పడుకొనే గదిగోడమీద కూర్చుండెను. అంతట ఆమెభోజనముచేసి మామూలు ప్రకారము ఆపిల్లను కనిపెట్టుకొని కూర్చుండెను. ఆరాత్రిచర్య అంతయు గోడమీదనుండి యాబ్రాహ్మణచిన్నవాడు చూచి తెల్లవారిన తరువాత దిగివచ్చి అయ్యో! నాచెల్లెలు ఇంతకష్టపడుచున్నది, ఇది యేమి? అని భార్యనడిగి నాలుగురోజులనుంచి యేమిచేస్తూన్నావు? నాకు కనపడడంలేదేమి? అని కోపపడెను. ఈలాంటిపని మీఅమ్మ నాకు వప్పచెప్పింది అందుచేత కనిపెట్టుకొని యుండవలసి వచ్చినది అని యామె చెప్పగా, ఈదురవస్థ యీామెకు ఎందుచేతవచ్చెనో అని విచారమునుపొంది అడవిలోనికి పోయి ఆకుమీాద ఆకు పోకమీాద. పోక వేసుకొని తలక్రిందు మీాదకాళ్ళు పెట్టుకొని తపస్సుచేయ మొదలుపెట్టెను. అంతట అక్కడకి పార్వతీపరమేశ్వరులు భూమిపాలించు నిమిత్తమైవచ్చి యా సమీాపమున మనిషిసంచారము కలిగియున్నట్లు కనపడుచున్నది, చూడవలెనని పార్వతీదేవి ఈశ్వరుని అడిగెను. ఆడ వాళ్లతో ఇదేచిక్కు వద్దువెళ్లవద్దుఅని ఈశ్వరుడు చెప్పగా ఆలాకాదు, చూడవలయును అని పార్వతీదేవి భర్తను తీసుకొనివెళ్ళి తపస్సుచేయు చున్న యాబ్రాహ్మణచిన్నవానినిచూచెను. అట్లు చూచి ఏమి అబ్బాయీ! యీాలా తపస్సుచేయుచున్నావు? అని యడిగెను. అందుకా

బ్రాహ్మణచిన్నవాఁడు "మీరేమి ఆర్చేవారా ? తీర్చేవారా ? మీ కెందుకు ? వెళ్ళవలసిన"దని జవాబుచెప్పగా "ఆలాకాదునాయనా ! ఆర్చెడివారము మేమే, తీర్చెడివారము మేమే, చెప్పవలసిన"దని పార్వతీ పరమేశ్వరులు అడిగిరి. మాచెల్లెలు పుట్టింది మొదలు పగలు మనిషి రాత్రి పురుగులుగాను అగుచున్నది. అది యెందుచేతనో తెలుసుకొనగోరి యిట్లు తపస్సుచేయుచున్నానని యాబ్రాహ్మణచిన్నవాడు చెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు దివ్యదృష్టినిచూచి మీచెల్లెలు క్రిందటి జన్మమున రజస్వలై ఇంటిలోకలిపింది. ఆదోషముచేత యీలా వచ్చినది. కాబట్టి ఆమెచే గృహణగారినోముపట్టించి క్రమప్రకారము ఉద్యాపనముచేయించినయెడల ఆదోషముపోవునని చెప్పి యదృశ్యులైరి అప్పుడా బ్రాహ్మణచిన్నవాడింటికివచ్చి పార్వతీపరమేశ్వరులుచెప్పిన గృహణగారినోము చెల్లెలిచేత పట్టించి ఉద్యాపనముచేయించెను. అంతట ఆపాపముపోయి ఆపిల్ల రాత్రి, పగలు ఎప్పటిలాగుండెను. తరువాత తల్లివచ్చి పిల్ల రత్నములాగున ఉండుటచూచి మునుపటి చిహ్నములేమి లేకపోవుటకు సంతోషించుచు "ఏమిటి ? అమ్మాయీ ! ఏలా పోయిం దాపురుగులప్పుట ?" యని కోడలిని యడిగెను. అప్పుడు చిన్నకోడలు, అత్తగారువెళ్ళినదిమొదలు భర్త తనమీద యనుమానముపడుట, యడవికివెళ్ళుట, గృహణగారినోము పట్టించుట మొదలగు సంగతులన్ని పూసగ్రుచ్చినట్లుచెప్పి ఇది గృహణగారినోము పట్టుటచేత పోయినదనిచెప్పి, ఇదుగో ! మీ అమ్మాయి ! యని ఆపిల్లను అత్తగారి కప్పగించెను.

దీనికి ఉద్యాపనము :—సూర్యగ్రహణము పట్టీపట్టె ననగా పసపు, కుంకుమ, పిండి, బియ్యము, ప్రత్తి, బెల్లము, ఆకు, పోక దక్షిణ లతో పందిటిలోపెట్టి, విడిచీవిడిచెననగా ఇంటిలోపెట్టి, సూర్యగ్రహణమునాఁడు కథచెప్పి అక్షతలువేసుకొని, తొమ్మిదిరోజులు తొమ్మిదిపద్మము

లు, తొమ్మిదివత్తులదీపము, తొమ్మిదిఅట్లవాయనము, తొమ్మిదిఅట్ల నైవేద్యము కొత్తజల్లిడిలోపెట్టి, పాతజల్లిడి మూతవేసి, చీర, రవికలగుడ్డపెట్టి ఒకముత్తయిదువకు వాయన మీయవలెను.

---

### 3. పోలి స్వర్గమునకు వెళ్లుకథ.

అనగనగా ఒకచాకలిది. దానికి నలుగురుకొడుకులు నలుగురు కోడళ్ళుకలరు. ఆచాకలిది ముగ్గురుకోడండ్రు, తానుప్రతిరోజు కార్తిక మాసములో అశ్వయుజబహుళ అమావాస్యమొదలు ఉదయముకాకుండా స్నానముచేసుకొని, దీపముపెట్టి నెలరోజులాతీరుగా జరిపెను. తరువాత కార్తీకబహుళ అమావాస్యనాడు తెల్లవారుజామునలేచి కడసారపుకోడలితో మేముస్నానమునకు వెళ్లుచున్నాము. మేమువచ్చేవరకు ఇంటివద్ద జాగ్రితగానుండవలసినద్నిచెప్పి చాకలిది, ముగ్గురుకోడండ్రు స్నానమునకు వెళ్ళిరి. అప్పుడుచిన్నకోడలు లేచి చల్లచేసిన కవ్వమును అంటియున్న వెన్న ఊడ్చుకొని ప్రత్తిచెట్టుక్రింద పడియున్న ఒక ప్రత్తికాడ తెచ్చుకొని నూతివద్ద స్నానముచేసి దీపమువెలిగించుకొని అత్తగారు రాకుండా ఆదీపముమీద చాకలిబాన మూతవేసెను. అప్పుడు దానికి ఆకాశమునుండి విమానమువచ్చెను. అదిఆవిమానమునెక్కి బొందెతోకూడా స్వర్గమునకు చక్కావెళ్లుచుండెను. ఈవెళ్లడము ఏటియొడ్డున దీపములు పెట్టుకొనుచున్న వాళ్లందరు చూచి "చాకలిపోలి స్వర్గమునకువెళ్ళుచున్నది, చాకలిపోలి స్వర్గమునకు వెళ్ళుచున్నది" అని అందరు ఆశ్చర్యపడసాగిరి. అంత "మాకోడలేమిటి? స్వర్గమునకు వెళ్లడమేమిటి" అని చాకలిది, దానిముగ్గురుకోడండ్రును ఆశ్చర్యముతో చూచిరి. ఆలాచూచి ఆవిమానముమీదనుండి వేళ్లేదానికాళ్ళు నలుగురు పట్టుకొనిరి. అప్పుడు విష్ణుమూర్తివచ్చి, ఈకోడలినివదలిపెట్టి వాళ్ళను ముగ్గురును పెట్టుకొని అశ్రద్ధగా భక్తిలేకుండా దీపాలు పెట్టుకున్నావు.

ఇది శ్రద్ధాభక్తులతో పెట్టుకుంది. కాబట్టి దీనికిబొందితో స్వర్గమునిచ్చి నాను. నీవు అడవులపాలై పోవలసినదని శాపము పెట్టి చక్కా-పోయెను. ఈకథ చెప్పి అక్షంతలు వేసుకోవలయును.

దీనికి ఉద్యాపనము లేదు.

---

## 4. పోలాల అమావాస్య కథ.

ఒక బ్రాహ్మణునకు ఏడుగురు కొడుకులు ఏడుగురు కోడండ్రు కలరు. ఏడుగురు కోడండ్రు పోలాలఅమావాస్య నోమునోచుకొందా మని యత్నముచేసుకొనిరి. అంతట కడసారపు కోడలికి అమావాస్య రోజున ఒకపిల్ల చచ్చిపోయెను. ఆకారణముచేత ఆయేటికి ఆనోము అంతా మానివేసిరి. అదిమొదలు ప్రతిసంవత్సరము వీళ్లంతా నోము నోచుకుందామని యత్నము చేయుచుండుటయు అమావాస్య వచ్చే సరికి కడసారపు కోడలికి పుట్టినపిల్ల చచ్చిపోవుచుండుటయు తటస్థించు చుండుటచేత వాళ్ల కానోము పట్టుటకే వీలులేకపోవుచుండెను. ఇట్లు యేడేళ్ళు అయినతరువాత, ఏడేట యీకడసారపుదానికి పుట్ట, చావ అని తిట్టుకొంటూ కోడండ్రంతా మళ్లీ యత్నముచేసుకొనిరి. అమా వాస్య వచ్చేసరికి సరిగా కడసారపు కోడలకి ఒకపిల్ల మళ్లీ చచ్చిపోయె ను. అంతా తిట్టిపోతారని చెప్పి చచ్చిపోయిన పిల్లను ఇంటిలో పెట్టి తాళము వేసుకొని కడసారపుకోడలు అందరి తోడికోడండ్రి యింటికి వెళ్ళెను. అందరికి తలాయొకపని సాయముచేసెను. తరువాత ఒకరి యింటిలో తలంటి నీళ్ళుపోసుకొని మరియొకరియింటిలో పిండి, పప్పు మొదలయినవి తెచ్చుకొని యింటికివచ్చి చచ్చినపిల్లను యింట్లో పెట్టు కునే తానుకూడా నోమునోచుకొనెను. ఆరాత్రిదాకాఉండి చీకటిలో చచ్చినపిల్లను బుజముమీద వేసుకుని పోలేరమ్మ గుడివద్దకువెళ్లి ఆపిల్లను అక్కడపెట్టి ఏడ్చుచుండెను. ఇంతలో అమ్మవారు గ్రామసం

చారమువెళ్లి గుడివద్దకువచ్చి యేడ్చుచున్న యాచిన్నదానినిచూచి "ఏమమ్మా! ఇలాయేడ్చుచున్నా"వని యడిగెను. అందుకాచిన్నది "ఏడేండ్లనుండి యేడుగురుపిల్లలను ఈయమ్మవారికి అప్పగించుచున్నాను. ఈ యేడుకూడా యీపిల్ల చచ్చిపోయింది. తోడికోడండ్రు తిట్టిపోతారని ప్రొద్దుటినుండి దాచి ఇప్పుడుతీసుకొని వచ్చి యిక్కడపడవేసి యేడ్చుచున్నా"నని చెప్పెను. అప్పుడు అమ్మవారు కరుణించి నీపిల్లలకు మరేమీ భయములేదు. నేను తీసికొనివచ్చి యిస్తానని చెప్పి అక్షతలు ఆచిన్నదాని చేతిలోపోసి "నీవు నీపిల్లలనుపాతిపెట్టినచోటికివెళ్ళి పిలు వు"మని చెప్పెను. ఆమె ఆప్రకారము అవిపుచ్చుకొని ఆ అక్షతలుచల్లి "అందెలాడ! రారా! మువ్వలాడ! రారా!" అనివరుసగాఏడుగురుని పిలువగా అందరువరుసగాలేచి చక్కావచ్చిరి. ఆమె సంతోషముతో ఆపిల్లలను తీసుకొని యింటికివెళ్లెను. తెల్లవారినతరువాత అందరుచూచి అయ్యో! ఇదేమిటమ్మా! ఈపిల్లలెక్కడనుండి వచ్చినారనియడిగిరి. ఆచిన్నది వారందరితోను తాను రాత్రిచేసినపనులు చెప్పి పోలేరమ్మ దయవలన వీరుబ్రతికివచ్చినారనిచెప్పెను. అంతటినుంచి ప్రతిసంవత్సరము ఈ యమావాస్యకు తప్పక నోము నోచుకొని అందరు యీకథ చెప్పి అక్షతలు వేసుకొనుచుండిరి. అందుకా అమ్మవారు సంతోషించి సంతానము లేనివారికి సంతానమిచ్చి సంతానముకలవారికి కడుపుచలువయిచ్చి రక్షించెను.

దీనికి ఉద్యాపనము లేదు.

---

## 5. కరుళ్ళ గౌరిదేవి కథ.

ఒకబ్రాహ్మణునకు అయిదుగురు కొడుకులు కలరు. ఆ అయిదుగురుకొడుకులకు పెండ్లి అయి అయిదుగురు కోడండ్రు కాపురమునకు వచ్చిరి. అందులోఅయిదవకోడలుకరుళ్ల గౌరిదేవి నోముపట్టినది. అంతా

కూడావేసి వెయ్యకుండాభాగ్యముతోనుండిరి. ఆలాఉండిఅత్తసామ్మొద్దు, మామసామ్మొద్దు, పుత్రిసామ్మొద్దు, పురుషసామ్మొద్దు, నాసామ్మేనాకిమ్మని సూర్యదేవుని ప్రార్థించి, ఆమెరోజూ నమస్కారములు చేసేది. అట్లు నమస్కారములుచేసిన కొంతకాలమునకు అత్తగారికి, మామగారికి, బావగారికి, మరుదులకు, భర్తకు ఎల్లవారికి ఆమెమీద కోపంగావుం డేది. ఆమె ఒకరోజున పడుకొని నిద్రపోవుచుండగా మంచముతో పాటు తీసుకొనిపోయి, మహారణ్యములో పారవేసిరి. అమె కొంతసేప టికి నిద్రమేలుకొని ఆయడవిలోనె నీళ్ళుపోసుకొని సూర్యభగవాను లకు నమస్కారముచేయుచుండగా ఆమెదోసిటిలోనికి నిండుగా వరహా లువచ్చెను. ఆమె యవితీసుకొని సమీప పల్లెకేగి, పసపు, కుంకుమ, గిన్నె, ఉప్పు, మిరపకాయలు, బియ్యము మొదలగు యావత్తుసామ గ్రికొని ఒక గొల్లముసలివాని సహాయమున నొక గుడిసెలో నివసించి యుండెను. ఇంటివద్దనున్న వాళ్ళకందరికి అష్టదరిద్రముపట్టుకొని, నానా స్థలములు తిరుగుచు తినుటకు తిండి కట్ట గుడ్డ లేక బాధపడుచు ఒక రోజున కట్టెపుల్లలనిమిత్తము ఈయడవిలోనికివచ్చిరి. అట్లువచ్చి తమకు సమీపములో నొకచోట సూర్యనమస్కారములుచేయుచున్న యీ చిన్నదానినిచూచి తక్కినకోడండ్రింతా ఇదిగో! మాతోటికోడలు ఈలాగే సూర్యనమస్కారములు చేయుచుండేది అని తమవారితో చెప్పసాగిరి. సూర్యప్రభావమువల్ల అడవిలోనున్న చిన్నది డబ్బుకలదై మేడలు, మిద్దెలు, తోటలు, దొడ్లు కట్టించి అరిదేశిపరదేశివస్తే అడ్డము లేకుండా అన్నము పెట్టుచుండేది. ఆ సమయమునందు ఆమె అత్తా మామా అక్కడకువచ్చి మాకింత అన్నము పెట్టించెదవా? యని యడిగిరి. అప్పుడు అత్త మామ యని ఆమె గ్రహించి మామామ గారు అత్తగారు మీలాగే ఉండేవారు. మీదేవ్వూరు? మీరెవ? రని అడిగెను. అందుకు వారు మేము ఫలానా అని చెప్పిరి. అంతలో పెని

మిటివచ్చెను. వారి ముగ్గురికి ఆమె తలంటి నీళ్ళుపోయించి వారికి సక లోపచారములుచేయుచు పదమూడుకరుళ్ళు కంచములోపెట్టి క్రొత్త కంచములుకొని చీర,ఒకరవికలగుడ్డ,కరుళ్ళుపెట్టుకొని ఉద్యాపనముచేసు కొనెను. ఏడాది అయినతరువాత చీర, రవిక, పదమూడు కరుళ్ళు, క్రొత్తకంచములోపెట్టి ఉద్యాపనముచేసుకోవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

---

## 6. నిత్యశృంగారము కథ.

రాజుభార్య, మంత్రిభార్య, నిత్యశృంగారము నోముపట్టిరి. రాజుభార్య నౌఖరులచేత తాంబూలముబొట్టు పెట్టించుచుండెను. మంత్రిభార్య యట్లుగాక తానే స్వయముగా బొట్టుపెట్టి తాంబూల ము నిచ్చుచుండేది. ఈలాగున నివ్వగా నీమెకు కడుభాగ్యమబ్బినది. రాజుభార్యకు అశ్రద్ధగా నివ్వడముచేత దరిద్రము సంభవించెను. అందు వలన నామె యొకనాడు మిక్కిలి దుఃఖించుచు కూర్చుండెను. ఇట్లుం డగా పార్వతీపరమేశ్వరులు ఆమెకు ప్రత్యక్షమయి యెందు కేడ్చుచు న్నావమ్మా! అని యడిగిరి. ఆర్చెడువారా, తీర్చెడువారా మీకెం దుకు? వెళ్ళండి యని యామె వారితో ననెను. అంతట వారు ఆలా గుకాదు, ఆర్చెడువారము మేమే, తీర్చెడివారము మేమే, దుఃఖకారణ మేమో చెప్పవలసినది అని యడిగినారు. మంత్రిభార్యయు, నేను నోముపట్టినాము. ఆమెకుభాగ్యమువచ్చినది. నాకు దరిద్రమువచ్చి నది. ఎందుచేత నాకీదరిద్రమువచ్చినదో తెలియక దుఃఖించుచున్నా ను. యని యామె చెప్పెను. నీవు దాసీజనంబుచే వ్రతకృత్యములు జరిపించినావు. అందుచేత నీకీలాగున దరిద్రమువచ్చినది. మంత్రిభార్య శ్రద్ధగా తానేస్వయముగాచేయుటచేత నామెకు భాగ్యములభించెను. నీవు తిరిగి యీనోముపట్టి కథచెప్పుకొని, అక్షతలువేసుకొని ఏడాదిశ్రి

ద్దగా తాంబూలమిచ్చుకొంటే సిరి, సంపద నీకు వచ్చునని చెప్పి ఆపు రాణదంపతు లదృశ్యులైరి. అప్పు డీనోముపట్టి ఏడాది కథ చెప్పుకొని యక్షతలువేసికొనిరోజును ఒకముత్తయిదువునకుబొట్టుపెట్టి తాంబూల మిచ్చి, అద్దము దువ్వెన చూపించి, ఏడాది యయినతరువాత నామె యుద్యాపనము చేసికొని సిరిసంపదలను బడసెను.

ఉద్యాపనము:—ఒకముత్తయిదువునకు తలంటి నీళ్ళుపోసి చీర, రవిక యిచ్చి భోజనముపెట్టి. బొట్టుపెట్టి. అద్దము, దువ్వెన, కాటుక కాయ, కుంకుమబరిణి, నవరము, గంధపుచెక్క యిచ్చి ఉద్యాపనము చేసికొనవలెను.

## 7. ఉదయకుంకుమనోము కథ.

ఉదయకుంకుమ నోముపట్టిన ఉవిదయున్న పట్టణమున వెదకి నను వెధవలేదు.

ఉద్యాపనము:—ఒక ముత్తయిదువునకు తెల్లవారకుండా తల యంటి నీళ్ళుపోసి తానును తలయంటుకొని నీళ్లుపోసుకొని చీర, రవి కలగుడ్డయు ఆముత్తయిదువున కిచ్చి పిండివంటతో భోజనముపెట్టి కుం కుమభరణి, దక్షిణ, తాంబూలము లొసంగి యుద్యాపన చేసికొన వలెను.

---

## 8. కుంకుమగౌరి నోముకథ.

సోమయాజులుగారికూతురు కుంకుమగౌరి నోముపట్టి ఉల్లంఘన చేసినది. అందువలన చిన్నతనములోనే విధవరికము వచ్చినది. తలిదం డ్రులు ఈచిన్నదానినితీసికొని కాశీపట్టణమునకు వెళ్ళిరి. అక్కడికివెళ్ళి నను ఆచిన్నదాని వెధవరికముపోలేదు. ఒకనాడాచిన్నదానితండ్రిగంగ యొడ్డునగూర్చుని తపస్సుగావించుచుండ ఈశ్వరుడాయనకు ప్రత్యక్షమై

"యేమి? బ్రాహ్మణుడా! ఇట్లుకూర్చుని యున్నావు?" అని యడిగెను. అప్పుడా బ్రాహ్మణుడు "నాకు లేక లేక యొక కూతురు కలిగెను. ఆ చిన్నదానికి వివాహము కావించితిని. వివాహమయిన నెల రోజులకు ఆమెకు విధవరికము సంభవించినది. ఆకష్టమునుసహింపనోపక కుటుంబసహితముగా నీపట్టణము వచ్చినాను" అనిచెప్పినాడు. "అయ్యో! నీకూతురు క్రిందటిజన్మమున కుంకుమగౌరినోముపట్టి ఉల్లంఘన చేసినందున బాల్యదశయందేవిధవరికము సంభవించినది" అని పరమేశ్వరుడు దయారసంబు తన మోమున తొలుకాడుచుండ బలికెను. అప్పుడా బ్రాహ్మణుండయ్యా! ఇప్పుడేమియొనర్చిన నీకష్టము తొలగునో యాన తీయవలయునని యాపరమేశ్వరుని ప్రార్థించెను. ఇప్పుడు తిరిగి యీ నోముపట్టి యుద్యాపనము చేసినచో యీకష్టముపోవునని యా ఈశ్వరుడానతిచ్చి యదృశ్యుడయ్యెను. అప్పు డాప్రకార మా చిన్నదానిచే నోముపట్టించి యుద్యాపనము చేయించెను.

ఉద్యాపనము:—పదిముగ్గురు ముత్తయిదువులకు బరణి నిండుగ కుంకుమపోసి నల్లపూసలు లక్కజోడుపెట్టి దక్షిణ తాంబూలము యిచ్చి పదిముగ్గురు ముత్తయిదులకు పదిమూడు భరిణలు యివ్వవలెను.

---

## 9. చిక్కుడుగౌరి.

చిక్కి చిక్కనను చిక్కుడుగౌరినోము పట్టి మాఘ పూర్ణిమ ముందరవచ్చెడు రథసప్తమినాడుకథచెప్పి యక్షతలు వేసుకొని ఎత్తుకున్న బిడ్డలెడబాయకుండ, చంకబిడ్డ సడలకుండ పక్కలోబిడ్డ బాయకుండ కంటికాటుక కదలకుండా, చేతిగాజు చెదరకుండ, కాలిమట్టెకదలకుండా కట్టినబట్ట విడువకుండా తొడగిసరవిక తొలగకుండావంటిసొమ్ము వదలకుండా వెంటపురుషుడు ఎడబాయకుండా ఉండవలెనమ్మా! వెం

డిచిక్కుళ్ళు పయిడిచిక్కుళ్లునేపంచిపెట్టెదను. చిక్కుళ్ళ గౌరిదేవితల్లీ! చింతలేకుండ సిరిసంపదనిమ్ము అని కథచెప్పి యక్షతలు వేసుకొనెను.

ఉద్యాపనము:—ఒకబంగారపు చిక్కుడుపూవుచేయించి చీర రవికెలగుడ్డయిచ్చి దక్షిణతాంబూలమించి ఒక ముత్తయిదువునకు పిండివంటతో భోజనముపెట్టి పయినచెప్పిన బంగారపు చిక్కుడుపూవు చీర రవికెలగుడ్డ దక్షిణతాంబూలములతో వాయనమివ్వవలెను.

---

## 10 తవుడుగౌరి

తవుడుగౌరి పట్టినసఖియకు తల్లి, తండ్రి, అత్త, మామ యేవేళ నెడబాయకుండా నుండెడివారు. తల్లి, తండ్రి, అత్త, మామ కూడా యెడబాయకుండా ఉన్నారు నీకు. ఏమినోము పట్టినావమ్మా! అని అందరు అడిగినారు. ఏమీలేదమ్మా! క్రిందటి జన్మమున మా యమ్మ తవుడుగౌరినోముపట్టి ఉద్యాపనముచేసికొన్నది. అందుకున్న ఫలమే గాని పట్టినఫలంగాదు. అనిచెప్పెను. అందుకుంటేనే ఇంత ఫలము గలిగెను. పట్టినట్టయిన నెంతఫలము వచ్చునో అని కలియుగమంతా తవుడుగౌరినోముపట్టి ఉద్యాపనము చేసికొన్నారు.

ఉద్యాపనము:—తవ్వనిండా బియ్యంపోసి పయిన తవుడుపోసి శక్తియుంటే చీరనుంచి లేకపోయిన రవికెలగుడ్డ దక్షిణ తాంబూలముంచి యుద్యాపనముచేసుకోవలెను.

---

## 11. శాకదానముకథ.

రాజుభార్యయు, మంత్రిభార్యయు శాకదానము నోముపట్టిరి రాజుభార్య యన్ని ఒక్కమారే ఇచ్చెదనని ఊరకొన్నదట. మంత్రి భార్య తోటకూరమడివేసి రోజూ ఒకబ్రాహ్మణునకు ఒకడబ్బు ఒకకట్ట తోటకూర ఇచ్చుచుండెను. ఈప్రకారము ఏడాదియిచ్చెను. ఇట్లు

యిచ్చుటవల్ల కడఃపుశోకములేకుండ సిరిసంపదలతో మంత్రిభార్య సుఖముగానుండెను రాజుభార్యకు ఎప్పుడో చేయుదునని యూర కున్నందునవలన శోకము ఎక్కువయయినదట. ఆశోకము భరించలేక యడవిలోనికిపోయి ఒకచోట ఏడ్చుచు కూర్చుండియుండగా పార్వతి పరమేశ్వరులు భూమిపాలించునిమిత్తమై వచ్చి ఏమి! అమ్మా యీలా గేడ్చెదవని యడిగిరి. ఏమీలేదు. యన్నమూసము నాకు ఏమవవలె నని బుద్ధి. అందుచేత యీలా యే డ్చుచున్నాను. యని చెప్పెను. యందుకువారు, అలా కాదమ్మా! నీవు శాకదానము నోముపట్టి తిన్నగా ఇచ్చినావుకావు. అందు చేత నీకు శోకమువచ్చినది. ఇప్పుడు మళ్ళీ ఇంటికివెళ్ళి ఈనోముపట్టి మరచిపోకుండా నిత్యమును ఒక కూర బ్రాహ్మణునకు తప్పకుండా దానమిచ్చినయెడల ఈశోకము పోవునని చెప్పి యదృశ్యులైరి. అప్పుడామె యింటికివచ్చి నిత్యమూ ఒకడబ్బు, ఒకకూర ఒకబ్రాహ్మణునకు దానమిచ్చుచుండెను. యది లగాయతు ఆమె శోకము పోయి సిరిసంపదకలిగి సుఖముగానుండెను. అప్పుడం తా "ఏమినోముపట్టినావు? ఏమినోముపట్టినావు? శోకముపోవుటకు?" యని యడుగగా ఆమె శాకదానమునోము పట్టినానని చెప్పెను. అప్పు డంతా ఆనోముపట్టి ఉద్యాపనముచేసుకొనిరి.

ఉద్యాపనము:—తోటకూరమడి చల్లి బ్రాహ్మణునికి తలంటి పోసి జామారుయిచ్చి పదమూడు మానికల బియ్యము పదమూడు తాంబూలములు పదమూడుడబ్బుల దక్షిణమిచ్చి తోటకూర ఆ బ్రా హ్మణునకు వాయనము ఇయ్యవలయును. కథలోపమయినను వ్రత లోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

---

## 12. చద్దికూటి మంగళవారముల కథ

ఒక రాజుకూతురు బ్రాహ్మణునికూతురు చద్దికూటి మంగళవారముల నోముపట్టిరి. బ్రాహ్మణునికూతురు వారంవారం ముత్తయిదువను పెట్టుకొని తొలినాడు అస్తమానమువేళ కూర, పప్పు, చారు, అన్నము వండి మూతపెట్టుకొని ప్రొద్దున్నే వంటిమీద నీళ్లు పోసుకొని కథచెప్పి అక్షతలు వేసుకొని ముత్తయిదువకు పెట్టి తాను తిని ముత్తయిదువకు దక్షిణ తాంబూలము ఇచ్చెను. ఆలా ఏడాది అయినతరువాత పదముగ్గురు పేరంటాండ్రకు యథావిధిగ దక్షిణతాంబూలములిచ్చి ఉద్యాపనముచేసుకొనెను. రాజుకూతురికి దరిద్రమువచ్చెను. ఆమెదరిద్రమును భరింపజాలక అడవికి వెళ్ళి తిరుగుచుండగా పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమయి ఏమమ్మా? ఈలావచ్చినావు? అనిఅడిగిరి. తినుటకు అన్నము, కట్టుటకు బట్ట లేక దరిద్రముచేత బాధపడుచు యీలాగువచ్చినానని ఆమెచెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు నీవు చద్దికూటి మంగళవారముల నోము పట్టి యది ఉల్లంఘనచేసినావు. ఆకారణముచేతనీకీదరిద్రబాధ సంభవించినది. నీవు తిరిగియింటికివెళ్లి ఆనోముపట్టి యథావిధిగఉద్యాపనము చేసుకొన్న యెడల నీబాధపోవునని చెప్పి యదృశ్యులయిరి. అప్పుడామె యింటికి వెళ్ళి నోముపట్టి ఏడాది ప్రతివారము ముత్తయిదువకు పెట్టి, ఏడాది అయినతరువాత ఉద్యాపనము చేసుకోగా దరిద్రబాధ పోయెను.

ఉద్యాపనము:—పదముగ్గురు పేరంటాండ్రకు తలంటి, నీళ్లు పోసి, పదమూడుడబ్బులు దక్షిణ, తాంబూలము, పదమూడు రవికలగుడ్డలుపెట్టి, తొలినాడు అస్తమానమువేళ వంటచేసి, మూతపెట్టి, చద్దిచేసి ప్రొద్దున్నె ముత్తయిదువలకు భోజనములుపెట్టి, పదమూడు మూకుళ్ళలో ఈచద్దిపెట్టి, పదముగ్గురకు వాయనము ఇయ్యవలయును. కథ

లోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు,

---

## 13. రేగులగౌరి కథ.

ఒక రాజుగారిభార్య రేగులగౌరి నోముపట్టి మరచి పోయెను. ఆమెకు సంతానములేదు. సంతానము లేకపోయెగదా! అని విచారముతో తలగట్టుకొని పరుండెను. ఆసమయమందు విష్ణుమూర్తి వైష్ణవునివేషముతోవచ్చి "ఏమిఅమ్మాయీ! ఆలాగుపరుండి యున్నావు?" అని యడుగగా సంతానములేనిచింతచే యీలా పరుండి యున్నానని చెప్పెను. నీవు రేగులగౌరినోము పట్టి మరచిపోయినావు. అందుచేత నీకు సంతానము కలుగలేదు. ఇప్పుడైనా బంగారు రేగుపండ్లుతవ్వెడు నరసోలడుచేయించి దక్షిణ తాంబూలములతో ఒక బ్రాహ్మణునకు వాయనము ఇచ్చినట్టయితే నీకు పిల్లలుపుట్టెదరనిచెప్పి యాతడు చక్కా వెళ్ళెను. అంతట ఆమెలేచి అదేప్రకారము బంగారు రేగుపండ్లుతవ్వెణ్ణరసోలడు చేయించి ఒక బ్రాహ్మణునకు వాయనమిచ్చెను. తరువాత ఆమెకు సంతానముకలిగెను. అప్పుడంతా వచ్చి ఏమినోము పట్టినావమ్మా! ఏమివ్రతము చేసినావమ్మా! నీకు సంతానము కలిగినదని యడిగిరి. ఏమీలేదు; నేనొకప్పుడు రేగులగౌరి నోముపట్టి మరచి పోయినాను. అందుకు ఇప్పుడు విష్ణుమూర్తిలాగొక బ్రాహ్మణుడువచ్చి ఆసంగతిచెప్పి రేగులగౌరి నోము తిరిగి పట్టుమనిచెప్పగా పట్టినాను. అందుచేత నాకు బిడ్డలుకలిగినారని యా రాజుభార్య అందరితోను చెప్పెను. అప్పుడంతా ఆనోముపట్టి ఏడాది అక్షతలువేసుకొని ఏడాది అయినతరువాత ఉద్యాపనముచేసుకొనిరి.

ఉద్యాపనము:—కుంచెడుతవ్వెడు రేగుపండ్లుతెచ్చి అందులో ఒక బంగారపురేగుపండువేసి ఒకబ్రాహ్మణునకు తలంటి నీళ్ళు పోసి

పంచెలచాపు యిచ్చి ఆకుంచెడుతవ్వెడు రేగుపండ్లు బంగారపు రేగుపం డుతోపాటా బ్రాహ్మణునకు వాయనమియ్యవలయును. కథ లోపమైనను వ్రతలోపముకాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

---

## 14. పండుతాంబూలముల నోముకథ

ఒకరాజుభార్యయు మంత్రిభార్యయు పండుతాంబూలముల నోము పట్టిరి. మంత్రిభార్య ప్రోజుతాంబూలము లారోజునయిచ్చుచుండెను. రాజుభార్య భాగ్యముచేత అన్నిఒక్కమారే యిచ్చెదనని యూరకొన్నది. రాజుభార్య కానిర్లక్ష్యము చేత సంతానముకలుగక చాలావిచారమును పొందుచుండెను. మంత్రిభార్య సిరిసంపద కలదై బాగుండెను. నాతో నోముపట్టిన యీమెకు యిట్టిసంపద కలుగుట యేమి నాకులేకపోవుట యేమని రాజుభార్య విచారముతో అడవిలోకిపోయి తపస్సుచేయ మొదలుపెట్టగా అక్కడకు పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి యిదియేమని యామెనడిగిరి. అప్పుడామె, మంత్రిభార్య నేను పండుతాంబూలములనోము పట్టినాము. ఆమెకు సిరి, సంపదకూడా కలిగింది. నాకులేదు. అందుకుచేత యీలాగు వచ్చినానని చెప్పెను. పార్వతీపరమేశ్వరులప్పుడు, నీవుభాగ్యమున్న మూలమున గర్వించి తిన్నగా యిచ్చినావుకావు. అందుకుచేత నీకుబిడ్డలు పుట్టినారుకారు. ఇప్పుడు తిరుగ యింటికివెళ్ళి యధావిధిగ ఆనోముపట్టి ఉద్యాపనము చేసుకొన్నయెడల నీకుసంతానము కలుగునని చెప్పివారు వెళ్ళిపోయిరి. అప్పుడామె యింటికివచ్చి పార్వతీపరమేశ్వరులు చెప్పిన ప్రకారము తిరుగ పండుతాంబూలములనోము యధావిధిగ పట్టి భక్తిశ్రద్ధలతో ఏడాదిఅక్షతలు వేసుకొని ఉద్యాపనము చేసుకోగా ఆమెకు అప్పుడుసంతానముకలిగెను.

దీనికి ఉద్యాపనము:—ఒకపళ్లెముకొని, ఒకముత్తయిదువకు తలంటి నీళ్ళుపోసి, పిండివంటలతో భోజనము పెట్టి, చీర, రవికలగుడ్డ ఇచ్చి, పాతికపండ్లకు తక్కువ లేకుండా ఆపళ్ళెముతో ఆముత్తయిదువకు వాయన మీయవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలముతప్పదు.

---

## 15. మునికార్తిక వ్రతము

ఒకబ్రాహ్మణుని పెండ్లాము మునికార్తికదీపములనోము పట్టి ఉల్లంఘన చేసెను. అందువలన ఆమెకు దరిద్రమును కడుపుశోకమును వచ్చెను. అది భరించజాలక బ్రహ్మదేవుని యొద్దకువెళ్ళి వరమడిగి తెచ్చుకొంటానని ఆమెబయలుదేరి వెళ్లుచుండగా, త్రోవలో నొకబ్రాహ్మణుడు కనపడి "ఎక్కడకు వెళ్ళెదవమ్మా!" అనియడిగెను. నేను బ్రహ్మదేవునియొద్దకు వెళ్ళుచున్నాను. అనియామె చెప్పెను. అప్పుడాబ్రాహ్మణుడు అమ్మా! నాదికూడా ఒకమనవియున్నది. చెప్పుమని యడిగెను. అదియేమిటో చెప్పుమని యామెఅడుగగా, పదునెనిమిది జన్మములనుండి అన్నపానములు లేక యీలాగునున్నాను. అని చెప్పుమని యాబ్రాహ్మణుడు చెప్పెను. సరే అని యామెకొంతదూరము వెళ్ళగా అక్కడ పండ్లతోనున్న ఒకముంతమామిడిచెట్టు కనబడి అమ్మా! ఎక్కడికి వెళ్ళుచున్నావని అడిగెను. నేను బ్రహ్మదేవునియొద్దకువెళ్ళి వరము తెచ్చుకొనుటకయి పోవుచున్నానని యాబ్రాహ్మణిచెప్పగా అమ్మా! నాదికూడా ఒకమనవి ఉన్నది. అనియాచెట్టుచెప్పెను. అదియేమిటో చెప్పుమని యావిప్రునిభార్యఅడుగగా, మూడుపురుషాంతరములనుండి నిండి పండియున్నాను. ఎవ్వరూ ఒకపండయినా కోసుకొనితినరు. అది ఎందుచేతనో అడిగిరమ్మని చెప్పెను. అంతటఆబ్రాహ్మణునిభార్య బయలుదేరివెళ్ళుచుండగా కొంతదూరము వెళ్లేసరికి ఒకఆవు, దూడ మొలబంటి

గడ్డిలో మేయకుండా నిలబడియుండి అమ్మా! ఎక్కడికి వెళ్ళుచున్నావని యడిగినవి. అప్పుడా బ్రాహ్మణస్త్రీ బ్రహ్మదేవునియొద్దకు వరములు తెచ్చుకొనేనిమిత్తము వెళ్ళుచున్నానని చెప్పగా అమ్మా! మాది ఒక చిన్నమనవి యున్నది. అడిగి రావలయునని యవిచెప్పెను. అది యేమి టని యామె యడుగగా యీలా నిలబడియున్నాము యీసంగతి యేమిటో కనుక్కొని రావలయునని యని చెప్పెను. సరే అని ఆమె మరలకొంత దూరమేగుసరికి నిండా పుష్పలతో ఒక మల్లెంటు ఆమెకు కనపడి అమ్మా! ఎక్కడకు వెళ్ళుచున్నావని యామె నడిగెను. బ్రహ్మ వద్దకువెళ్ళి వరము తెచ్చుకుంటాను. అని ఆమెచెప్పగా, అమ్మా! నాది కూడా ఒక చిన్న మనవియున్నది చెప్పుమని చెప్పెను. ఆలాగే యని ఆమె కొంతదూరము వెళ్ళగా ఒక చోట వెనురుదక్షిణమున కోకలు తగులడుచుండెను. యదిచూచి యామె మరికొంతదూరము వెళ్ళువరకు అక్కడ అట్లపెనములు అంటుకొని మండుచుండెను. అదిచూచి మరికొంతదూరము వెళ్ళేసరికి బ్రహ్మలోకము కనబడెను. అప్పుడామె బ్రహ్మలోకము లోనికివెళ్లి బ్రహ్మకెదురుగా నిలబడెను. ఆమెను చూచి బ్రహ్మ ఏమమ్మా! యీలాగువచ్చినావు? యని యడుగగా, దరిద్రముచేతను కడుపుశోకముచేతను బాధపడలేక యీలా వచ్చినానని చెప్పెను. నీవు క్రిందటిజన్మమున మునికార్తికదీపముల నోముపట్టి ఉల్లంఘనచేసినావు. ఆకారణముచేత నీకీదరిద్రమున్ను కడుపుశోకమున్ను వచ్చినది. ఇప్పుడు మరల యింటికివెళ్ళి మునికార్తికదీపముల నోముపట్టి మూడుకార్తులు సమముగా వెలిగించుకుంటే అన్ని బాగా ఉంటాయి; అని బ్రహ్మచెప్పెను. అప్పుడామె, సరేకాని ఒకబ్రాహ్మణుడు పదునెనిమిది జన్మములనుండి అన్నపానములు లేకుండా ఉన్నాడు. ఎందుచేతనని యడిగెను. ఆబ్రాహ్మణుడు బాగా వేదము చదువుకొన్నాడు. ఎవరికి ఒక్కముక్క అయినా చెప్పినాడుకాడు. అందుచేత

ఆయోగ్యతకలిగింది. కాబట్టి నీవు వెళ్ళేటప్పుడు ఆయనతో "రాను" అనుమాటచెప్పి వెళ్ళుమని బ్రహ్మదేవుడుచెప్పెను. త్రోవలో ఒక ముంతమామిడిచెట్టు పండ్లుపండియున్నది. దానిపండ్లెవ్వరును కోసుకొని తినరట, ఎందుచేతనని యామె యడుగగా, ఒకముత్తయిదువ, పదిమంది కొడుకులతల్లి; ఒకపిల్లవానిని పెంపుఇయ్యుమనగా, ఇచ్చినది కాదు; ఆకారణముచేత వంశముపోయినది. ఆశాపముతగిలి ఆమెచెట్టయి పుట్టింది. నీవు వెళ్లేటప్పుడు ఒక పండుతిని చక్కా వెళ్లుమని బ్రహ్మ చెప్పెను. త్రోవలో నొక యావు, దూడ, మొలబంటి గడ్డిలో మేత మేయకుండ నిలుచుండియున్నవి. ఎందుచేతనని యామె యడుగగా, అత్త కోడలును, ఆవునకు, దూడకు గడ్డి నీళ్లుపోయుటకు వంతులాడి నీవేపోసినావంటే నీవే పోసినావని పోయుట మానివేసినారు. అందుకుచేత వారిద్దఱును ఈలాపుట్టి గడ్డిమేయకుండా నిలిచియున్నారు. నీవువెళ్లేసమయమందు గుప్పెడు గడ్డితీసి వానికి వేసి యిన్నినీళ్లుపోసి మఱీవెళ్లుమని బ్రహ్మదేవుడుచెప్పెను. సరే. త్రోవలో నొక మల్లెంటున్నది. దానినిండాపూవులున్నవి. ఎవ్వరును నొక్క పువ్వయినను కోసుకొనరు ఏమికారణమని యాబ్రాహ్మణి యడుగగా, అది పూర్వము భోగముది. ఆజన్మమందు మల్లెపూవులు తెచ్చుకొని ఒక్కపువ్వయినను ఎవ్వరికి ఇయ్యకుండా తానే అలంకరించుకునేది. అందుకుచేత యీలాపుట్టింది. ఇపుడు నీవువెళ్ళేటప్పుడు ఒకపువ్వు కోసుకొనుము. తరువాత అందరు కోసుకొంటారు. యని బ్రహ్మచెప్పెను. సరే త్రోవలో దక్షిణమున కోకలు కాలిపోవుచున్నవి. ఎందుచేతనని యామె యడుగగా, యేడుతరముల ఆడబోడుచును తీసుకొనివచ్చి ఒకబట్టయెప్పుడును పెట్టిన పాపాన బోలేదు. అందుకుచేత వారి చీరలు తగులబడిపోవుచున్నవి నీవు వెళ్ళేటప్పు అందులో నొకకోకతీసి కట్టుకొనుము చల్లారిపోవును. యని బ్రహ్మదేవుడుచెప్పెను సరే ఇంకొకచోట

అట్లపెనములు మండిపోవుచున్నవి. ఎందుకుచేత నని యాబ్రాహ్మణి యడుగగా, అత్త, కోడలు ఎసురువాయనాలు అందుకున్నారు. అందుచేత మండుచున్నవి. నీవు వెళ్ళేటప్పుడునీళ్లుచల్లి వెళ్లుము. యని బ్రహ్మదేవుడు చెప్పెను. సరే, ఇవన్నియు, చేయుదును నాకు ఫలితమేమిటి అని యామె యడుగగా మున్నూటరువది వత్తులువేసి సిద్దెడునూనెపోసి దీపాలు వెలిగించినావు. వెలిగించినందు కావత్తులఫలము మానివేసి వలికిన ఫలమిచ్చినాను. వెళ్ళి నోముపట్టి ఉద్యాపనముచేసుకొమ్మని బ్రహ్మచెప్పెను. అప్పుడామె సరే, మంచిదని తిరిగివచ్చుచు, అట్లపెనముపై నీళ్ళుచల్లెను. మరికొంతదూరమువెళ్ళి దణ్ణెమునకోకలు తగులబడిపోవుచుండగా ఒకటి తీసికొని కట్టుకొనెను. మరికొంత దూరము వెళ్ళి మల్లెపందిరిని రెండుపువ్వులు కోసుకొని కొప్పులో పెట్టుకొనెను. మరికొంతదూరమువెళ్ళి ఆవునకు దూడకుగడ్డివేసి నీళ్లుపోసెను. ఇంకను కొంతదూరము వెళ్ళి ముంతమామిడిచెట్టును ఒకపండు కోసుకొని తినెను. తరువాత బ్రాహ్మణునియొద్దకువెళ్లి పాలలో బియ్యము పోసి పరమాన్నమువండి అది పళ్ళెములోపోసి "రామ రామ రామ" యని మూడుమారులని యాతనికిపెట్టి తిన్నగాయింటికివెళ్ళెను. తరువాత శివరాత్రినాడు మునికార్తిక దీపముల నోముపట్టి మూడువందల అరువదివత్తులు, సిద్దెడునూనె పోసి శివాలయములో దీపము వెలిగించి యింటికివచ్చెను వత్తిఫలముకంటె వలికినఫలముఎక్కువ యగుటచేత, ఆమెయింటికి వచ్చేసరికి సిరిసంపదకలిగియుండెను. అప్పుడుచిన్నలయిన వారు కాళ్లును, పెద్దలయినవారు చేతులును పట్టుకొని ఏమినోము పట్టినావని యడిగిరి. ఏమీలేదు. మునికార్తిక దీపములనోము పట్టినాను. వలికిన ఫలమేగాని వత్తిఫలము లేదని బ్రహ్మదేవుడు వరమిచ్చినాడు. యని యా బ్రాహ్మణునిభార్య వారందరితోచెప్పెను. ఆనోము కలి

ఉద్యాపనము:—నోముపట్టి ఏడాది అక్షతలు వేసుకొన్నతరువాత ముత్తయిదువకు తలంటి నీళ్ళుపోసి కరకంచు చీరయిచ్చి, కాటుకబరణెయిచ్చి రవికలగుడ్డ, దక్షిణతాంబూలము ఇయ్యవలెను. శక్తి తప్పినను భక్తితప్పరాదు. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు.

---

## 18. అట్లమీద ఆవపువ్వుకథ.

ఒక బ్రాహ్మణునికూతురు అట్లమీద ఆవపువ్వునోముపట్టి ఉల్లంఘనముచేసెను. అందుచేత విధవరికమును కడుపుశోకమును వచ్చెను. వంశములేకుండ నిర్వంశ మయ్యెను. ఆదుఃఖము భరించలేక ఆమె అడవికివెళ్ళి యేడ్చుచుండగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చిఏమియీలాగేడ్చుచున్నావనియడిగిరి మీకెందుకునాయనా? మీదారిని మీరు వెళ్ళండి, మీరేమి ఆర్చేవారా? తీర్చేవారా? యని యామె చెప్పెను. అప్పుడు వారు దీనికింకను కర్మపరిపాకము కాలేదు, మనమేమి చేయుదమని చక్కవెళ్లిరి. ఆమె ఆలాగె దుఃఖించుచుండెను. వారు కొన్నాళ్ళకు తిరిగి అక్కడికేవచ్చి మునుపటిచోటననే ఆమెనుచూచి ఏమి యీలాగున్నావని యడిగిరినారట అందు కామె నాయనా! నాకర్మము, మీకెందుకు? యని చెప్పగా, ఓహో! ఈమెకింకను కర్మపరిపాకము గాలేదని మరల వెళ్ళిపోయిరి. ఆమె చెట్టుపుట్టలయి అడవులవెంట తిరుగుచుండెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు మరలవచ్చి ఇంకను, ఈలాగే తిరుగుచున్నావా? యని అడిగిరి. అప్పుడామె నాయనా! పుట్టినబిడ్డలు బుగ్గిఅయిపోయినారు. తలమీద గొడుగు తర్లిపోయింది. అరణ్యాలపాలై యీలాగు తిరుగుచున్నాను, అని చెప్పెను. నీవు పూర్వము అట్లమీద ఆవపువ్వునోము పట్టి ఉల్లంఘనచేసినావు. అందుచేత యీలాగు తిరుగుచున్నావు. ఇప్పుడైనా యింటికివెళ్ళి యీనోముపట్టి కథచెప్పి అక్షతలువేసుకొని

యేడాది అయినతరువాత ఉద్యాపనము చేసుకోవలసినదని పార్వతీ పరమేశ్వరులు చెప్పిరి. ఆమె ఆప్రకారము ఇంటికివెళ్ళి ఆనోముపట్టి ఏడాది అయినతరువాత ఉద్యాపనము చేసుకొనెను.

దీనికి ఉద్యాపనము:—ఒక ముత్తయిదువకు తలంటినీళ్ళుపోసి, రవికలగుడ్డ, దక్షిణతాంబూలము ఇచ్చి, పండ్రెండుఅట్లు పూసి కాసియున్న ఆవకొమ్మలు తెచ్చి, పేరిననెయ్యి, బెల్లముతో ఆ ముత్తయిదువకు వాయన మియ్యవలెను. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు.

---

## 19. పసుపూవులనోముకథ.

శివా! మహాదేవా! సింహద్వారము గడిచి వచ్చితినిదేవా! మూకలో ముసుగువేయకుండా నోచితిని. దేవా! అథమస్థానమున అల్లుడింటికి వెళ్ళకుండా నోచితినిదేవా! ఒక పూవు పూజచేసితిని దేవా! ఉత్తమమైన బ్రాహ్మణకడుపున బుట్టనోచితినిదేవా! రెండుపూవుల పూజచేసితినిదేవా! సుపుత్రి సావిత్రికలుగనోచితిని దేవా! మూడుపూవులపూజచేసితినిదేవా! ముత్యాల గొడుగులనీడ నడవనోచితిని. దేవా! నాలుగుపూవులపూజచేసితినిదేవా! నవధాన్యాలు నాయింటికిరానోచితినిదేవా! అయిదుపూవుల పూజచేసితినిదేవా! ధరణిదేవివంటి తల్లిదండ్రులు రానోచితినిదేవా! ఆరుపువ్వుల పూజచేసితినిదేవా! ఆదిత్యభగవానులవంటి అత్తమామలు రానోచితినిదేవా! ఏడుపువ్వులు పూజచేసితినిదేవా! ఏకచక్రముగ నేల నోచితినిదేవా! ఎనిమిదిపూవులు పూజచేసితినిదేవా! ఎనమండ్రు కంసాలురుచేసిన సొమ్ములు ఎడ తెగకుండా పెట్టనోచితినిదేవా! తొమ్మిదిపూవులుపూజ చేసితినిదేవా! తోయజగంధులు తోడుగానోచితినిదేవా! పదిపూవులు పూజచేసితినిదేవా! పట్టపురాజున కిష్టమైన దేవినిగా నోచితినిదేవా!

పదకొండుపూవులు పూజచేసితినిదేవా ! పాయక పురుషుడు పరస్త్రీని చూడకుండా నోచితినిదేవా ! పండ్రెండుపూవులు పూజచేసితినిదేవా! ఎక్కువ అయిదవతనము మిక్కిలి సంపదా కలుగనోచితినిదేవా ! పదమూడుపూవుల పూజచేసితినిదేవా ! పార్వతీసాన్నిధ్యము పడయగోరితినిదేవా! మెచ్చితిని అక్కా- యిచ్చితిని వరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా ! కోర నేమున్నదయ్యా, మానవేమున్నదయ్యా, ఇష్టసంపదలకు ఇద్దరుకుమార్తెలను గోరితిని పార్వతీదేవివంటిది కూతురు, లక్ష్మీదేవివంటిదికూతురు. మెచ్చితిని అక్కా- యిచ్చితిని వరము మరియొకటికోరవే మహేశలింగము శివభక్తురాలా, కోర నేమున్నదయ్యా, మానవేమున్నదయ్యా, పదముగ్గురు కొడుకులనుగోరితిని. మువ్వలాడుకొడుకు,గజ్జెలాడుకొడుకు,అందెలాడుకొడుకు అమ్మా అన్నముపెట్టుమనేవాడుకొడుకు, ఉగ్గుపోయుమనేవాడు కొడుకు, పదమటభారతము చదువువాడుకొడుకు, ఉత్తరాది యూళ్ళేలువాడు కొడుకు, దక్షిణాదిద్వార మెత్తువాడుకొడుకు, గోవునుదెచ్చి దొడ్డిపెట్టి గోదానముచేయుమనేవాడుకొడుకు, అన్నము వండించిరాశిజేసి అన్నదానము చేయుమనువాడుకొడుకు, కన్నెలనుగని దగ్గరపెట్టి కన్యాదానముచేయుమనువాడుకొడుకు, సువర్ణముదెచ్చి పళ్ళెరములనుంచి సువర్ణదానముచేయుమనువాడుకొడుకు, వస్త్రములు తెచ్చిదండెములవేసి వస్త్రదానముచేయుమనువాడుకొడుకు,ఇటువంటికొడుకులను పదిముగ్గురు కొడుకులను గోరితిదేవా! మెచ్చితినిఅక్కా-, యిచ్చితిని వరము మరియొకటిగోరవే మహేశలింగము శివభక్తురాలా, కోరనేమున్నదయ్యా, మానవేమున్నదయ్యా, సోమయాజులవారి సోమిదేవమ్మ పెద్దకూతురునై పుట్టి వేగివేసిన వేయిపుట్లరాజనాలు, పదిపుట్లఅపరాలు, అయిదుపుట్ల జీలకఱ్ఱ, పందుము ఉప్పు, ముద్ది డింగువ, సిద్దెడు నెయ్యి పెరుగాకు, పెరుగుపోక, గుమ్మడికాయంత సున్నము, పదికడవల ఆవ,

యిరు నైకడవల పెరుగు, చద్దికంచాలక్రింద చెల్లగోరితినిదేవా! మెచ్చి తిని అక్కా యిచ్చితినివరము మరియొకటికోరవే మాహేశలింగము శివభక్తురాలా! కోరనేమున్నదయ్యా! మానసేమున్నదయ్యా! సోమయాజులుగారి సోమిదేవమ్మ పెద్దకోడలునై వేసివేసిన వేయిపుట్ల రాజనాలు, పదిపుట్ల అపరాలు, అయిదుపుట్ల జీలకఱ్ఱ, పందుముడుప్పు, ముద్దిడింగువ, సిద్దెడునెయ్యి, పెరుగుఆకు, పెరుగుపోకా, గుమ్మడికా యంతసున్నము, పదికడవలావ, యిరవయికడవల పెరుగు, వేడిపళ్ళె రాలక్రింద చెల్లగోరితినయ్యా దేవా! మెచ్చితినక్కా ఇచ్చితినివరము. మరియొకటిగోరవే మహేశలింగము శివభక్తురాలా! కోరనేమున్న దయ్యా, మానసేమున్నదయ్యా, తల్లినికనినతల్లి, తల్లి, తాను మూడు తోటల పూవులుముడిచికొని ఆరుతోటల పసపురాచుకొని మునిమున మలను చంకబెట్టుకొని, పట్టెమంచము పరుపుమీద పరుండగోరితి నయ్యాదేవా! మెచ్చితినక్కా యిచ్చితినివరము. మరియొకటి కోరవే మహేశలింగము శివభక్తురాలా! కోరనేమున్నదయ్యా, మానసేము న్నదయ్యా! అత్తగారత్తగారు, అత్తగారు, తాను మూడుతోటల పూవులు ముడిచికొని ఆరుతోటల పసపురాచుకొని మనుమలను చం కబెట్టుకొని పువ్వులపాన్పుపయి పరుండగోరితినయ్యాదేవా! మెచ్చితిని అక్కా, ఇచ్చితినివరము. మరియొకటిగోరవే మహేశలింగము శివ భక్తురాలా! కోరనేమున్నదయ్యా, మానసేమున్నదయ్యా, పసుపువ్వు లనోముపట్టిన పడతివచ్చినది, కడగండికాళ్లు, వేయుండిగద్దె, పూలతోట లోకి తీసికొనివెళ్ళి పురాణపుస్తకములు విప్పిచూపించుడి యేలాగు వచ్చినదియో, యెటువచ్చినదియో నీలాంబరమున నిలచియే వచ్చి నదియో కనకాంబరమున కదిలే వచ్చినదియో, వెల్లచీరలో వెలసి యేవచ్చినదియో, ఆలాగే వచ్చినదియో, అటువచ్చినదియో, ఉద్దండ పురుగులు పడకుండా, ఇరుపుముక్కల కాకులు పొడవకుండా పసు

పువ్వుల నోముపట్టిన పడతికి స్వర్గమునకు తలుపులుతీసిపెట్టండి. ఆమె నోచిననోము భూలోకమంతయు నోచినారు. శక్తితప్పినా భక్తితప్ప రాదు. అక్షింతలు తప్పినా లక్షువేలు అయిదువతనము.

నోము పట్టెడు విధానము:—నోము ఇంక పట్టెదరనగా నిత్య మల్లెచెట్టునో మరియేదయినా పువ్వులచెట్టునో దొడ్డియందు వేసికొని ప్రతిరోజును పదమూడు పువ్వులు గౌరిదేవికి పూజచేసుకొనవలెను. రోజు కొకమారు కథ చెప్పుకొనవలెను. పదమూడు పద్మాలు, పద మూడువత్తుల దీపము, పదమూడు ప్రదక్షిణాలు.

ఉద్యాపనము:—పదమూడు దోసిళ్ళ బియ్యము, పదమూడు బంగారుపువ్వులు, పదమూడుకానుల దక్షిణ, శివాలయమునకు పట్టు కొనివెళ్ళి శివలింగమునకు పూజచేయువలెను.

---

## 20. కార్తిక చలిమిళ్ళనోము కథ.

రాజుకూతురు, ప్రధానికూతురు కార్తికచలిమిళ్ళనోము పట్టి నారు. ప్రధానికూతురు పట్టినయేడు నీలాటిరేవున వాయనమిచ్చినది. నీలాటిరేవున వాయనమిచ్చినందుకు నిధినిక్షేపము పరమేశ్వరుడామెకు దయచేసెను. మరుచటి సంవత్సరం కొమ్మక్రింద వాయనమిచ్చెను. అట్లుయిచ్చినందుకు కొమ్ముటేనుగులవంటి కొడుకులను పరమేశ్వరు డామెకిచ్చెను. మూడవయేడు గుడిలో వాయనమిచ్చినది. ఇట్లు ఇచ్చి నందుకు పార్వతీదేవివంటి అయిదవతనము నిచ్చెను రాజుకూతురుల్లం ఘనముచేసినది. అట్లుల్లంఘనము చేయుటచే నామెకు హీనదశపట్టి మగడెప్పుడు రోగాలతో తీసుకొనుచు నుండెడువాడు. తనతోటి ప్రధానికూతురు సకలైశ్వర్యము లనుభవించుచుండగా తానాహీన దశననుభవించలేనని యడవులపాలైపోయి పార్వతీపరమేశ్వరులను

ధ్యానము చేసికొనుచున్నది. అట్లామెయుండగా పార్వతీపరమేశ్వరుల కనుగ్రహామువచ్చి ముదిదంపతులరూపమున నామెకు ప్రత్యక్షమయి, యేమమ్మా! ఇట్లు దుఃఖించుచున్నావని యడిగిరి. మీకెందుకమ్మా! ఆర్చెడువారా! తీర్చెడువారా! వెళ్ళుడని వారితో నామె పలికెను. అప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునిచూచి ప్రధానికూతురు కార్తికచలిమిళ్ళనోము పట్టినది. రాజుకూతురును పట్టినదిగదా! రాజుకూతురీలాగుండడమేమి? ప్రధానికూతు రట్లుండమేమి? అనియడిగెను. పరమేశ్వరుడు పార్వతీదేవితో ప్రధానికూతురు నీళ్ళరేవున వాయనమిచ్చినందుకు నిధినిక్షేపమిచ్చితిని. కొమ్మక్రింద వాయనమిచ్చినందుకు కొమ్ముటేనుగులవంటి కొడుకులనిచ్చితిని. సన్నుబోల వాయనమిచ్చినందుకు సన్నుబోల నయిదవతనమిచ్చితిని. రాజుకూతు రుల్లంఘనము చేయుటనుబట్టి యామె హీనదశ ననుభవించవలసివచ్చెను. అని చెప్పినాడు. అప్పుడు పేదముత్తయిదువు రూపముదాల్చియున్న పార్వతీదేవి యారాజుకొమార్తెతో నీసంగతిచెప్పి వెంటనే తాను కార్తికచలిమిళ్లనోము తిరిగి యామెచేపట్టించి యథావిధిగా నుద్యాపనము చేయించి యింటికి నామెను పంపించెను. రాజుకూతురు తనయింటికి వచ్చేసరికి ఇల్లు సకలైశ్వర్యములతో తులతూగుచుండెను. మగడు సుఖముగాను ఆరోగ్యముగానున్నాడు. అప్పుడామె పట్టిననోము లోకమందరుపట్టిరి.

విధానము:—పట్టినయేడు అయిదుమానికల బియ్యము, మరుచటిసంవత్సరము పదిమానికల బియ్యము, మూడవయేడు పదిహేనుమానికలబియ్యము, చలిమిడిముద్దలుచేసి పట్టినయేడు అయిదుగురు ముత్తైదువులకు, మరుచటియేడు పదిమందికి, మూడవయేడు పదిహేనుగురికి వాయనమీయవలెను. ఈనోము కార్తికపున్నమినాడు పట్టవలెను. ఇదే ఉద్యాపనము.

---

## 21. తరగనాదివారములకథ.

రాజుకూతురు, ప్రధాని కూతురు, తరగనియాదివారములు నోముపట్టిరి. ప్రధానికూతురు యేడాదిన్ని ఆదివార మాదివారము, తరిగినకూర తినకుండగను, తరుగకుండను, తరుగమనకుండగను, ఉండి భక్తిశ్రద్ధలతో నోచుకుని 13 కొబ్బరికాయలు, 13 కానులు, చీర, రవికె, పెట్టిలో బెట్టి ముత్తయిదువునకు వాయన మిచ్చుచున్నది. ఆమెకు గృహమునిండుగ నెక్కడచూచినను సిరిసంపదలు తులతూగుచుండెను. రాజుకూతురు సింగినాదము తరిగితేనేమి వచ్చినది? తింటే నేమివచ్చినది? అని తరిగినకూరలు తినుచు తరుగుచు భక్తిలేక శ్రద్ధలేక నోము ఉల్లంఘనము చేసినది. రాజుకూతురునకు పుట్టినబిడ్డలు చచ్చుచునుండే వారు. ఈమె ప్రధానికుమార్తెను దాని యదృష్టమునుచూచి సహింపలేక యొకనాడు ప్రధానికుమార్తెయొక్క బిడ్డలనందరిని తన యింటికిరప్పించి తలకాయలన్నియుకోసి పెట్టెలో బెట్టి ప్రధానికూతురింటికి పంపెను. ఇక్కడ రాజుకూతురు పిల్లలనందరిని నరుకునప్పటికి అక్కడ ప్రధానికూతురింట్లో పార్వతీదేవి ఇకనొక అంతనుంచి పిల్లలనేసి ఉంచి పోయెను. ఈపిల్లలకామె యన్నము పెట్టుకొనుచునుండగా రాజుకూతురుపంపిన పెట్టె యింటికిరాగా ఆపెట్టెతీసి చూచుకునేసరికి దానిలో నాడుచు, పాడుచు పదిముగ్గురు పిల్లలును బైటకివచ్చిరి. వారిని వీరిని కూడా చూచుకొని ప్రధానికూతురు సంతోషించుచుండెను. రాజు కూతురు దాసీదానిని చూచి ప్రధానికూతు రేలాగునున్నదని అడిగినదట. అడిగితే, అమ్మా, పెట్టెలోనిపిల్లలను, యింట్లోనిపిల్లలను చూచుకొని ఆమె పట్టరాని యానందముతో నున్నదని చెప్పినది. అదివిని రాజుకూతు రాశ్చర్యపడి యదిపట్టిననోమే నేనున్ను పట్టినాను నాగతి యీలాగు కావడమేమని యడవులపాలై పోయెను. అప్పుడు పార్వతీదేవి ముసలిముత్తయిదువుగావచ్చి యామెకు కనబడి యేమమ్మా!

ఈలాగున వచ్చినావు? అని యడిగినది. ప్రధానిక్కూతురును, నేనున్ను ఒకేనోముపట్టినాము. అదియీలాగు సిరిసంపదలతో తులతూగుచుం డగా నేనీలాగున నున్నాను. అందుకొరకుగాను అడవులలోనికి వచ్చి తినమ్మా! అని రాజుకూతురు పార్వతీదేవితో చెప్పెను. అప్పుడు పార్వతీదేవి ప్రధానికూతురు తరగనిఆదివారములనోము భక్తిశ్రద్ధలతో తరగకుండాను, తరగమనకుండాను, తరిగినది తినకుండాను, చేసికొన్నది. నీవు ఉల్లంఘనము చేయుటనుబట్టి యీలాటి దశవచ్చినది. అని చెప్పి తిరిగి యామెచేత నోముపట్టించి యథావిధిగా ఉద్యాపనము చేయించి తానావాయన మందుకొన్నది. అపుడు రాజుకూతురు కడుపుచలువ, సిరి, సంపద కలదైయుండెను. ఆమె నోచిన నోమంతా నోచిరి. అక్షింతలు తప్పినను లక్షవేలయిదవతనము.

---

## 22. గుమ్మడిగౌరి కథ.

ఒక బ్రాహ్మణునకు ఒకడేకుమారుడు కలడు. ఆకొడుకునకు పెండ్లియయిన కొన్నాళ్ళకు గండమున్నదని జ్యోతిష్కులు చెప్పిరి. అట్లుండగా కొన్నాళ్ళకాచిన్నవాని కొకచిన్నదానిని పెండ్లి జేసిరి. వారు కాపురము చేయుచుండగా కొన్నిరోజులకు యమదూతలువచ్చి మీపిల్లవానిని దీసుకొని వెళ్లెదమని తలితండ్రులతో చెప్పిరి. అప్పుడు తలితండ్రులు, అయ్యలారా! పెండ్లిఅయ్యేవరకే మాపిల్లవాడుకాని పెండ్లి అయినతరువాత పెండ్లాముపుణ్యము మేమేమిచేయుదుము? తీసుకొని వెళ్ళుడని చెప్పిరి. ఆమాటలు విని యాచిన్నది తన భర్తను, అడవిలోనికి తీసుకొనివెళ్ళినది. యమభటులకు చిక్కకుండ కాపాడుద మని తీసుకొని వెళ్ళుచున్న యాచిన్నదాని నెఱ్ఱితనమునుచూచి పార్వ తీపరమేశ్వరులు దయగలవారై ముసలిదంపతుల వేషములు ధరించి ఆచిన్నదియు, భర్తయు నున్నచోటికివచ్చి మీరెక్కడకు వెళ్ళుచున్నా

రని యడిగిరి. అందుకాచిన్నది మీరార్చేవారా? తీర్చేవారా? మీ రెందుకని చెప్పినది. ఆలాగుకాదు. అమ్మాయీ! ఆర్చెడివారము మేమే, తీర్చెడివారము మేమే, చెప్పవలసినదని మరల పార్వతీపరమేశ్వరులు అడుగగా, నాభర్తకోసము యమదూతలు వచ్చినారు. అందుచేత నాభర్తను అడవిలోనికి తీసుకువచ్చి పార్వతీదేవి నడిగి, అయిదవతనము తెచ్చుకొందమని వచ్చినాను, అని యాచిన్నది చెప్పెను. అప్పుడు, ముసల ముత్తయిదువగానున్న పార్వతీదేవి యాచిన్నదానిని చూచి, అయ్యో! గుమ్మడిగౌరి నోముపట్టి పెద్దముత్తైదువను నా కుద్యాపనము చేసుకోవమ్మా, నీమగనికి గండముగడచి నీకైదవతనమువచ్చును. అనిచెప్పి ఆయడవిలో మూడు గుమ్మడిపళ్ళుకోసి రవికెలగుడ్డ, పసుపు, కుంకుమ, తాంబూలముగావించి తానాచిన్నదానిచేత వాయనము పుచ్చుకొనెను. వాయనము పుచ్చుకొని ఏడాది గుమ్మడికాయకూర తినవద్దనిచెప్పి, పంపెను. ఈచిన్నది తిరిగి యింటికి వచ్చి నూరేండ్లు అయిదవతనముతో నుండెను. ఈసంగతంతయు నిరుగుపొరుగమ్మలు తెలుసుకొనిరి. ఆమె పట్టిననోము జగమంతాపట్టిరి. శక్తితప్పినా భక్తితప్పరాదు. అక్షతలుతప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము. కథ లోపమయినా వ్రతలోపము కారాదు.

---

## 23. పువ్వులతాంబూలముల నోముకథ.

ఒక రాజుకూతురి నెప్పుడు మగ డేలేవాడుకాడు. ఆవిడ సంతానములేక, సిరియొల్లక, అడవులనుబట్టి పోయెను. పార్వతీదేవి ముసలిముత్తైదువ వేషమువేసుకొనివచ్చి, ఏమిబిడ్డా! యీలా వచ్చితివని యడిగెను. ఏమి చెప్పనమ్మా! నాస్థితిఅంతా యిదియని తనకథ యంతయు చెప్పెను. అప్పుడు పార్వతీదేవి నేను చెప్పినట్లు చేయుము. అమ్మాయీ! నీమగనికి నీమీద దయవచ్చును. తరువాత సంతాన

ముకలుగును. సకలభాగ్యాలు వచ్చును. అని చెప్పెను. రాజుకూతు రామెమాటలకు సంతోషించి యింతకంటే యేమికావలెను. చెప్పు మని యడుగగా, పార్వతీదేవి అమ్మాయీ! నీవు తిన్నగా యింటికి వెళ్లి ప్రతిదినము అయిదుపువ్వులు తాంబూలములో పెట్టి ఒక సేడాది భక్తిశ్రద్ధలతో పార్వతీదేవి పేరుచెప్పి ఒకముత్తైదువకిచ్చి తరువాత పళ్ళెమునిండా పువ్వులుపోసి ఒక బంగారుపువ్వు చేయించి చీర, రవికెలగుడ్డ పెట్టి పళ్ళెముతోకూడా ముత్తైదువకు ఉద్యాపనము చేసుకోనుము, అనిచెప్పెను. ఆ మాటలువిని ఆమె తిన్నగా, యింటికివచ్చి భక్తిశ్రద్ధలతో పార్వతీదేవి పేరుచెప్పి యేడాది పైనచెప్పినప్రకారము పువ్వులతాంబూలాలిచ్చుకొని-ఆవిడచెప్పినప్రకారము ఉద్యాపనము చేసుకొన్నదట. అప్పటినుండి ఆరాజుకూతురు, మొగుడు నీళ్లుపాలు కలసినట్లు కలసి సుఖములనుభవించిరి. తరువాత ఆమె ముత్యాలవంటి బిడ్డలను కని రత్నమాణిక్యాలు భూషణాలు పెట్టుకొని సుఖముగా నుండెను. ఆమెపట్టిన నోము లోకమంతయుపట్టెరి. శక్తితప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేల యోగ్లు అయిదవతనము. (ఉద్యాపనము కథలో నున్నది)

---

## 24. గంధంతాంబూలాలనోముకథ.

పైకథవలెనే దీనికథయును, ప్రతిదినము అయిదు గంధపుండలు తాంబూలములోపెట్టి యివ్వవలెను.

ఉద్యాపనము:—గంధపుచెక్క, ఆకులు, పోకలు, చీరె, రవికలగుడ్డ, పెట్టి ముత్తయిదువకు ఉద్యాపనము చేసికోవలెను.

---

## 25. నిత్యతాంబూలాల నోముకథ.

దీనికథయు పైకథవలెనే. నిత్యము ఒకతాంబూలము బ్రాహ్మణుని కియ్యవలెను.

ఉద్యాపనము:—వెండాకు, భమిడి (పైడి) చెక్కచేయించి ఆకులు, పోకలు, పాందానులో పెట్టి పాందానుతోకూడా బ్రాహ్మణునికియ్యవలయును.

---

## 26. పసపుతాంబూలము కథ.

దీనికథయును పైకథవలెనే. ప్రతిదినము అయిదుపసుపుకొమ్ములు తాంబూలములో ఉంచి ముత్తయిదువకు ఇచ్చుచుండ వలయును.

ఉద్యాపనము:—వీసెయేబులము పసుపు, వీసెయేబులము కుంకుమ, చీర, రవికలగుడ్డ, తాంబూలము పళ్ళెములో ఉంచి ముత్తయిదువకు ఇయ్యవలయును. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము.

---

## 27. మాఘగౌరికథ.

ఒకబ్రాహ్మణునకొక కుమార్తెకలదు. ఆకూతురికి చిన్నతనములోనె వెధవరికము వచ్చెను. ఆపిల్లయవస్థ చూడలేక తల్లిదండ్రులు అడవిలోనికి తీసుకొనివెళ్ళి తిరుగుచుండగా ఒక నదిగట్టుమీదకూర్చుండి పునిస్త్రీలంతా ఒకరేవునను విధవలంతా ఒకరేవునను, అయిదేసిపద్మాలు పెట్టుకొని నోము నోచుకొనుచుండిరి. అదిచూచి ఆతల్లిదండ్రులు పిల్లనుతీసుకునివెళ్ళి అదేమినోము అమ్మాఅని వారిని అడిగిరి. అప్పుడు పార్వతీదేవికూడా ఆముత్తయిదువలలో ఒకముత్తయిదువగా నుండి, వాళ్లనుచూచి వారిమాటలువిని అయ్యా! ఆనోము నేను చెప్పెదను గాని మీపిల్ల నీనదిలో స్నానము చేయించుదురుగాని తీసుకొనిరండని

చెప్పెను ఇంతకంటేనాఅమ్మా అని వారాపిల్లను తీసుకొనివెళ్ళిరి. అప్పుడు పార్వతీదేవి పిల్లనుచూచి నీళ్ళలోనున్న యిసుక దోసెడుతీసి గట్టునపోయుమన్నదట. ఆపిల్ల ఆప్రకారము పోయుసరికి అదంతయు పసపు అయినదట. మళ్లీ దోసెడు పోయుమమ్మా అన్నదట. ఆప్రకారము పోయగా అది కుంకుమ ఆయెను. మళ్ళీపోయుమనగా ఆచిన్నది మళ్ళీ దోసెడు పోయిసరికి అది కొబ్బరి అయినదట. మళ్ళీ దోసెడు పోయుమమ్మా అనిచెప్పగా అది బెల్లము ఆయెను. మళ్లీదోసెడు పోయుమమ్మా అనగా ఆమె ఆప్రకారము పోయుసరికి అది జీలకఱ్ఱ ఆయెను. అదిచూపించి పట్టినయేడు పసపు, మఱుచటియేడు కుంకుమ, మూడవయేడు కొబ్బరి, నాల్గవయేడు బెల్లము, అయిదవయేడు జీలకఱ్ఱ, సేరుంబావు సేరుంబావుచొప్పున ముత్తైదువకు తలంటినీళ్ళుపోసి భోజనముపెట్టి వాయనమియ్యమని చెప్పెను. ఈనోము మాఘమాసములో అమావాస్యవెళ్ళిన పాడ్యమిమొదలు నెల్లాళ్ళు మళ్ళీ పాడ్యమివరకు నీరాటరేవున పసపుగౌరమ్మను పెట్టుకొని పసపుతోడ అయిదుపద్మాలు, పిండితోడ అయిదుపద్మాలు, కుంకుమతోడ అయిదుపద్మాలు, పెట్టుకొని పూజచేసుకొని యీలా అయిదేండ్లు పూజచేసుకొని గౌరమ్మను నీళ్ళలో విడిచివేసిన వాళ్ళకు నిత్యసౌభాగ్యమువచ్చునని చెప్పెను. ఆప్రకారం ఆపిల్లచేత తల్లిదండ్రులు నోముపట్టించగా చచ్చినమగడు మళ్ళీవచ్చెను. ఆమెపట్టిన నోమంతాపట్టిరి. శక్తితప్పినాభక్తితప్పరాదు. అక్షతలుతప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము. ఉద్యాపనము కథలోనున్నది.

---

## 28. బాలాదివారములకథ.

ఒకబ్రాహ్మణునకు, ఒకకూతురు, ఒకకొడుకుకలరు. కొడుకునకు పెండ్లిఅయి కోడలు కాపురమునకువచ్చెను. కూతురు చిన్నపిల్ల. ప్రతి

దినము వారింటికి యాయవారపు బ్రాహ్మణుఁడు వచ్చేవాడు. ఈచిన్న పిల్ల ఆబ్రాహ్మణునకు రోజు యాయవారము వేసినప్పుడల్లా అతడు "గంగాస్నాన ఫలసిద్ధిరస్తు" అనేవాడు. కోడలు యాయవారము వేయగా "సౌభాగ్యవతీభవ" అనేవాడట! ఆమాటలువిని కూతురు తల్లిదండ్రులతోడ రోజూ బ్రాహ్మణుడు నన్నొకలాగున వదినెనొకలాగున దీవించుచున్నాడేమని యడుగుచుండెడిది. ఏమని దీవించినాడమ్మా! అని తలిదండ్రులు అడిగితే, ఆపిల్ల ఈరెండుమాటలు చెప్పెను. అది విని తలిదండ్రులు దుఃఖపడి మరునాడు యాయవారపు బ్రాహ్మణుడువచ్చినప్పుడు జాగ్రత్తగా కనిపెట్టియుండి, ఏమయ్యా! ఆపిల్ల నాలాగున, ఈపిల్ల నీలాగున, దీవించెదవని యడిగిరి. ఆబ్రాహ్మణుడు వారిని జూచి ఆచిన్నదానికి బాల్యములో వైధవరికమున్నది. గనుక "గంగాస్నానఫలసిద్ధిరస్తు" యని దీవించుచున్నాననియు, ఈచిన్నదానికి చాలా అయిదవతనమున్నది గనుక "సౌభాగ్యవతీభవ" యని దీవించుచున్నాననియు, చెప్పెను. ఆమాటలువిని తల్లిదండ్రులు దుఃఖించి మాకొక్కర్తేకూతురు, నాయనా! యని యేడ్చి ఆబ్రాహ్మణుని కాళ్ళమీదపడి, మాపాలి దేవుడవు నీవేగనుక నీపిల్లకు అయిదవతనము వచ్చేమార్గము చెప్పి రక్షించవలయునని ప్రార్థించిరి. అప్పుడా బ్రాహ్మడు బ్రహ్మవ్రాత యెవ్వరుతీసివేసేవారులేరు. అయిననూ నేనొకమాట చెప్పెదను. ఆలాచేయుమనెను. ఇంతకంటే నేమినాయనా! చెప్పుమని వారడుగగా, ఈపిల్లకు పెండ్లిఅయినతరువాత కొన్నిరోజులకే భర్తపోతాడు. పోగానే పోయినభర్త నింటిలోపెట్టి ఈపిల్లనుతీసుకొని మీరు గంగానదికి స్నానానికి వెళ్ళండి. ఆలావెళ్ళినయెడల దారిలో నొకముత్తయిదువస్నానానికి వెళ్ళుచూ చెంగున కట్టుకున్న పసపుపొట్లాము, కుంకుమపొట్లాము పడిపోతవి. అవి నింపాదిగ యీపిల్లచేత తీయించి ఆముత్తైదువతోకూడా వెనుకనే స్నానాలరేవునకు వెళ్ళండి. అక్కడకు

వెళ్లినతరువాత ఆమె స్నానముచేయబోయేసమయమున చెంగుననున్న మూట లేకపోగా అయ్యో! నాపసపు, కుంకుమ మెవరికో దొర కింది అనుకుంటుంది. ఆమాటవినగానే నాకు దొరికినదమ్మా! యని మీపిల్లను పసపుకుంకుమ యిమ్మనండి. ఇయ్యగానే ఆముత్తయిదువ ఆపిల్లచేతిలో రవ్వంత, మీచేతిలో రవ్వంతపసపు, కుంకుమపెట్టి తాను రాచుకొని స్నానముచేయును, అప్పుడు మీపిల్లచేత స్నానముచేయించి యింటికి తీసుకొనివచ్చి సేరుంబావు పాలు పరమాన్నమువండించి అడు గుమట్టు పైమట్టుతీసి మధ్యనున్నది ముత్తయిదువ కిప్పించి ముత్తయి దువను పంక్తిని పెట్టుకొని భోజనముచేసినతరువాత ముత్తయిదువకు చీరె, రవికెలగుడ్డ, తాంబూలము, దక్షిణతోయియ్యాలి యనిచెప్పెను. ఆలాగుచేసిన చచ్చిన పురుషుడు మళ్లీ బ్రతుకుతాడు. ఈపిల్ల చిన్న తనంలోను పసపు, కుంకుమ, అన్నివస్తువులు దొంగతనముచేస్తుంటే మీరు తల్లిదండ్రులైయుండి చూస్తూ ఊరకొనుటచేత యీజన్మమున ఆదొంగతనముచేసిన దోషమున యీపిల్లకు బాలవిధవరికదోషమును, చూచుచు ఊరకొన్న కారణమున పిల్లనుచూచి దుఃఖించుట మీకును కలిగినది. యని చెప్పినాడట. ఆమాటలువిని బ్రాహ్మణునకు మ్రొక్కి ఆయన చెప్పినప్రకారం పిల్లకు పెండ్లిచేసిన తరువాత విధవరికమురాగా గంగాస్నానమునకు తీసుకొనివెళ్ళి యథావిధిగ జరిపించిరి. ఆచిన్నదా నికి అప్పుడు చచ్చినభర్త మరల బ్రతికివచ్చెను. ఆమె పట్టిననోము జగ మంతాపట్టి అయిదవతనముతో సుఖపడిరి. శక్తితప్పినా భక్తితప్ప రాదు. అక్షతలుతప్పినా లక్షవేలయోడ్లు అయిదవతనము.

ఉద్యాపనము కథలోనున్నది.

---

## 29. బచ్చలగౌరికథ.

ఒకచిన్నది కాపురము చేయుండగా అన్నగారు చూచుటకు వచ్చెను. ఆచిన్నది అన్నగారితో కొంతసేపు ఇష్టాగోష్టినుండి, పిన్నటి పిండివంటలతో వంటచేసి కూరపోపునకు కరివేపాకు కావలసివచ్చి, అన్నయ్యా! దొడ్డిలో చెట్టుఉన్నది. కొంచెము కరివేపాకు తెచ్చిపెట్టు మని అడిగెను. ఆలాగే అనిచెప్పి వెళ్ళి యెంతసేపటికి రాలేదు. పాము కరచి అక్కడ పడిపోయెను. ఇంకను అన్నగారెంతసేపటికి రాలేదని ఆ చిన్నది దొడ్లోకి వెళ్ళేసరికి చెట్టుక్రింద పడిపోయిన అన్నగారుకనపడెను ఆమె తొట్రుపడుచు వెళ్ళి, అన్నా! అన్నా! అనిపిలిచి, పలకగపోగా యేడువసాగెను. ఆమె యేడుపువిని ఊళ్ళోవారందరు వచ్చిరి. అందులో ఒక ముసలిముత్తయిదువ ఆ చిన్నదానిని చూచి అమ్మాయీ! నీ విక్కడలేచి లోపలికివెళ్ళి పువ్వులతోడ, కాయలతోడ, పండ్లతోడ నున్న బచ్చలిచెట్టుతెప్పించి పూజచేసి ముత్తయిదువనకు తలంటినీళ్లు పోసి భోజనముపెట్టి వెండిబచ్చలికాయ, బంగారుబచ్చలికాయ చేయించి బంగారుపుది నీప్రుంచుకొని, వెండిబచ్చలికాయ, చీరె, రవికలగుడ్డ, బచ్చలిచెట్టు, తాంబూలము దక్షిణతోకూడ ముత్తయిదువకు వాయన మిచ్చి భోజనముపెట్టి రావమ్మా! వచ్చి నీ అన్ననులేపవమ్మా! అన్న వట. ఆమాటవిని ఆచిన్నది చటాలున లేచి ఆముసలిఅవ్వ చెప్పినట్లు చేసి మళ్ళీవచ్చి అన్నా! అని పిలిచేసరికి నిద్రనుండి లేచినట్లాతడు లేచి చూచెను. అప్పుడామె సంతోషించెను. ఇది బచ్చలిగౌరినోమమ్మా! ఇది నోచినవారికి కడుపుచలువ, తోడు నీడచలువ, పుట్టింటి చలువ, అయిదవతనము, కలుగును. అని ముసలిముత్తయిదువ చెప్పి నేను పార్వతీదేవినని చెప్పి అంతర్ధానముయిదట. ఆమె పట్టిననోము జగమందఱు పట్టిరి. ఏడాది బచ్చలి తినకూడదు. శక్తి తప్పినా భక్తి తప్ప కూడదు. అక్షతలుతప్పినా లక్ష వేలయేండ్లు అయిదవతనము. (ఉద్యాపనము కథలో చెప్పబడినది.)

## 30. ధైర్యలక్ష్మికథ.

ఒక బ్రాహ్మణునకు ఆరుగురుకొడుకులును, ఒకకూతురును కలరు. ఆకూతురత్తింట కాపురముచేయుచుండెను. ఆ సమయములో మొదటి అన్నకు పెండ్లికార్యము తలపెట్టి రావలసినదని కూతురిని తల్లిదండ్రిలు పిలిచిరి. ఆమె సరేఅని తీరా పెండ్లికి ప్రియాణమై రాబోవుచుండగా ఆమెభర్తకు ప్రాణము మీదికివచ్చెను. అందుచేత నామె ఆప్రియాణమును మానివేసెను. ఆలా అయిదురోజులు ఉన్నతరువాత పెండ్లిఅయినతరువాత ఆమెభర్త జబ్బుకుదిరి లేచెను. ఈలాగే అందరి అన్నల పెండ్లిండ్లకు ఆమె ప్రియాణము అయ్యేసరికి ఆయనకు ప్రాణముమీదికి వచ్చి క్రిందపెట్టుచుండేవారు. ఆ పెండ్లిరోజులు అయినతరువాత ఆయనకు నెమ్మదిగానుండేది. చివరకు కడసారపుఅన్నకు పెండ్లిరాగా ఆమె ప్రియాణము అయ్యేసరికి ఆయనకు మామూలుప్రికారము ప్రాణము మీదికివచ్చెను. ఆలా జబ్బుచేసినప్పటికి ఈసారి ఆమె ధైర్యము తెచ్చుకొని ఇదియేదో చిత్రముగానున్నది. ఇదిచూతము. నాధైర్యలక్ష్మియే నన్ను కాపాడగలదని ఆమెయెంచుకొని యెవ్వరితోడను జెప్పక క్రిందపారవేసిన పురుషుని చాపలోచుట్టి మూలపెట్టి తలుపులు తాళములు వేసి తిన్నగా బయలుదేరి పుట్టింటికి వచ్చుచుండెను. అంతదారిలో నొక జువ్విచెట్టు కనబడెను. ఆమె యాచెట్టువద్దకు వెళ్ళి నీవేనాపాలిటిధైర్యలక్ష్మివి. తల్లీ! నేనుతిరిగి యింటికి వచ్చేటప్పటికి నామగనికి నింపాదిగానుండిన నీకు ఏడాది పూజచేస్తానని దణ్ణముపెట్టి తిన్నగాపుట్టింటికి వెళ్ళి అన్నపెండ్లి అయినతరువాత యింటికి తిరిగివచ్చెను. వచ్చేసరికి మగడు లేచివుండెను. మిక్కిలి ఆరోగ్యముకలవానినలెనే జబ్బుయేమిలేక కులాసాగా నుండెను. నాడుమొదలు ఏడాది జువ్వెకు పూజచేసుకున్నదట. అంతట ఆమెకు సిరి, సంపద, తరగని అయిదవతనము వచ్చెను. అంతట ఇరుగుపొరుగు అమ్మలువచ్చి. ఏమమ్మా. చచ్చినపురుషుని యింట్లో

పెట్టిచక్కా పోయి వచ్చేటప్పటికి పురుషుడు లేచితిరుగుచున్నాడు ! ఏమి నోమునోచినావు ఏమివ్రతము పట్టినావు? అని అడిగినారట. అడిగితే ధైర్యలక్ష్మినోముపట్టి జువ్విచెట్టుకు పూజచేసినానమ్మా అన్నదట. ఆమె పట్టిననోము లోకమంతా పట్టిరి. శక్తితప్పినా భక్తితప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము. (ఉద్యాపనము కథలో చెప్పబడినది.)

---

## 31. చిలుకుముగ్గులనోముకథ

ఒక బ్రాహ్మణునకు సంతానము లేకపోయినది. విష్ణుమూర్తిని గురించి తపస్సుచేసినాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై అయిదవతనము లేనిఆడది కావలెనా ? ఆయుర్దాయము లేని మొగవాడుకావలెనా ? అని అడిగెను. అయిదవతనములేని ఆడుదియే కావలెనని అడిగెను. ఆప్రకారము నీకు కూతురు పుట్టునని చెప్పెను. తరువాత ఆబ్రాహ్మణునకు ఒక ఆడశిశువు కలిగెను. తలిదండ్రులు ఆపిల్లకు నారాయణమ్మ అను పేరుపెట్టి ఆమె వివాహమునుగూర్చి విచారించుచుండిరి. ఎవరూ చేసుకొన్నారుకారు తలిదండ్రులు విచారిస్తూ అడవిలోనికి వెళ్లి ఒకరాతికి పెండ్లిచేయుదమని తలచిరి. అప్పుడు అడివిలో ఒకకృష్ణవిగ్రహము కనబడగా దానికివివాహము చేసిరి. ఆవిగ్రహము బద్దలై పిండిఅయిపోయెను. అప్పుడాచిన్నది విచారించుచు ఊళ్లోకివచ్చి విష్ణుమూర్తిని గురించి తపస్సుచేస్తూ ఉండేది. కొన్నాళ్ళకు తలిదండ్రులు చనిపోయిరి. ఆచిన్నది రోజూ తపస్సుచేస్తూ యెవరికీ యేమీపెట్టకుండా, నాయింటికి రాకండి నారాయణ, నన్నెవరు అడగకండినారాయణ, అని అంటూవుండేది. అందరూ ఆచిన్న దానిని యిలోనారాయణమ్మ అని పేరు పెట్టిరి కొన్నాళ్ళకు ఆమెకు అవసానకాలమువచ్చెను. అప్పుడు నారా

యణమూర్తి కాకి అయివచ్చి కావుకావుమని అరుచుచుండెను. అందు కామె కోపగించి అలుకుతూవున్న అలుకుగుడ్డ పుచ్చుకొని కొట్టెను. విష్ణుమూర్తి ఆగుడ్డపుచ్చుకొని వెళ్ళగా అంతలో ఒకకందిగింజ దొర కెను. ఆగింజమొలవైచెను. అదిమొలచి చెట్టుఅయ్యేసరికి నారాయ ణమ్మ చనిపోయెను. అప్పుడు విష్ణుమూర్తి దానినితీసుకొనిపోయి అలు కుగుడ్డ కట్టుకోయిచ్చి ఆచెట్టుక్రింద వుండమనిచెప్పెను. అందుకాచి న్నది విచారిస్తూ నేనునీకు భక్తురాలిని. సన్నిట్లు చెయ్యవచ్చునా? అని అడుగగా, నీవు యెవరికి దానధర్మాలు చేసుకోలేదు. అందుచేత నీకు యిట్లుతటస్థించినదని చెప్పెను. ఆచిన్నది పురుగై ఆచెట్టుమీద కొన్నా ళ్ళువుండగా తిరుగవిష్ణుమూర్తి ప్రత్యక్షమై నాభార్య చిలుకుముగ్గుల నోముపట్టును. అప్పుడునిన్ను పిలుచుటకువచ్చును. అప్పుడు ఒకబిం దువు నాకుధారపోస్తే వస్తానని చెప్పుము. అప్పుడు నీకు మేలు కలు గుతుందని చెప్పెను. ఆప్రకారము లక్ష్మీదేవి చిలుకుముగ్గులనోముపట్టి యీ యిలోనారాయణమ్మను పిలుచుటకువచ్చెను. అప్పుడు విష్ణు మూర్తిమహిమవల్ల ఆచిన్నది దివ్యవిగ్రహమై ఒకయింట్లోవుండెను అప్పుడు లక్ష్మీదేవి అమ్మాయి! నేను చిలుకుముగ్గుల నోముపట్టెదను. రావలసినదని కోరెను. అందుకాచిన్నది అమ్మా! నాకొక బిందువు. ధారబోస్తే వస్తాను లేకపోతే రానని చెప్పెను. ఆ ప్రకారం ధారపో సెదనని లక్ష్మీదేవిచెప్పెను. అప్పుడు ఆచిన్నదానిని తీసుకొనివచ్చి చిలు కుముగ్గుల నోముపట్టి చిలుకుతొక్కి ఒక బిందువు ఆచిన్నదానికి ధార బోసెను. అప్పుడు ఆచిన్నదానికి సమస్తదోషములుపోయెను. అప్పుడు విష్ణుమూర్తి నీకు ఏమికావలెనని అడుగగా నాకు నీ పాదసేవకంటె ఏమీ అక్కరలేదని చెప్పెను. లక్ష్మీదేవి ఆమెకు ఎప్పుడు అయిదవ తనము వుండేలాగు వరమిచ్చెను నారాయణమూర్తి ఆచిన్నదానిని ఎప్పుడు తనస్వర్గములో సుఖముగానుండుటకు సెలవిచ్చెను. ఈనోము

నోచుకొన్నవాళ్లకున్ను, భోజనానికి వెళ్ళినవాళ్ళకున్ను, నిత్యసువాసినీత్వము కలిగి నిత్యైశ్వర్యము కలుగునని విష్ణుమూర్తి చెప్పెను.

దీనికి ఉద్యాపనము:— ఈనోము అయిదేళ్ళునోచుకొని అయిదోసంవత్సరమున గాని లేక అయిదేళ్ళలోగా గాని అయిదుమానికల బియ్యము చలిమిడిచేసి అడ్డెడుతన్వెడు బియ్యము అప్పాలుచేసి శక్త్యానుసారముగా అయిదుగురు ముత్తైదువలకు పదిహేనుగురు బ్రాహ్మణులకు పదిహేను కలశలు పదిహేను అంగవస్త్రములు, ముత్తైదువలకు చీరలు, రవికలగుడ్డలు ఇచ్చి, భోజనముపెట్టి, దక్షిణ, తాంబూలముఇచ్చి ఉద్యాపనముచేసుకోవలెను. శక్త్యానుసారము ఏటా సంతర్పణచేసుకోవలెను. భక్తితప్పినా ఫలముతప్పదు. కథలోపమయినా వ్రతలోపముకాగూడదు.

---

## చిలుకుముగ్గుల నోముకథ.

(మరియొక విధము)

తలగ తలగ యేమిబుట్టె: నందిరాయుడింట పెరగగా తలగ తలగ యేమిబుట్టె? పందిబుట్టె. పంది పరమేశ్వరుడింటపెరగగా తలగ తలగ యేమిబుట్టె? దోమబుట్టె. దోమ దొడ్లో పెరగగా పన్నెండు కొమ్మల పన్నెండుఆకుల తులసమ్మపుట్టె. ఆయుస్సులేని చిన్నవాడు కావలెనా ? అయిదవతనములేని ఆడదికావలెనా? అయిదవతనములేని ఆడది అయితే మాయింటనయినా పడియుంటుంది. ఆయువులేనికుమారుడెందుకు ? అయిదవతనములేని కూతురునేయిమ్మని అడుగగా పార్వతీపరమేశ్వరులు భూమి పాలించవచ్చి ఆలాగే కలుగుతుంది అని వరమిచ్చిరి. కుమార్తెకలిగినది కుమార్తెకలిగితే ఏచిన్నవానికి యిస్తునా అని చూస్తూన్నాను. ఎవరికియిచ్చి చేసినా చచ్చిపోతాడు గదాయని పర్వతునికియిచ్చి పెండ్లిచేసెను. ఆధాతికిచ్చి పెళ్ళిచేస్తే ఆరాయికూడా

బద్ధలయి పోయెను. ఒకపుణ్యాత్మురాలు చిలుకుముగ్గులనోము పట్టింది. నోముపడితే నోచిననోము నాకు ధారాగతం చెయ్యవమ్మా యన్నది. పార్వతీపరమేశ్వరులదగ్గరకువెళ్ళియడిగింది. నోచిననోమును చేసుకున్న పెనిమిటిని ధారాగతముచేస్తారా? యెక్కడయినాకద్దా? అంది. బిందువులు ధారాగతం చేసింది. విధవకు ధారాగతం చేయవలసి వచ్చింది యేమిటని కొన్నిసేళ్ళుధారాగతంచేసింది. అప్పుడు పన్నెండేండ్లబాలా కొమార్తె యయినది. ఈ బిందువులు పడితేనే అయిదోతనంవచ్చింది. ఈనోము పడితే ఎంతఫలమో యని అయిదుశేర్ల పిండితెచ్చి చలిమిడిచేసి అయిదేళ్ళు చిలుకులొక్కొక్క బ్రాహ్మణున కొకముద్దభక్తితో యిచ్చి తనపాలిముద్దలో పాలు నెయ్యి పోసి అందరికి పంచిపెట్టి అయిదుగురు ముత్తయిదువలకు అయిదుగురు బ్రాహ్మణులకు భోజనము పెట్టి యథావిధిగా అలా ఐదేళ్ళు నోము నోచుకొని అయిదో యేడు వచేటప్పటికి పదిహేను మండపాలు, పదిహేను వత్తులు, పదిహేను ముగ్గులు పెట్టుకొని అయిదేళ్ళుచేసి అయిదోయేడు పూర్తి అయ్యేటప్పడికి పదిహేను కలశాలు, పదిహేను వత్తులు దీపములు, పదిహేను ముగ్గులుపెట్టి ఉద్యాపనంచేసింది. కథ లోపమయినా వ్రతలోపము కారాదు. భక్తి తప్పినా ఫలముతప్పదు.

ఉద్యాపనము:—పదిహేను కలశాలు, పదిహేను వత్తుల దీపములు, పంచముగ్గులు, పదిహేను బ్రాహ్మణులకు అపుపోసనము వడ్డించి వెండి తులసికోట భమిడి తులసికోట అయిదు మానికలు బియ్యం మండపము ఏర్పరచి పూజచేసుకొని ఒక బ్రాహ్మణునకు దానమియ్యవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలముతప్పదు.

---

## 32. సావిత్రిగౌరిదేవికథ.

(బొమ్మలనోము)

అనగనగా పార్వతీదేవి మూడుపండుగులు వెళ్ళిన ముక్కనుప్పు నాడు శివునితోటి యీభూలోకంమీద అష్టఐశ్వర్యంబులు పొందే టటువంటి ఒక వ్రతము చెప్పుమని యడిగెను. శివుడు చెప్పదొడగెను. ఏమనగా మూడుదోష్టపేడ చేసి మూడుకదుళ్ళ నూలు పోసుకొని పది మంది పేరంటాళ్ళను పోగుచేసి వ్రతము చెయ్యుమని చెప్పెను. పుట్టిన రోజు పులగం నైవేద్యముపెట్టి భూచక్రం ఏలెను. రెండవరోజున చలిమిడి నైవేద్యంపెట్టి చల్లని చంద్రుడు తోడబుట్టింది. మూడవ రోజున ముట్టెలు నైవేద్యముపెట్టి ముద్దునా గారానా పెరిగింది. నాల్గవరోజున నానబియ్యం నైవేద్యంపెట్టి నాగప్పసాని అయింది. అయిదవనాడు పరమాన్నము నైవేద్యముపెట్టి సేగిలేని మనువుకోరింది. ఆరవరోజున గారెలు నైవేద్యముపెట్టి గౌరాబమ్మను తోడబుట్టింది. ఏడవనాడుఅట్లు నైవేద్యముపెట్టి పట్టితల్లి అయింది. యెనిమిదవనాడు బూరెలు నైవేద్యముపెట్టి భూమంతా ఏలింది. తొమ్మిదవనాడు పెరుగు పేరినెయ్యి నైవేద్యముపెట్టి పాతాళం ఏలింది. కథ లోపమయినా వ్రతలోపము కారాదు. భక్తితప్పినా ఫలము తప్పదు. వాకుతప్పినా వ్రతము తప్ప రాదు.

ఉద్యాపనము:—తొమ్మిదిచేటలు, చేటఒక్కంటికి తొమ్మిదేసి బిళ్లకుడుములు, తొమ్మిది లక్కజోళ్ళు, తొమ్మిది నల్లపూసలు కోళ్ళు తొమ్మిది ఆకులు, తొమ్మిదిచెక్కలు, పెట్టి తొమ్మండుగురు ముత్తయిదువులకు యివ్వవలెను.

ద్వితీయభాగము.

సంపూర్ణము.



శ్రీరామచంద్ర

# స్త్రీలవ్రతకథలు.

—:0:—

## తృతీయభాగము

### 1. అన్నముముట్టని ఆదివారాలనోముకథ

"కైలాసగిరిమీద గంగాధరులను, పార్వతివేడుకొని పలికెనొక పలుకు. నెలనెల యీనిష్ఠనియమంబుగాను, కాంతలు దూరమై కడనుండుటేమి? అని పార్వతమ్మడుగ హరుడు సమ్మతిని, చెప్పెనీకథనిట్లు చిత్రమ్ముగాను. వృత్రాసురునిజంపి సుత్రాముడపుడు, బ్రహ్మహత్యాదోషాన బాధపడుచుండె. బ్రహ్మహత్యాదోషాన బాధపడలేక, యింద్రుడు యజ్ఞంబు తెన్నేనిచేసి, శ్రీమహావిష్ణువునుచేరి ప్రార్థింప, పంచిరిబ్రహ్మహత్య భాగాలుగాను. మొదటిభాగంబును భూదేవికిచ్చె, రెండవ భాగమ్ము వృక్షాలకిచ్చె, మూడవభాగమ్ము ముక్తినొందింప, జగములకిత్తునని జగదీసుడనెను. నాలుగవభాగమ్ము నాతులకిచ్చె, కాంతలు దూరమై కడనుందురిదియె. ఈయంటుగలుపువారెవ్వరికైన, పాపము దేహాన ప్రత్యక్షమగును. శ్రీగణపతి నిన్ను చిత్తానదలతు, తలచెదను మ్రొక్కెదను దైవాధినాథ. ఈశ్వరపుత్రుండు నేకదంతుండు, వాకుశుద్ధిగాను వరమప్పుడొసగె, శోభితులగుచున్న సూర్యభగవానుల, పాదాలపూజింతు పైడిపుష్పాల, పంచనవరత్నాల బంగారు పూల, భక్తితో పూజింతు బాలభాస్కరుల. పునుగుజవ్వాది చందనము కస్తూరి, పరిమళగంధాన భక్తిబూజింతు. ఈరీతిగా పూజలెల్లకాలమ్ము, ముగుదలు

చేయవలె మూడువేళలను. ప్రజలసంరక్షణకు బాలభాస్కరులు, వనిత లకు దానొక్క వ్రతము గావించె, పణతులకు దానొక్కపాట గావించె ధరమీదవెలయగా తరుణులుపాడ, అన్నముముట్టని యాదివారమ్ము, వ్రతమొక్కవిధముగా వర్ణించిచెప్పె.

వేదశాస్త్రంబులకు విప్రుండుతాను, అఖిలగుణసంపన్ను డాసో మయాజి. పుత్రులేడుగురును, పుత్రికలిద్దరును, శృంగార పుత్రిక చిన్ని కొమార్తె. అంగనతానుండె నత్తవారింట, అమావాస్యపున్నమ లవిగ డవకుండ, భాండవిదూరమై పణతి కడనుండు, నట్టికష్టంబు తానతివ పొందుచును, తనయ లజ్జించి తనతండ్రి కెరిగించె, ముద్దుకూతునుగాంచి మోహమునతండ్రి, చింతించి తనయకు జెప్పెనొకబుద్ధి, అమావాస్య పూర్ణిమలంట బనిలేదు, పున్నమనెలజేసి పొలతికడనుండు. ఆతండ్రి పల్కులకు నతివహర్షించి, ఉల్లాసమునపొంగె నుత్పలగంధి తండ్రి వాక్యముబట్టి తానడుపుచుండె, నింతికి దేహంబు వింతమైతోచె. పాప ముదేహాన ప్రత్యక్షమాయె, అతివ తనయ త్రింట నతిక్లేశపడుచు, నెట్టు లోదినములు నెట్టుచుండగను, తండ్రి తోడ్కొనివచ్చె తల్లిపోషించె. చెప్పినపాపాలు చెడనిపదవాయె, అధికరోగిష్ఠాయె నాసోమయాజి. పూర్వజన్మమునందు పుణ్యమ్ముచేసి, ఈలోకమందు దా నీ జన్మమందు, బాలభాస్కరులకు భక్తుడైయుండె, వచ్చి సూర్యాకృతికి వందనము చేసి, చెప్పె వృత్తాంతమ్ము చిత్తగింపంగ, శరణన్నవారిని గరుణచే కొం డ్రు, మమ్మురక్షింతురని నమ్మితినిదేవ. అజ్ఞానకృతములైనట్టి పాపాల, అతిరోగినై తిననె నా సోమయాజి. విష్ణుభక్తుండిట్లు విన్నపముసేయ, సూర్యభగవాన్లతనిజూచి యిట్లనెను. చూడు మనగ్రామాన సోమి దేవమ్మ, సకలధర్మంబుల సర్వజ్ఞురాలు, పతికిమారాడని పతివ్రతల మిన్న, పరులదయతోగాంచు వరపుణ్యశాలిని, మున్నూటయరువది ముఖ్యవ్రతములు, అన్నిటిని గావించె నాభక్తురాలు. మమ్ముబూజించు

నామగువ యేప్రొద్దు, మాకిష్టురాలైన మాభర్తురాలు, మాసేవలోన రింప మరవదెన్నటికి, మాకు బ్రియురాలైన మాభర్తురాలు, అన్నము ముట్టని యాదివారమ్ము, వ్రితముసేయుచునుండు వనితసద్భక్తి. వనిత యింటికిబోయి వారమ్ముఫలము, అడిగితెచ్చుకొనిన ఆరోగ్యమనెను. భాస్కరుని యాజ్ఞవిని బ్రాహ్మణుండనెను, నన్నుజూచిన వారు నవ్వ దురుదేవ. చేరనీరెవ్వరు సీమలోపలికి, బ్రాహ్మణుడిటుపల్క భాస్కరుండనెను. అంగలార్పకుమయ్య అంగళ్ళనుండు, ప్రియముగలవారిచే బిలిపింతునిన్ను. వ్రితముచేసెను నాడు వనిత పట్నాన, అక్షతలిప్పించె నతివ విప్రులకు, పిలిపించె బ్రాహ్మణుల ప్రీతితోడుతను, పీటలు పెట్టించె ప్రియముమీరగను, నూటముప్పదిమూడు నేతిబూరెలను, తామ్రిపాత్రిలయందు దనరగానుంచి, వస్త్రప్రతిమలుంచి వాయనాలుంచి, పన్నిద్దరుబ్రాహ్మణుల పరికింపగాను, భక్తితో పన్నిద్దరు బ్రాహ్మణోత్తముల, లెక్కకొకబ్రాహ్మణుడు తక్కువైయుండె. కడు శీఘ్రిమేగి యంగడివీధివెదకి, వృద్ధబ్రాహ్మణుజూచి వినయమ్ముతోను, తగుప్రీతితోడ నాతనిదోడితెచ్చి, భగవానుడేవచ్చె బ్రాహ్మణుండనుచు, వ్రితసాంతమాయెనని వనితయుప్పొంగె, పీటలుపెట్టించె ప్రియముతోడుతను, అరటాకులుపరచిరందమ్ముమీర, కలికిపాత్రిమ్ములు గడువేడ్కనిడిరి. పాత్రాభికారాలు భక్తిగానిడిరి, పంక్తిపంక్తికి నుప్పు నడ్డించిరపుడు, వడ్డింపవచ్చెదావనితవేడుకను, పంచభక్ష్యమ్ములు పాయసాన్నములు, తెచ్చివడ్డించిరి దివ్యాన్నములును, కందయును జేమయును గాయగూరలును, మండిగలు నవరసపు బిండివంటలును, ఊరుగాయలు మంచిచారు ధప్పళము, ఆవపచ్చడులతో నప్పడమ్ములతో, అచ్చావునేతులు నాగట్టిపెరుగు, ఔపోసనముబట్టు నా సమయమందు, వినయాన సోమయాజి విన్నపముచేసె. వనిత నీవ్రతమొక్క వారమ్ము ఫలము, దయచేయుమమ్మ నేదానపాత్రుడను. అని బ్రాహ్మణుడు

కల్కా నాశ్చర్యమంది, అతివ తానిట్టులనె సందరనుజూచి, ఇదియేమి యాశ్చర్య మిదివింటిరయ్యా, ధనధాన్యవస్తువుల దానమడుగుదురు. వ్రత ఫలములడుగుదురె వచ్చినవారు, వెలదిమాటలువిని విప్రులిట్లనెను. అధికరోగిని గనుక నడిగితినితల్లి, రక్షించి వరమిమ్మ రక్షింపుమనెను. అంతలోవచ్చిరి అతివకొమాళ్లు, పిన్నపెద్దలుగూడి ప్రియమాడిరపుడు. అవతరించి భగవానులాసమయమందు, తరుణిచే వారఫలం ధారవో యించె. కడిపుచ్చుకోగానె కదలెపాపాలు, వజ్రకాంతులు దేరివచ్చె దేహమ్మ, సూర్యకాంతులమీరి శోభిల్లెతనువు, చంద్రకాంతులదేరి దొరొప్పెమేను, అందరునుగని మోహమంది రాజనులు, అంత సంతో షించి రావిప్రులంత. ఆరగించిలేచి రతిశీఘ్రముగను, ఆరగించినవారి హస్తములకెల్ల వాసించు నుదకముల వారవోయించె, విప్రులకు గప్పూ రపు విడియమ్ములిచ్చె. సంపూర్ణదక్షిణలు చాలగానిచ్చి, భక్తితో మొక్కెను బ్రాహ్మణులకపుడు, చేతులుగడిగిరి చిరుతళ్ళనొత్తి చేరి కూర్చుండిరి చిరుచాపమీద. అతిశీఘ్రముగవచ్చి యాసోమయాజి, తల్లి నీవ్రతముచే ధన్యుండనైతి, ఈవ్రతము నేనెట్లు లాచరించెదను, అన సోమిదేవమ్మ యాతనికిబలికె, మంచి ముఖ్యమైన మాఘమాసాన, అయినపున్నమినాడు నాదివారాన, మజ్జనంబులనాడి మడతలనుగట్టి, నీమమ్మతో భక్తి నెలతలెల్లరును, గోమయముతోసరుగు కొమరొప్ప నలికి, పండ్రెండు పద్మాలు పంచవన్నెలును, నిలిపి మండపమును నెలతలుంచెదరు, కార్యసిద్ధికొఱకు గణపతినిదలంచి, ఘనముగా సరస్వ తిని కాంతలుపూజింతురి. పండ్రెండుస్నానాలు భానునకుజేసి, పట్టు పీతాంబరము భానునకుగట్టి, సకలోపచారాల స్వామిబూజించి, అవుపాలపొంగ లమరంగబెట్టి, ఆదినారాయణున కర్పితముచేసి, ఉద్యా పన సాంతమ్ము నొప్పుతోవినుడి. నూటముప్పదిమూడు నేతిబూరెలను, తామరపాత్రలలోన దసరంగనుంచి, వస్త్రప్రతిమలుంచి వాయనా

లుంచి, సంపూర్ణదక్షిణలు చాలంగనుంచి, పన్నిద్దరు బ్రాహ్మణులకు భక్తితోనొసగ, వ్రతసాంగమగునని వైభవమ్మునను, అతివృద్ధులైనట్టి యతివలకునెల్ల, ఏణ్ణర్థమీవ్రతము హితమొప్పనననేను, ముట్టంటునగునట్టి ముగుదలకునెల్ల, మూడెండ్లకీవ్రతము ముగియుననిచెప్పె. ఆచరింపగలేని యతివలకునెల్ల, పాటగానీకథ పఠియింపవలెను. పఠియింపలేనట్టి పడతులకునెల్ల, పాపము దేహాన పరిత్యక్తమగును. అనిన సంతోషించి యాసోమయాజి, తగు శీఘ్రమున దన నగరికేతెంచి, ముద్దుకూతురిచేత మురిపమున దండి, వ్రతము చేయించె కడువైభవమ్మునను, వ్రతము చేసినవెన్క వనితపుణ్యాన, వజ్రకాంతులుదేరి వచ్చెదేహమ్ము, సూర్యకాంతులదేరి శోభిల్లెతనువు, చంద్రకాంతులదేరి సౌందర్యమెసగె."

అందఱుజూచి ముదమందిరిజనులు,
అపుగూటకువచ్చి రా యతినందఱురు
పాటకంఠతబట్ట భాగ్యమ్మువినుము,
వరపుత్రి లక్ష్మక్క వరుసతోవినుము,
కనక గోదానమ్ము కన్యదానమ్ము,
సర్వక్రతుదానమ్ము సలిపినఫలము,
కృష్ణజయ! కృష్ణజయ! కృష్ణమ్మదలతు,
ఇష్టసంపదలు మాకిచ్చిరక్షించు,
రామజయ! రామజయ! రఘురాముదలతు,
నానాటిపాపములు నాశనముచేయు.

---

## 2. ములగగౌరినోముకథ.

"ములగ ములగనరాము - ములగనుజూపరాము,
ములగనీడదొక్కరాము - ములగముట్టరాము - ములగదినరాము"

ఈకథచెప్పుకొని రథసప్తమినాడైనను, మాఘపూర్ణిమనాడైనను, అక్షతలువేసికొని యేడాది యీవ్రతము జరుపవలెను. ఈవ్రతము చేసిన యతివకు అతులైశ్వర్యము నైదువతనము గలుగును.

ఉద్యాపనము:—పండ్రెండుజోడాల ములగకాడలుంచి, దక్షిణ తాంబూలమునుంచి, లక్కజోళ్లు, నల్లపూసలకోళ్లుఉంచి, ఈవిధముగా పండ్రెండుగురు ముత్తైదువలకు వాయనమియ్యవలెను. ఒక్కొక్క వాయనములో పండ్రెండేసి జోడాలు ములగకాయలుంచవలెను కథలోపమయినా వ్రతలోపముకాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

---

### 3. అంగరాగాలనోముకథ.

అంగరాగాలు నోచిన అంగన, అంగరాగాలతో, అసమానరత్న భూషణములతో, అఖండైశ్వర్యముతో, అమితశృంగారముతో, అనంత సంతానముతో, అతిపాడిపంటలతో, ఆపదలెఱుగని యానందముతో ఆలుమగలయేకీభావముతో, అఖిలసుగుణసంపత్తితో, అనంతకాలము ఇహసుఖము లనుభవించి, అక్షయలోకాలు పొందుచున్నది.

ఈకథచెప్పుకొని అక్షతలు వేసికొనవలెను.

దీనికి ఉద్యాపనము:—అయిదు బొట్టుపెట్టెలు చేయించి, ఆయైదుబొట్టుపెట్టెలలోను బొట్టుపెట్టెసామానులు వారివారి శక్త్యను సారముగానుంచి, (కాటుకకాయలు. కుంకుమబరిణెలు నల్లపూసల కోళ్లు, అత్తరులు, పన్నీరు, గంధపుచెక్కలు, దువ్వెనలు, సవరాలు, అగురుండలు, బంగారుపువ్వులుగాని, గులాబి మొదలగుపువ్వులుగాని, యుంచి, సబ్బుబిళ్ళలుంచి శక్తిగలవారింకను వారి వారి శక్త్యనుసార ముగా ముక్కుపుడుకలు, కానులు మొదలగునవి, రవికెలు చీరెలు మొదలగునవియు నుంచవచ్చును.) ఈవిధముగా మంచిగంధము మల్లె

పువ్వులు మొదలగునవివుంచి మైదుబొట్టుపెట్టెలు, దక్షిణ తాంబూలములతో ఐదుగురుముత్తైదువలకు సమర్పింపవలయును. శక్తిగలవారు పేరంటాండ్రకు తలలంటి భోజనముపెట్టవలెను. కథలోపమయినా వ్రతలోపముకాకూడదు భక్తితప్పినా ఫలముతప్పదు

---

## 4. అమావాస్యా సోమవారముల నోముకథ.

ఒకానొక బ్రాహ్మణునికి ఏడుగురుకొడుకులు ఒక్కతే కూతురునుగలరు. ఆబ్రాహ్మణుని యింటిలో కోడండ్రు కూతురుగూడ, ప్రతిదినము యాయవరపుబ్రాహ్మణునకు బియ్యము పెట్టుచుండెడివారు. ఆ యాయవరపు బ్రాహ్మణుడు తనకు బియ్యమువేయుటకు వచ్చే కోడండ్రను "సౌభాగ్యవతీభవ" యనియు, కూతురుని గంగాస్నానఫలసిద్ధిరస్తు" అనియు దీవించుచుండెడివాడు. బ్రాహ్మణునికూతురు ఆబ్రాహ్మణుని దీవనవిని యొకనాడు తన తల్లిదండ్రులకు జెప్పగా వారొకరోజున బ్రాహ్మణుని ఏమని యడిగిరి. బ్రాహ్మణుడప్పుడు వారినిజూచి "ఈచిన్నదానికి సప్తపాదాలవద్దనే వైధవ్యము రానున్నది" అని చెప్పెను. అప్పుడాబాలిక తల్లిదండ్రులాబ్రాహ్మణునికి మ్రొక్కి ఆతని ప్రార్థించి "స్వామీ! ఈ దోషమెట్లు నివారణముకాగలదు" అని వినయముగా ప్రశ్నించిరి. అప్పుడు బ్రాహ్మణుడు "ఏడుసముద్రాలకావల చాకలిపోలియున్నది. ఆపోలిదగ్గరకీ బాలికను తీసికొనివెళ్ళినచో ఈదోషమది నివారణచేయగలదు" యని చెప్పెను. అప్పుడాతల్లిదండ్రులు తమ యేడ్గురు కొమాళ్లను బిలిచి మీలో నెవ్వరైన మీ చెల్లెలిని చాకలిపోలివద్దకు దీసికొనిపోవలయునని చెప్పిరి. కాని, వారి యేడుగురిపుత్రులలో కడసారపుకొడుకు మాత్రమే తల్లిదండ్రుల యాజ్ఞ శిరసావహించి ధైర్యముతో తనచెల్లెలినిఏడుసముద్రాలుదాటించి చాకలిపోలిదగ్గరకు దీసికొనివెళ్ళెదనని చెప్పెను. వారానందించి

వెంటనే వారిరువురిని ప్రయాణముచేసి పంపిరి. ఆయన్న ఆ చెల్లెలిని వెంట బెట్టుకొని సముద్రతీరమునకు వచ్చి అచ్చట నొక చెట్టునీడను నిలుచుండెను. ఆ వృక్షాగ్రమునుండి అప్పుడొక పండినపండు రాలి ఆ యన్న చెల్లెండ్రముందు పడెను. అప్పుడాపండు గైకొని వారిద్దరు చెరిసగమును భక్షించిరి. వెంటనే యావృక్షముపైనుండి యొకపక్షి దిగివచ్చి వారిరువురను దనరెక్కలపై నెక్కించుకొని సప్తసముద్రములు దాటించి చాకలిపోలి వాకిటదించి తా నంతర్థానమయ్యెను. యప్పటినుండివారు ప్రతిదినమును చాకలిపోలి వాకిలితుడిచి కలయంపులుచల్లి యలికి ముగ్గులిడి వెళ్ళిపోయి యొకబసలో భోజనములుచేయుచు కాలము గడపుచుండెడివారు. ఇట్లుండగా నొకనాడు చాకలపోలి వారినిజూచి యిదియేమి ? మీరెవ్వరు ? నాయిల్లుతుడిచి ప్రతిదినము ఇట్లు పనిచేయుచున్నా రేమిపాపమునని యడిగెను. అప్పుడు వా రామెనుజూచి అమ్మా ! నీవలన మాకొక గొప్పసాయము కావలసియున్నది. అందుచే నీకిట్లు సేవచేయుచున్నాము. యనిచెప్పిరి. చాకలిపోలి వారువచ్చిన కారణమంతయు గ్రహించి వారి కభయమిచ్చి అప్పుడు తన కోడండ్రనుజూచి, బిడ్డలారా ! నేను పనిగలిగి యొకచోటికి పోవుచున్నాను. నేను మరల వచ్చులోపల మనయింట నెవ్వరైన చచ్చిపోయినచో వారిని దహనముచేయక నేనువచ్చునందాక అట్లేయుంచి జాగ్రతగా చూచుచుండుడు యని చెప్పి యాయన్న చెల్లెండ్రను వెంటబెట్టుకొని తనయోగబలముచే వారితోగూడ ఏడుసముద్రములుదాటి వారియింటికివచ్చెను. తరువాత నామె యాచిన్నదానికి వివాహముచేయింప వివాహసమయమున సప్తపాదాలు త్రొక్కుచుండగా చిన్నదానిపెనిమిటి మరణించెను. చాకలిపోలి యప్పుడు తన అమావాస్యసోమవారముల వ్రతఫలము ధారపోసి చనిపోయిన పెండ్లికుమారుని బ్రదికించెను. అదిచూచి అక్కడివారందఱు చాకలిపోలి మహామహిమకు

మహాశ్చర్యమునొంది పరమానందభరితులైరి. కాని, చాకలిపోలి తన వ్రతఫలము ధారపోయుటచే ఆయింటివద్ద ఆమెకొడుకు లేచ్వారును చనిపోయిరి. చాకలిపోలి పెండ్లివారివద్ద సెలవుపుచ్చుకొని తనయింటికి తిరిగి వచ్చుచు దారిలో అమావాస్యాసోమవారము రాగా అశ్వత్థవృక్షమునకు ప్రదక్షిణములు గావించి అక్కడ ఫలములేమియు దొరకనందున నూటయెనిమిది గువ్వరాళ్ళుపట్టుకొని నూటయెనిమిది ప్రదక్షిణములుచేయగా ఇంటివద్ద చచ్చినయామెకొడుకు లేడుగురును మరల బ్రదికిలేచిరి. తరువాత చాకలిపోలియింటికివచ్చెను. ఆమెకోడండ్రందఱును ఆమెను చుట్టుకొని అత్తా! ఇదియేమివింత యిట్లు జరిగినదని యడిగిరి. అప్పుడు పోలి తనకోడండ్రిచే అదియంతయు అమావాస్యాసోమవారవ్రతఫలమని తెలియజెప్పి తనకోడండ్రచే యథావిధిగా నోము పట్టించెను.

ఈవ్రతవిధానమెట్లనగా:—నూటయెనిమిది అమావాస్యాసోమవారములు ఈవ్రతముచేయవలెను; అశ్వత్థవృక్షమునకు నూటయెనిమిది ప్రదక్షిణములు చేయవలెను. ప్రదక్షిణముచేయునప్పుడు "మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే! అగ్రతశ్శివరూపాయ వృక్షరాజాయతే నమః" అను మంత్రమును బఠించుచుండవలెను. నూటయెనిమిది ప్రదక్షిణములకును నూటయెనిమిది రత్నములుగాని, నూటయెనిమిది ఫలములుగాని, ఏదైన నుపయోగమైన వస్తువులుగాని, ఒకచోట వేయుచుండవలెను. ఈవిధముగా నూటయెనిమిది ప్రదక్షిణములు పూర్తియగునప్పటికి తనచేతిలోనున్న నూటయెనిమిదివస్తువులు క్రింద నొకపళ్ళెములో పెట్టివేయవలెను. అయిదుసేర్లబియ్యము అశ్వత్థవృక్షమువద్ద మండపముగాపోసి, లక్ష్మీనారాయణప్రతిమ బంగారముతో చేయించి మండపమునందుంచి, లక్ష్మీనారాయణ పూజయు అష్టదిక్పాలక పూజయు యథావిధిగాచేసి తరువాత మండపమునుత్తను

బ్రాహ్మణునకు ధారపోసి ఆనూటయెనిమిది వస్తువులను అందఱకును పంచిపెట్టవలెను. ఈవిధముగా నూటయెనిమిది అమావాస్యా సోమవారములును నోచుకొనవలెను.

దీనికిఉద్యాపనము:—నూటయెనిమిది కలశములుపెట్టి ఐదుకుంచముల బియ్యము మండపముపోసి లక్ష్మీనారాయణప్రతిమను చేయించి అష్టదిక్పాలకులను పూజించి బ్రాహ్మణునకు మండపదానముచేసి కలశలు మొదలగునవి బ్రాహ్మణులకు ముత్తయిదువలకు తక్కినవారికి పంచిపెట్టవలెను. ఈవ్రతము సిరిసంపదలను వృద్ధిచేసి కైవల్యపదవి నిచ్చుచున్నది.

---

## 5. నిత్యవిభూతినోముకథ.

ఒకానొక సోమయాజులుగారికి లేకలేక ఒకకూతురు కలిగినది. ఆమె నతిగారాము మాగారముతో అరచేతిలో వెన్నప్పములాగున పెంచి పెద్దదానినిచేసి కట్నాలిచ్చి కానుకలిచ్చి భూములిచ్చి పుణ్యాలిచ్చి, భాగ్యాలిచ్చి, అనుకూలవరునికిచ్చి సోమయాజులు గా రాబిడ్డను అతివైభవముతో పెండ్లిచేసిరి. పెండ్లిపేరంటములైన కొలదిరోజులకే పిల్ల పెద్దదైనది. అత్తవారువచ్చి అనురాగముతో కోడలిని పంపుమని కోరగానే సోమయాజులుగారు మారుమాటచెప్పలేక సోమిదేవమ్మను సమాధానపఱచి శుభకార్యానికి తగిన సన్నాహము చేయించినారు. అతివైభవముతోను, మహావైభవముతోను, అమ్మాయికి శుభముజరిగించి అత్తవారింటికి పంపిరి. అత్తవారింటిలో రాజులచేతి నిమ్మపండువలె పంజరములోని రామచిలుకలాగున, బహుముద్దుగా బ్రాహ్మణునిబిడ్డను జరుగుచున్నది. పాలునీళ్లు కలబోసినట్లు భార్యాభర్తలున్నారు. అన్నియు బాగున్నవికాని, యాపిల్లకొక బాధ పట్టుకొన్నది. కట్టినకోక నచ్చదు. పెట్టినబొట్టు కుదురదు. ఉన్నసొమ్ములుగిట్టవు. ఏమికావలెనో

మెఱుగదు. ఏదో కావలెనని బెంగ. ఉన్నదానితో తృప్తిలేదు. సంతోషములేదు ఉత్సాహములేదు. సర్వకాలసర్వావస్థలు సంతాపమే అది చూచి అత్తగారొకనాడు వియ్యంకునితో "ఇదియేమన్నా! ఈబిడ్డ విచారానికి కారణము తెలియదు. కన్నులలో పెట్టుకొని కాపాడుకొనుచున్నాము. మాకెత్తులోపము లేకుండగా మారాజుకూచిబిడ్డవలె జరుపుచున్నాము" యనిచెప్పినది. యదివిని సోమయాజులంతయు గ్రహించి బిడ్డలో అసంతుష్టిరోగము ప్రవేశించినదని తెలిసికొన్నాడు. వెంటనే ఆయన కూతురివద్దకేగి "అమ్మా! నిరంతరము సంతుష్టి—నిత్యముఐదవతనము కలిగించు నోమొకటున్నది నోచుకొనుమమ్మా!" అన్నాడు. ఇంతకంటెనున్నదా చెప్పవయ్యా తండ్రీ!" అన్నదా బిడ్డ. వెంటనే సోమయాజులు బిడ్డచే నోముపట్టించి ఉద్యాపనము చేయించినాడు. రోజు నొక ముత్తైదువకు తలదువ్వి బొట్టుపెట్టి శక్తికొలది సకలశృంగారాలుచేసి తాంబూలమిచ్చి దండముపెట్టి పంపుచు నొకయేడాదియిట్లు వ్రతమాచరించినది సోమయాజులుగారి కూతురు. యేడాదియగునప్పటికెక్కడలేని సంతోషమును ఎక్కడలేనిఆనందమును నిత్యసంతుష్టికలిగి నిర్మలానందముకలిగి, సకలభాగ్యాలుగలిగి, సంతానముగలిగి, చింతలుపోయి, చిప్పకులుపోయి, వంతలుపోయి, వాదులుపోయి, అత్తవారింటిలో అల్లారు ముద్దుగా, కన్నవారింటిలో కంటిలోపాపగా, సోమయాజులుగారి కూతురు సుఖసంతోషాల మమ్మై జగానికెల్లాసంతోషము కలిగించినది. ఆమెపట్టిననోము జగమెల్లపట్టెను. ఏడాదిలోనైనను సరే తరువాతనైనను సరే ఉద్యాపనము చేయవలెను.

ఉద్యాపనము:—ఆకులతోను పోకలతోను, అన్నిసంబారములతోను, అయిదుతాంబూలములమర్చి, శక్తిగలవారలు చీరలు, లేనివారలు రైకలునుంచి, అయిదుతాంబూలాలతో అయిదు విభూతిపండ్లుంచి శక్తికొలది కాసులో రూకలో కానులో దక్షిణలుంచి పరమే

శ్వరునిగుడిలో పార్వతిసన్నిధానమందు ఐదుగురు ముత్తైదువలను పసుపుకుంకుమలతోను, పన్నీరత్తరువులతోను, గంధకర్పూరాదులతోను, అలంకరించి పూజించి, ఆమైనుతాంబూలాల వాయనము ముత్తైదులకీయవలెను వాయనాలందుకొన్న వనితలు తాంబూలాలలోనున్నవిభూతిపండ్లనుదీసి దైవరాయడైన పరమేశ్వరునిసన్నిధి నుంచవలెను. తక్కినచీరలు, రైకలు, దక్షిణతాంబూలాలు వారు తీసుకొనవలెను. కథలోపమైనను వ్రతలోపముకారాదు. భక్తిలోపము కాకున్న ఫలలోపము కాదు. అక్షతలు తప్పినా లక్షవ్రైలెమనతపము తప్పను.

---

6. కడుపుచెదరని గౌరిదేవినోముకథ.

(దీనినే పొట్టకదలని గౌరీదేవిఅందురు.)

వేదపండితుడేకాని పేదపారుడగుటచే ఆయన కెవ్వరును పిల్లనిచ్చినారుకారు ఆబ్రాహ్మణునివిద్యయు బుద్ధియుజూచి, గుణముగౌరవముజూచి, నీమము నిష్ఠజూచి, తెలివితేటజూచి, భక్తిశ్రద్ధచూచి, పండితుడైన బ్రాహ్మణుడొకడు ఈతడే కాగలవాడని భావించి తనముద్దుకూతునిని—చక్కనిచుక్కనిచ్చి ఆకాశమంత పందిరి, భూమిదేవంత అరుగువేసి, ఆ బాలపండితునకు—ఆ పేదబాపనికి మహావైభవముతో పెండ్లిచేసినాడు. పెరిగి పెద్దదై బ్రాహ్మణునికూతురు కాపురమునకు వెళ్ళినది. పేదబాపడు పెన్నిధిదొరకె సన్తోషనందించుచు తనయిల్లే కైలాసముగాను, తనయిల్లాలే పరమేశ్వరిగాను భావించుకొనుచు పరమానందముతో కాలము గడపుచుండెను. తండ్రికి కన్యాదానఫలందక్కనిచ్చి పేదపారునకు గృహసౌఖ్యము తెలియనిచ్చి ఉన్నదోలేదో రెండవకంటివారికి తెలియకుండగా కలదానితోనే గంపెడు సంతుష్టినొందుచు, ఇరుగుపొరుగువారిలో మెరుగులుచూపుచు, శుచిగలిగి శుభ్రతగలిగి నీమముగలిగి నిష్ఠగలిగి, విద్యగలిగి, బుద్ధిగలిగి, గుణముగలిగి, గౌరవ

ముగలిగి, తెలివిగలిగి తేటగలిగి, అందముగలిగి చందముగలిగి భక్తి గలిగి శ్రద్ధగలిగి, యిల్లుదిద్దుచు అత్తమామలకు తలలో నాలుకలాగు, ఆడుబిడ్డలకు అక్కసెల్లెండ్రిలాగు, తోడికోడండ్రకు తోడునీడలాగు, ఇరుగుపొరుగువారి కిలువేల్పులాగు, భర్తకు ప్రాణాధిదేవతలాగు సోమయాజులుగారి ముద్దుకూతురు కాపురముచేయుచున్నది. ఈలాగు నసుండగా, చెలికునకు పంసుపండి నా పిల్లకు నెలతప్పినది. సకలజనులుసంతోషముతో ఆవిడ కన్నిగారాబములు జరుపుచున్నారు. రోజుకురోజు కళలుదేరుచు ఆబాల బంగారుబొమ్మలాగు, రత్నాల రామచిలుకలాగు, మెఱసిపోవుచున్నది. రెండునెలలు గడచినవి. మూడునెలలుగడచినవి నాలుగవనెల గడవకుండ నొకనాడు తగని బాధగలిగి యాపిల్లకు, గర్భమువిచ్ఛిత్తైపోయినది. అయ్యో! అని యిరుగుపొరుగువారు, అత్తింటివారు, పుట్టింటివారు, అందఱు చిన్నమొగములుచేసికొని విచారించినారు. తరువాత మందులు మాకులు వేసికొని, పిల్లనోదార్చుకొని, పోయింది పొల్లు-ఉన్నది గట్టి" అని క్రమముగా మనస్సమాధానము చేసికొన్నారు. కాని, అదియేమిపాపమో? పాలసముద్రములో విషములాగు, చంద్రునిలో మచ్చలాగు, ఆచిన్నదాని కిదొకకష్టముకలినది. అదిమొదలు సోమయాజులుగారి కూతురికి, ఏయేటికాయేడే యీలాగు గర్భములు గలుగుచు పోవుచుండెను. అందఱు విచారించుచుండిరి. అయ్యో! కన్న తల్లిదండ్రులకు కలత తెచ్చిపెట్టితిని. అత్తమామల కలసట తెచ్చిపెట్టితిని. కట్టుకొన్న బ్రాహ్మణునకు కష్టములు తెచ్చిపెట్టితిని. పండియు పొల్లయిపోవుటకు పాపమేమిచేసితినో పరమేశ్వరా! పరమేశ్వరీ! యని సోమయాజులుగారి కూతురు, ఆపురాణదంపతులను నిరంతరము ధ్యానించుకొనుచు చూచిన దైవాలకు మ్రొక్కుచు, చెప్పినదైవాలను సేవించుచు, పుణ్యచింతతో ప్రొద్దులుగడపుచుండెను. ఈలాగున నుండగా నొకనాటియుదయమున వారిం

టికొక పంపుతములపాకువంటి పేదముత్తైదువ వచ్చినది. వచ్చినయిల్లాలి కర్ఘ్యపాద్యాదులిచ్చి కూర్చుండుమనిపీటవేసి, మంచిమాటలతోమర్యాదచేసి, అమ్మా! దయగలిగి మాయింటికి దయచేసినారు. గౌరీదేవివలె కన్నులకుచల్లగా మహాలక్ష్మివలె మనసునకు హాయిగా మిమ్ములనుచూచి వదలలేకున్నాను. ఈపూట మాయింటివద్ద మాకున్న భాగ్యములారగించి మమ్ములను ధన్యులజేసి మరివెళ్ళుదువుగాని తల్లీ! నేటికాగుమమ్మా యని యామెను సోమయాజులుగారి కూతురు వేడుకొన్నది. అంతలకా యిల్లాలు సమ్మతించి, దయారసములుకు కన్నదమ్ములతోచూచి దగ్గరగాదీసికొని గారవించి, సోమయాజులుగారికూతురితో ఆలాగుననేచేతునులేవమ్మా యన్నది. ఇంటిలోనివారందఱు వచ్చి ఆఇల్లాలినాదరించిరి. భక్తిశ్రద్ధలతో వారుపెట్టిన పప్పుయన్నమే పదివేలపిండివంటలవలె భోజనముచేసి సంతుష్టవదనముతో, చల్లనిచూపులతో ఆయిల్లాలువాకిట చిరుచాపమీద కూరుచున్నది. వినయవిధేయతలతో, వేడుకలాడుచు, విడియమునుమడచియిచ్చుచు,సోమయాజులుగారికూతురు ఆమెదగ్గరనే కూర్చుండినది. సోమయాజులుగారికూతురికప్పుడు మరల నాలుగవమాసము జరుగుచున్నది. బుద్ధిమంతురాలైన పుణ్యశాలినివేగాని, భక్తిశ్రద్ధలున్న భాగ్యశాలినివేగాని, అన్నిసుఖములుగల యదృష్టశాలినివేగాని గర్భదోషమున్నట్లగపడుతున్నావు కాంతా! నిజమేనా? యని సోమరాజులుగారి కూతురి నడిగిన దాయిల్లాలు. ఆమాట వినగానే యాపిల్ల ఒడలు జల్లుమన్నది. బ్రహ్మదేవుని వదనమందలి భాషాదేవియా ? విష్ణుదేవునివక్షమందలి లక్ష్మీదేవియా ? దేవదేవుని అర్ధదేహమైన పార్వతీదేవియా ? ఎవరుచెప్పుమా యీయిల్లాలు! ఈమెను జూడగానే, యీమెమాటలువినగానే, పరవశమైపోవుచున్నాను. ఈమెపాదములు పట్టుకొనుటకు బుద్ధితొందరచేయుచున్నది. అని యనుకొని సోమయాజులుగారి కూతురిక నాగలేక యీయిల్లాలి పాద పద్మాలు

కన్నుల కద్దుకొని తల్లీ! నా పాపములుపాపి రక్షించవమ్మా! యని యామెకు ప్రార్థించినది. కడుపుచెదరని గౌరిదేవినోము పట్టవేబిడ్డా! కడుపుశోకముండదనిచెప్పి, దాని కుద్యాపనము చెప్పి యా యిల్లాలు అంతర్ధానమైనది. ఆపలుకులుశిరసావహించి,నీవేనాపాలిటిపార్వతీదేవివని యామెను మొ్రక్కుచు భక్తిశ్రద్ధలతో, ఆనోముపట్టి సోమయాజులు గారికూతురు ఉద్యాపనముచేసికొన్నది. ఆమెకడుపున పాలసముద్రము నకు బాలచంద్రునివలె బంగారువంటి కొడుకుపుట్టి బాగున్నాడు ఆ తరువాత మువ్వలవాడు కొడుకు—గజ్జెలవాడు కొడుకు—కొడుకులు తరువాత కొడుకులును—కూతుండ్రతరువాత కూతుండ్రును, పుట్టిన ఇల్లంతయు కొల్లలకొల్లలై, కమలాలకొలనై భాగ్యాలపంటై సోమ యాజులుగారికూతురు తులలేని భాగ్యభోగ్యాలతో తులతూగుచు పట్టెడుపసుపు, బుట్టెడుకుంకుమ పాయకుండ, చెదరకుండ కలకాలము సుఖముగా జీవించి కడపట కైలాసము చూరగొన్నది.

ఈకథచెప్పుకొని అక్షతలువేసుకొనుచు ఆమె నోచిననోము చామలంతానోచిరి. ఈనోము నోచినమ్మకు కడుపుశోకముండదు. కలి మికి లోటుండదు. కలకాల మైనువతనము కైలాసప్రాప్తి కలుగును. భక్తి తప్పకున్న ఫలముతప్పదు.

ఉద్యాపనము:—అయిదుమానికల బియ్యముకడిగి, వాడబెట్టి, విసరి, జిల్లేడుకాయలు వండవలెను. అందులో కొబ్బరిపూర్ణమో నువ్వుపప్పుపూర్ణమో పెట్టవలెను. అంత పిండికలిపి యిరువైయైదుకాయ లుచేసి, కజ్జికాయలు వాసెనమీదపెట్టి, వాని పొట్టలువిచ్చి పోకుండ శ్రద్ధతో వంటచేయవలెను. పొట్టవిచ్చని గౌరిదేవినోము కనుక, జిల్లే డుకాయలు పొట్టలువిచ్చి పోకుండ జాగ్రత్తగా వండవలెను అవియై దుగురుముత్తైదువలకు అయిదేసిచొప్పున దక్షిణతాంబూలములుంచి వాయనము లీయవలెను.

---

## 7. నిత్యదానమునోము కథ.

"నిత్యదానముచేత నియమంబు గలుగు
నిత్యదానముచేత నిష్ఠలు కలుగు
నిత్యదానముచేత నిధులును గలుగు
నిత్యదానముచేత సత్యంబు దొరకు.
నిత్యదానముచేత నిఖిలము లభించు
నిత్యదానముచేత నిరయము నశించు
నిత్యదానముచేత నెలతకు జూడ
నిత్యముగ వైకుంఠ సామ్రాజ్యమబ్బు"

ఈకథ చెప్పుకొని అక్షతలువేసికొని ఒక యేడాది ప్రతిదినమును బ్రాహ్మణునకు చేరెడుబియ్యము, ఒక కూరయు ఇచ్చుచుండవలెను. ఏడాదిలోపునగాని, ఆతరువాతగాని ఉద్యాపనము చేయవచ్చును.

ఉద్యాపనము:—ఎన్నితోక్కునిధాన్య మేమంగుంచెడు జాగ్రత్త పెట్టుకొని, క్రొత్తపంచెలచాపుతో శక్తికొలది దక్షిణ తాంబూలములతో, కాయకూరలతో, దుంపకూరలతో, పిండివంట సామానులతో బ్రాహ్మణునకు దానముచేయువలెను.

---

## 8 నిత్యధాన్యమునోముకథ.

ఒకానొకరాజునకు సకలైశ్వర్యములు ఉండెనుగాని, అజీర్ణరోగముతో అహర్నిశలు బాధపడుచుండెను. పాపమారాజు చిన్నమెత్తు అన్నమైన తినలేక, పండురోత, ఫలమురోత, తిండిరోత, క్షీరమురోత, ఇండ్లురోత, వాకిండ్లురోత, పెండ్లమురోత, బిడ్డలురోత, తనువురోత, తానురోత, సకలము రోతై చావలేక బ్రతుకుచున్నాడు. హితులు, పురోహితులు, మంత్రులు, సామంతులు, అందఱు జేరి యారాజుచేత మందులు మాత్రులు మింగించుచు, ఎన్నెన్నో పున్నె

ములు చేయించుచున్నారు. ఇట్లుండగా ఆరాజు పట్టణములోని కొక వృద్ధబ్రాహ్మణుడువచ్చి "పెట్టినవారికి పుట్టినదేసాక్షి." అని పెద్దపెట్టున గొంతెత్తి పాటపాడుచు, వీధులవెంట తిరుగుచుండెను. ఆబ్రాహ్మణుని కంఠమాధుర్యము గోపాలబాలుని వేణుగాన మాధుర్యములాగున్నది. గనుక ఆయూరివారందరు గోపాలకృష్ణుని గోపికలలాగున ఆ బ్రాహ్మణుని బట్టుకొని విడువక తిరుగుచున్నారు. ఈసంగతి వెంటనే మంచముమీదనున్న రాజునకు తెలిసినది. రాజాయనను తత్క్షణమే భక్తిశ్రద్ధలతో తనయొద్దకు రప్పించుకొన్నాడు. బ్రాహ్మణుడును దేదీప్యమానముగా నున్న అగ్ని శిఖలాగు వెలిగిపోవుచు రాజు నెదుట రత్నపీఠముపై గూరుచుండెను. రాజునకు ఆయనను చూడగనే హృదయము ముప్పొంగిపోయినది. ఎన్నడు నెఱుగని యీ వింత సంతోషమును బొందుచు రాజు బ్రాహ్మణునిజూచి స్వామీ! ఎంతో పుణ్యము చేయుటచే మీదర్శనము నేడు నాకు దొరకినది. అని యింక నేమేమో చెప్పబోవుచుండగా ఆయన రాజునుజూచి—ఆలాగు చేసినావు కనుకనే యీలాగునచ్చినాను. అది నిజమేగాని నీపూర్వ వృత్తాంతము వినవోయి రాజా! నీవు పూర్వజన్మమున మహాధనికుడవై యుండి ఒకప్రాణి కొక పట్టెడన్నమైన పెట్టనొల్లక, ధన ధాన్యము లన్నియు, దాచిపెట్టి, మూటలగట్టి మూలలబెట్టి, మూలుగునట్లుచేసి ముసిముసిని చచ్చినావు అందుచేతనే నీకిప్పుడాభాగ్యము లన్నియు నీయెట్టయెదుట చేరి ప్రత్యక్షములై పిశాచములవలె నిన్ను పీడించుచున్నవి. పెట్టినవానికి పుట్టినదేసాక్షి. నీ వెవ్వరికి ననుభవింపబెట్టినావు కావు. కనుక నీకిప్పుడు వాని ననుభవించుట కధికారము లేదు. ఆ పాపముచేతనే యిప్పుడు బాధపడుచున్నావు. ఆపాప నివారణార్థముని సంకల్పించుకొని, నీవిప్పుడొక వ్రతముచేయుము. నిత్యము నొక బ్రాహ్మణున కొక దోసెడు ధాన్యము నొక కూరయు దానము

చేయుము. ఇట్లొక సంవత్సరము భక్తిశ్రద్ధలతో చేయుము. సంవత్స రములోపలనైనను తరువాతనైనను ఎద్దుతొక్కని ధాన్యము ఎనుబది కుంచములు పోగుచేసి, బంగారుతీగ దానిచుట్టునుజుట్టి నూతనవస్త్ర ములుంచి, కాయగూరలు, కందకూరలు, పిండివంటసరకులు, నేతిమజ్జి గలు, సువర్ణదక్షిణతో తాంబూలముంచి, ఉత్తముడు, సంపన్నగృహ స్థుడునైన వేదపారున కుద్యాపనము చేయుము. అని చెప్పియాదేవు డంతర్ధానమయ్యెను. రాజమిత్యాశ్చర్యమును పొంది హితులారా! పురోహితులారా! మంత్రులారా! సామంతులారా! చెప్పిన పుణ్యము లన్నియు చేసితిని. కనుకనే యిప్పుడు దేవుడు నాకు ప్రత్యక్ష మైనాడు. నేనిక ధన్యుడనైతిని. నాపాపములు పటాపంచలైన వని చెప్పి నిత్యధాన్యమును నోము భక్తిశ్రద్ధలతో చేసి ఉద్యాపనము కావించెను. రాజురోగము రవ్వంతైన లేకుండపోయి యాతడఖిల భోగభాగ్యముల ననుభవించెను. ఈకథచెప్పి యక్షతలు వేసుకొని యీనోము సకలజనులునోచి సఫలులైనారు. భక్తితప్పకున్న ఫలము తప్పదు.

---

## 9. ధైర్యగౌరినోము కథ.

రాజుకూతురును ప్రధానికూతురును ధైర్యగౌరినోము పట్టి నారు. రాజుకూతురు గర్వముచే నోముల్లంఘన చేసినది. ప్రధాని కూతురు భక్తి శ్రద్ధలతో నోము సాంతము చేసుకొన్నది. ఆతరువాత వారిద్దరు మరొకజన్మములో మరల రాజకూతురు ప్రధానికూతురునై పుట్టినారు. ఈబిడ్డలిద్దరు చిన్ననాటినుండియు కలసిమెలసి యాడుకొను చు గారాబముగా పెరుగుచున్నారు. ఆటలలోను పాటలలోను, అన్ని పనులలోను, మంత్రికూతురు ధైర్యముతో విజయము పొందుచుండె ను. రాజకూతునకు మాటాడుటకు భయము. ఆటలాడుటకుభయము.

పనిచేయుటకు భయము. పలుకరించుటకు భయము. ఆమె అన్ని టికి అధైర్యముగానుండెడిది. పిల్లకు చిన్నతనముగనుక ఆలాగున నున్న దని రాజును రాణియు నశ్రద్ధగావించిరి. రాచబిడ్డ పెద్దదైనది. కాని, యాజబ్బుమాత్రముపోలేదు. తల్లిదండ్రులు అత్తమామలు, భర్తబంధువులు, అందఱు ఆపిల్లకొఱకు బెంగపెట్టుకొన్నారు. పిల్ల చీటికి మాటికి ధైర్యములేక యేడ్చుచు కూర్చుండేది. లేకలేకకలిగినయీపిల్ల కీ కళంకమేమిచెపుమా యని, భార్యాభర్తలిరువురు దైవములకుమొక్కుచు తమ యాపద బాపుమని దైవమును వేడుకొను చుండేవారు. ఇట్లుండగా భక్తులమొఱవిని పరమేశ్వరు డొకనాడు ముసలిబ్రాహ్మణ వేషముతో వారింటికివచ్చెను. రాజుకూతురుదీర్ఘవిచారముతో గడగడ వణకుచు ఏడ్చుచు నొకమూల కూరుచున్నది. అదిచూచి ఆ మాయ బ్రాహ్మణు డదియేమని యడిగెను ఆమె తల్లిదండ్రులు వృత్తాంతమంతయు నాదేవునకు భక్తిశ్రద్ధలతో చెప్పుకొనిరి. అప్పుడా బ్రాహ్మణ వేషియైన పరమేశ్వరుఁడు—ఈబిడ్డకీ కష్టముతీరుటకొకవ్రతము చేయవలెను. పూర్వజన్మమందీమె ధైర్యగౌరినోముపట్టి, ఉల్లంఘనము చేసినది. అందుచే నీమె ధైర్యముచెడి యిట్లు కృశించుచున్నది. అనిచెప్పి యంతర్థానుడయ్యెను. వెంటనే రాజదంపతులును రాజకొమార్తెయు ఆశ్చర్యమగ్నులై, దేవుడు ప్రత్యక్షమై వ్రతముచెప్పినాడని తెలిసికొని భక్తితో ఆయనచెప్పినట్లువ్రతము యధావిధిగాచేసిరి. వెంటనే బాలిక సురక్షితురాలై ధైర్యస్థైర్యములుకలిగి సుఖసంతోషములతో భర్తతో గాపురముచేయుచు కడుపునిండ బిడ్డలంగాంచి, సిరిసంపదలతో తుల తూగుచు, నిత్యకల్యాణము పచ్చతోరణముతో, పదివేలేండ్లు బ్రదికి పార్వతీసాన్నిధ్యమునొందెను. ఆమెనోచిననోము భామలందరునోచి యిష్టార్థములనందిరి. భక్తితప్పకుంటె ఫలముతప్పదు.

ఉద్యాపనము:—ఈకథ చెప్పి అక్షతలువేసికొని తవ్వెడుగిద్దెడు ఆవునెయ్యి, వరాపావెత్తు భమిడిపత్తితో ఒకటేదీపముగా వెలిగించవలెను. మానెడుసోలెడు ఆవుపాలలో కావలసిన బియ్యము వేసికొని వండి నైవేద్యముపెట్టి యెవ్వరికి పెట్టకుండ భోజనము చెయ్యవలెను. దీపము కొండయెక్కేవరకు భోజనముచేయరాదు. ఈదీపము చాతుర్మాసములలో నెప్పుడైన నొకప్పుడు వెలిగించవలెను.

---

## 10. దీపదానమునోముకథ.

దీపదానము నోచినవారికి పాపాలన్నియు బాసిపోవును. దీపదానమునోచినవారికి తాపాలన్నియు మాసిపోవును. దీపదానమునోచినవారికి దివ్యపదంబు సన్నిధియగును.

ఈకథ చెప్పుకొని అక్షతలువేసికోవలెను.

ఉద్యాపనము:—ముప్పదిమూడు వెండిప్రమిదలు శక్తికొలది చేయించి, వానిలో నొక్కొక్క దీపము వెలిగించవలెను. ఈదీపము కమలవత్తులతో వెలిగింపవలెను. కమలవత్తి యనగా—పదుమూడు పోచలుకలిపినవత్తి యెనిమిదిముక్కలకిందత్రుంచి, ఆయెనిమిదిముక్కలుకలిపి, ఒక్కవత్తిగా సలపవలెను. దీనిపేరు కమలపువ్వొత్తి. ఈకమలపువ్వొత్తులు ప్రమిద కొక్కొక్కటి నొప్పున వెలిగించి దీపములు వెలుగుచుండగా, శక్తి కొలది దక్షిణతాంబూలాదులతో బ్రాహ్మణునకు దానమీయవలెను. ఈ యుద్యాపనము కార్తికమాసములో చేయవలెను.

## 11. నవగ్రహదీపాలనోముకథ.

సోమయాజులుగారికూతురొకనాడు తండ్రిదగ్గరకు వెళ్ళి, తండ్రీ! పట్టినదెల్ల బంగారమగుటకు, ముట్టినదెల్ల ముత్యమగుటకు, కోరికలెల్ల

కొనసాగుటకు, ఆరనైదువతనము చేయుటకు, కడుపుచలువగలుగుటకు ఏమినోము నోచవలెనండి! యని యడుగగా ఆయన ముద్దుల కుమార్తె యుద్దేశమునకు మెచ్చి యీనోము చెప్పినాడట: ఆమె యీనవగ్రహదీపాలనోముపట్టి ఉద్యాపనము చేసికొని, యిష్టసిద్ధులుపొందినదట.

ఉద్యాపనము:—తొమ్మిదికొత్త మండిగలు తెచ్చికొని మండిగ యొకటింటికి సేరుంబావు పోస్వనమూ నెపోసి, మండిగయొక్కంటికి వరాపావెత్తుపత్తి (అనగా, పావులాయెత్తుకట్టి, అణాయెత్తుకట్టివేసి తూచినచో వరాపావెత్తు అగును) ఏకువలెనలిపి, చమురులోముంచి, దీపము వెలిగించవలెను. నవధాన్యములు, తవ్వెడు నరసోలెడుగాని, మానెడు, సోలెడుగాని, తెచ్చుకొని, ఒక్కొక్కదీపముదగ్గర ఒక్కొక్కధాన్యపు దినుసుంచవలెను. తొమ్మిదితాంబూలములుంచి వానిలో ఒక్కొక్క పావులాచొప్పున దక్షిణయుంచవలెను. కొంచెము కొంచెముగా నవధాన్యములన్నియు గలిపి, మండిగలక్రింద కొంచెముకొంచెము పోయవలెను. విఘ్నేశ్వరపూజయు, శివునకభిషేకమును చేయించి, యీదీపములన్నియు శివాలయములోనే తొమ్మండుగురు బ్రాహ్మణులకు, ఒక్కొక్కమండిగ ఒక్కొక్కదక్షిణతాంబూలములతో నియ్యవలెను, ఇది దీనియుద్యాపనము. శక్తికొలది ఒకరికో యిద్దరికో బ్రాహ్మణులకు సమారాధనచేయవలెను. ఈనోము కార్తికమాసములో చేయవలెను.

---

## 12. పెద్దసంక్రమణదీపాలనోముకథ.

"ఎన్నిపుస్తకాలువిన్నా, ఎన్నిపురాణాలువిన్నా, అజ్ఞానాంధకారము వదలిపోకుండా ఉన్నది. ఎటుచూచినా చీకటే. ఎటుచూచినా అంధకారమే. ఏమిచేతును ? ఏమినోమునోతును.—ఏమివ్రతము చేతును చెప్పవయ్యా తండ్రీ" అని సోమయాజులుగారికూతురు తండ్రినడిగినదట. అడిగితే తండ్రి అజ్ఞానాంధకారము వదలిపోయేనోము, అం

తరంగశుద్ధిచేసేనోము, అఖండజ్యోతి నగపరిచేనోము పెద్దసంక్రమణ దీపాలుపట్టవమ్మా అన్నాడు. అప్పుడాపిల్ల ఆనోముపట్టి తండ్రిచెప్పి నట్లు ఉద్యాపనముచేసికొని ధన్యురాలై యీశ్వరునికృపచే ఇహపరా లుచూరగొన్నది.

ఉద్యాపనము:—సంక్రమణప్రవేశము కాగానే శివాలయము లోనికివెళ్లి తొలియేడు సేరునెయ్యి సేరునూనెతో రెండుదీపాలు వెలి గించవలెను. నేతిదీపమునకు భమిడిపత్తి, నూనెదీపమునకు కొండపత్తి వరాయెత్తుచొప్పున గింజదీసినపత్తివత్తులుచేసి రెండుదీపాలకు రెండు వరాయెత్తులువెలిగించవలెను దీపాలువెలిగించి శక్తికొలదిఒకరికో యిద్ద రికోఎందరికో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఈలాగున ఐదేం డ్లుదీపములు పెట్టవలెను. మొదటియేడు వరాయెత్తుపత్తి రెండవయేడు రెండువరాలెత్తు, మూడవయేడు మూడువరాలెత్తు, నాల్గవయేడు నాల్గు వరాలెత్తు ఐదవ యేడు అయిదువరాలెత్తుచొప్పునభమిడిపత్తి, కొండ పత్తి తెచ్చుకొని మొదటియేడు సేరునెయ్యి, సేరునూనె, రెండవయేడు రెండుసేర్లనెయ్యి, రెండుసేర్లనూనె, మూడవయేడుమూడుసేర్ల నెయ్యి మూడుసేర్ల నూనె, నాలుగవయేడు నాల్గుసేర్ల నెయ్యి, నాలుగుసేర్ల నూనె, అయిదవయేడు అయిదుసేర్లనెయ్యి అయిదుసేర్ల నూనెపోసి, నేతికిభమిడిపత్తి నూనెకు కొండపత్తి, వత్తులువేసి, శివాలయములో అయిదేండ్లు దీపాలు వెలిగించవలెను. ప్రతియేడుశక్తికొలది బ్రాహ్మ ణభోజనములు పెట్టవలెను. దక్షిణతాంబూలము లీయవలెను.

---

## 13. విష్ణువిదియలనోముకథ.

రాజుకూతురు బ్రాహ్మణునికూతురు విష్ణువిదియల నోముపట్టిరి. బ్రాహ్మణునికూతురు భక్తిశ్రద్ధలతో నోమునోచుకొన్నది. రాజు కూతురు రాజసముచేత నోముల్లంఘనముచేసినది. భక్తిశ్రద్ధలతో

నోముకోచుకొన్న బ్రాహ్మణబాలిక అష్టైశ్వర్యములతోను, అఖండ సౌభాగ్యములతోను, తులతూగుచున్నది. రాజసంతో ఉల్లంఘునచేసిన రాచబిడ్డ, అష్టదరిద్రులపాలై. అష్టకష్టాలనుభవించుచు, అంతమందు అట్టడవికిపోయి పార్వతీపరమేశ్వరులను ప్రార్థించుచు, తనకష్టాలకు విలపించుచుండెను. అప్పుడు పార్వతీపరమేశ్వరు లాబిడ్డయెడల దయ గలవారై ప్రత్యక్షమైనారు. అప్పుడారాచబిడ్డ అమ్మా! అయ్యా! నాకష్టా లేలాగున నివారణమగునో చెప్పుడని వారిని ప్రార్థించినది. అప్పుడు వారు అమ్మా! విష్ణువిదియలనోముపట్టి ఉల్లంఘునచేసినావు. అందుచేత నీకీకష్టాలు కలిగినవి. నీవు మరలనోముపట్టి భక్తిశ్రద్ధలతో నోచుకోవమ్మా! అని చెప్పిరి. అప్పుడామె తెలివితెచ్చుకొని చెంపలు వేసికొని మరల నోముపట్టి అక్షతలువేసుకొన్నది. శివరాత్రివెళ్ళిన విది యనాడు మొదలుపెట్టి, నెలనెలకు మరల శివరాత్రివచ్చువరకు పదు మూడు విదియలును, ప్రాద్దుననే లేచి స్నానముచేసి పార్వతీపరమేశ్వ రులను లక్ష్మీనారాయణులను పూజించి తరువాత, ఎడచేర పెడచేర బియ్యముపోసి, అత్తిసరు వేసికొని, ఆయన్నము పెరుగు అరటిపండ్లు నై వేద్యముపెట్టి ఎవ్వరితోను మాటలాడకుండ, ఆయన్నము, పండ్లు, పెరుగుతినవలెను. ఇంకేమీ తినరాదు.

ఉద్యాపనము:—పీసేబులముపసుపు ఎదుటి మనిషితో మాటా డకుండ కంగాముంగాదంచి పదమూడు వెదురుపెట్టెలలోపోసి, ఆపెట్టె లలో పదుమూడులక్కజోళ్లు, పదుమూడు నల్లపూసలకోళ్లు, పదుమూ డుకుంకుమపొట్లాలు, పదుమూడురవికెలగుడ్డలు, పదుమూడు దక్షిణ తాంబూలాలుఉంచి, దేవీ దేవరలకు నివేదనముచేసి అందులో ఒక పెట్టె మహాలక్ష్మీపెట్టెయని, తానుంచుకొని, తక్కినపండ్రెండుపెట్టెలు పండ్రెండుగురు ముత్తైదువలకు దక్షిణతాంబూలాలతో వాయనమి య్యవలెను. కథలోపమైనా వ్రతలోపముకారాదు. భక్తితప్పినా ఫల ముతప్పదు. అక్షతలుతప్పినా లక్షవేలైదువతనము తప్పదు.

---

## 14. నెలసంక్రమణ దీపాలనోముకథ.

నెలసంక్రమణంనోచిన నెలతకు నెలలూవెలుగులే, పక్షాలూ వెలుగులే, వారాలూవెలుగులే, తిథులూవెలుగులే, ఋతువులూ వెలుగులే, సంవత్సరాలూ వెలుగులే, యుగాలూవెలుగులే, జగాలూ వెలుగులే, కళ్ళవెలుగుతోను, కడుపుచలువతోను, కలకాల సౌదువతనముతోను కైలాసప్రాప్తి యగును.

ఈకథ చెప్పుకొని అక్షతలువేసికొనవలెను.

ఉద్యాపనము:—నెలనెలకువచ్చే నెలసంక్రమణమునాడు ఒక వరహాపావెత్తు కొండవత్తి, సేరుంబావుసూనె దీపారాధనము చేయవలెను. దీపము కొండయెక్కేవరకు భోజనముచేయరాదు. ఈలాగున నొకయేడాది నోచవలెను. నెలనెలకు ఒక బ్రాహ్మణునికి భోజనము పెట్టి దక్షిణ తాంబూలము లీయవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

---

## 15. కైలాస గౌరినోముకథ.

ఒక మహారాజు లేకలేకపుట్టిన తనకూతురిని రతీదేవివంటి చక్కనిచుక్కను, అతిగారాముతోను, మాగారముతోను పెంచి పెద్దదానిని చేసి పదునారేండ్ల ప్రాయమువచ్చిన తరువాత మన్మథునిబోలిన మహారాజు కొడుకనికిచ్చి అఖండవైభవముతో వివాహముచేసినాడు. కాని యాచిన్నదానిపెనిమిటి యాచిన్నదాని మోమెప్పుడు చూడకుండా వారకాంతల యిండ్లలోనే అహోరాత్రములు గడుపుచున్నాడు. బాలికామణి భర్తకొఱకు మనోవ్యాధితో మంచముపట్టి పగలురాత్రి పార్వతీపరమేశ్వరులను ప్రార్థించుచు, కైలాసములో పార్వతీపరమేశ్వరులలాగు, వైకుంఠములో లక్ష్మినారాయణులలాగు, సత్యలోకములో సరస్వతీబ్రహ్మలలాగు, మేమెప్పుడు ఒకరినొకరు ఎడబాయకుండ

ను?దేనోము—సకలసుఖాలు పొందేనోము—నోచచెయ్యండని వేడు కొనుచుండేది. ఉండగా నుండగా కొన్నాళ్ళకు, పార్వతీదేవి యా పడుచు కలలోకివచ్చి కైలాసగౌరీనోము నోచవేకాంతా గౌరీశంకరుల లాగు, లక్ష్మీనారాయణులలాగు, వాణీవిధాతలలాగు, సకల సౌభాగ్యా లతో స్వామీ నీవు ఏకమై సంతానభాగ్యములతో ఇంతులలో మేలు బంతివౌదువని ఆనతిచ్చెను. కలగాంచి వెంటనే తెలివొంది గౌరీదేవికి కడుభక్తితో మ్రొక్కుకొని, రాజుకూతురు కైలాసగౌరీనోముపట్టి ఉద్యాపనముచేసికొన్నది. ఆమెభర్త వెంటనే ఆటవెలదులను వదలి అత్యనురాగముతో వచ్చి తన యిల్లాలి నాదరించి, యిల్లాలితో చిర కాల మిహాపరము లనుభవించినాడు. ఆమె నోచిననోము అందరు కాంతలు నోచినారు. భక్తితప్పినా ఫలముతప్పదు. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. అక్షతలు తప్పినా అయిదువేళ్లు అయిదువ తనము తప్పదు.

ఉద్యాపనము:—అయిదు కుంచముల కుంకము, ఐదు కుంచ ముల పసుపు, అందుకు సరిపోయినపండ్లు పార్వతీదేవి గుడిలోనో పర్వదినాలలో గంగాది నదులతీరముననో, ఉంచుకొని, యాపండ్లు పసుపు, కుంకుమ ముత్తైదువలకు, చేరడు చేరడుచొప్పున పంచిపెట్ట వలెను. పంచిపెట్టుట సమాప్తియగు వరకును మాట్లాడరాదు.

---

16. చల్లచిత్తనోముకథ

"చల్లచిత్తనోము నోచవేతల్లీ!
వెల్లయావులపాడి చేయవేతల్లీ!
ఇల్లు పాలనేత నలుకవేతల్లీ!
ఎల్లసొమ్ములు నీవె తాల్చవేతల్లీ!
చల్లనికడుపుతో సాగవేతల్లీ!
కొల్లలుగ సౌభాగ్య మేలవేతల్లీ!"

ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికొనవలెను. చల్ల గిల కొట్టున ప్పుడు చల్లకుండకు చుట్టును, చిలికే చల్లచినుకులు పసుపుతో గలిపి ఒక యేడాది ప్రతిదినము, అయిదుగురు ముత్తయిదువలకు బొట్టు పెట్టు చుండవలెను. ఇది చిట్టిబొట్టునోముతో కలిపి పట్టెదరు.

ఉద్యాపనము :—పాడిగలరోజులలో ఒకనాడుచేసినచల్ల ఆనా టివెన్నముద్దతోగూడ కుండ పాళముగ ఒకముత్తైదువకు వాయనమీయ వలెను దక్షిణతాంబూలము ఈయవలెను.

## 17. పెరుగుమీాదపేరిననెయ్యినోముకథ

ఒకబ్రాహ్మణపండితునకఖండైశ్వర్యములు కలవు. కాని, సం తానములేదు. ఆబ్రాహ్మణుడు భార్యతో గూడ అనేకములగునో ములు, అనేకవ్రతములు, చేసిచేసి, దేవునికృపచే చాలాకాలాని కొక కూతురిని గన్నాడు. ఆపిల్ల నతిగారాముతోను మహాగారాముతోను పెంచుతూఉండేవారు. ఆబ్రాహ్మణుడు గంగిగోవులపాలు ప్రత్యేకము కాపించి పాలు, పెరుగు, నెయ్యి పిల్లకు కడుపునిండాపెట్టాలని సరదా పడేవాడు కాని, ఆపిల్లకు నెయ్యి, పెరుగు, పాలు, వెన్న, చల్లాయిష్ట మయేవికావు. వాటిపేరుచెపితే ఆపిల్ల కసహ్యము. వాటిని వేటిని ఆపిల్ల కల్లోనైనా రానిచ్చేదికాదు. అందుకోసం తల్లిదండ్రి బెంగపెట్టుకొని అనేకవిధాల ఆలోచిస్తూ ఉండేవారు వారు పిల్లతినందే తామేమియు తినుటకు నోటికిపోక ఇంట్లో కొల్లలుగానున్నపాడి ఊరందరకు పంచి పెడుతూఉండేవారు. ఇలాఉండగా ఒకనాడు వారింటి కొకస్వాములు వారు భిక్షకు వచ్చారు. ఆయనకు పంచభక్ష్యపరమాన్నాలతో వడ్డన చేసినారు. పిల్లబంగారపుబొమ్మలాగు ఆడుకొంటూఉంటే చూచిస్వా ములవారు తమపంక్తిని పిల్లకు విస్తరివేయుమన్నారు. పిల్లఅబ్బే నేని క్కడతినను. చల్ల, నెయ్యి, పెరుగు, వెన్న అన్నీ వేస్తారుబాబు అని పారి

పోయింది. అదియేమని స్వాములవారడుగగా పిల్లతలిదండ్రులాసమా చారమంతా స్వాములవారితో విన్నవించుకొన్నారు. అప్పుడు స్వాము లవారు దివ్యదృష్టితో చూచి యీలాగు చెప్పినారు. ఈపిల్ల పూర్వజ న్మంలో విస్తారంపాడిగలయింట్లోపడి ఆపాడి తాను తనపిల్లలు మగడు తాగినంతతాగి తక్కినది యిరుగుపొరుగువారెవ్వరికీ కొంచెమైనా పోయక తడవలతో మిగిలిపోయిన పెరుగూ మజ్జిగా పట్టుకొనివెళ్ళి గొడ్లగోళెములో పోసివేస్తూవుండేది. అంతకు మునుజన్మంలో చేసిన విశేషపుణ్యంచేత మరల నట్టిభాగ్యవంతులయింట్లో పుట్టింది. క్రిందటి జన్మంలో చేసినపాపంచేతనే యీజన్మంలో దీనికి పవిత్రమైన ఆవుపాడి అనుభవించడానికి అధికారములేక పోయింది. అందుచే ఒకయేడాది ప్రతిదినమూ ఉదయాన్ని నమస్కరించి తరువాత యీపిల్ల ఒకనాడు అయిదుస్నేల్లుగాని, అయిదుతవ్వలుగాని, అయిదుసోలలుగాని ఆవుపాలు ఎట్టగాకాచి తోడుపెట్టి ఆగట్టిపెరుగుమీద పేరినఆవు నేతిముద్ద పెరుగు కుతగినట్లుగా పెట్టి ఆపెరుగుముంత, పేరిన నెయ్యి, ఒకరవికెలగుడ్డ, కుంకుమ, పసుపు, తాంబూలము, దక్షిణ, ఒకముత్తైదువకు ఇవ్వ వలెను.

అప్పుడీదోషము పోయి యీబాలిక సకలశుభములూ పొందు నుఅని చెప్పెను.

ఆపిల్లతలిదండ్రులు భక్తిశ్రద్ధలతో తమపిల్లచేత పెరుగుమీద పేరిననెయ్యినోము పట్టించి ఉద్యాపనము చేయించగా ఆపిల్ల ఆనాటి నుండి ఆనందముతో అతిపవిత్రమైనఆవుపాలూ, అంతరంగశుద్ధికలి గించే ఆవుపెరుగూ, ఆత్మజ్ఞానమునిచ్చే ఆవునెయ్యీ అన్నీ సుఖంగా అనుభవిస్తూ చిరకాలం ముత్తైదువతనం కడుపుచలువ గలిగి వర్ధిల్లింది. ఆమె నోచిన నోము భామలందరూ నోచారు. కథ లోపమైనా వ్రత లోపము కారాదు. భక్తితప్పకుంటే ఫలం తప్పదు.

---

## 18. విష్ణుకమలాల నోముకథ.

ఒక రాజుకూతురు, ప్రధానికూతురు ఉండేవారు. ప్రధానికూతురినిచూచి రాజుకూతురు "అయ్యో! ఎన్నినగలుపెట్టుకొన్నా ఎంతసంరక్షణముచేసినా నామోమున కందములేదు ఆకారములేదు కళాలేదు. కాంతిలేదు. ప్రధానికూతురుమోముకమలంలాగుకలకలలాడుతూ, దీపంలాగు తేజరిల్లుతూ, చూడ ముచ్చటగా నుంటుంది. అదేమిపుణ్యము చేసిందో" అని ఆలోచించుకొని విచారించుచుండేది. ఒకనాడు రాజుగారింటికి రాజపురోహితునిభార్యవచ్చి, కథలూ కారుణ్యాలూ చెపుచూ ఒకథచెప్పిందట—ఒకనాడు వైకుంఠనగరములో రత్నసింహాసనముమీద భక్తులు సేవించుచుండగా శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితొడలపై పాదాలుంచుకొని చిగురుటాకులవంటి హస్తాలతో తన పాదములొత్తుచున్న ఆదేవినిచూచి "కమలా! నీముఖకమలమువంటి ముఖకమలము కావాలని యెందఱుకాంతలు కోరుకొనుచుందురో—కనుక వారి కోరిక తీరినట్లు నేనొక వరమిచ్చుచున్నానుసుమా!" అన్నాడు. లక్ష్మీకాంత నవ్వుచు నూరకున్నది. విష్ణుమూర్తి మరల చెప్పుటకు మొదలిడినాడు.

"ఏస్త్రీయైననుసరే ప్రతిదినమును ఒక కమలవత్తి ఆవునేతితో దీపము వెలిగించి మనల నిరువురను పూజించుచు ఒకయేడాది యిట్లు నోచి తరువాత ఒక వెండిప్రమిద ఒక బంగారుప్రమిద చేయించి ఆవునేతితో ఆరెండుప్రమిదలలో కమలవత్తులు దీపాలు వెలిగించి మూనెడు సోలెడుబియ్యము ఒక కొత్తవస్త్రము దక్షిణతాంబూలముతో ఆ వెలుగుచున్న వెండిదీపము బంగారుదీపములతో ఒక బ్రాహ్మణునకు దానమియ్యవలెను. దీపమును వెలిగించుటకు ఆటంకమైనరోజులు కలిగినచో ఆదీపములన్నియు ఒకనాడుగాని రెణ్ణాళ్ళుగాని సంవత్సరములోగా ఎప్పుడైనా సరే వెలిగించుకోవచ్చును. ఈలా ఎవ్వరునోచెదరో

వారికి లక్ష్మీదేవిముఖకమలమువంటి ముఖము, సౌభాగ్యముకలుగును." అని విష్ణుమూర్తి చెప్పేసరికి లక్ష్మీదేవి స్వామీ! ఆనోమునోచిన భామలకు మీవంటిభర్త గలిగి జ్ఞానమువచ్చేటట్టుకూడా ప్రసాదించండి అని కోరింది. విష్ణుమూర్తి 'తథాస్తు' అని వరమిచ్చినాడు—అని పౌరోహితునిభార్య కథచెప్పేసరికి రాజకూతురు మనోరథము పండినది. ఆమె గంపంత సంతోషముతో లేచి ఆమెపాదాలకు సమస్కరించి భక్తిశ్రద్ధలతో విష్ణుకమలాలనోముపట్టి ఈకథచెప్పి అక్షతలువేసుకొని యేడాదిదీపము వెలిగించి ఉద్యాపనముచేసికొన్నది. ఆమెముఖము ఆమెకోరినట్లు లక్ష్మీతాండపిస్తూ వికసించినది. ఆమె విష్ణుమూర్తివంటి భర్తనుబొంది విజ్ఞానము కలిగి వర్ధిల్లినది. ఆమె నోచిననోము భామలంతా నోచారు. భక్తితప్పకుంటే ఫలం తప్పదు. అక్షతలుతప్పినా లక్షవేలేండ్లు అయిదవతనము తప్పదు.

---

## 19. సూర్యచంద్రులనోముకథ.

సూర్యదేవుడా నీకే నమస్కారం చంద్రదేవుడా నీకేనమస్కారం. బాలభాస్కరా నీకే నమస్కారం. ఉదయభాస్కరా నీకేనమస్కారం. మధ్యాహ్నమహేశ్వరా నీకేనమస్కారం. ధనధాన్యసమృద్ధైనపట్నంలోను పేదబ్రాహ్మడు—సాదబ్రాహ్మడు—ఊరుతిరిగినా ఏడేమానికలు, పల్లెదిరిగినా యేడేమానికలు, పట్నందిరిగినా ఏడే మానికలు—ఏడుమానికలబియ్యం చేత, కూడూగాక, నీళ్ళూగాక, దారిద్ర్యాన, పేదరికాన విసిగివిసిగి వేసారుచుండగా, పుట్టకిద్దరు పిసపాపలు పుడితే చిన్నక్కమ్మను చినసోమయాజులకిచ్చి, పెద్దక్కమ్మను పెదసోమయాజులకిచ్చి తా చక్రఋషీశ్వరం బోయెను. ఇంద్రలోకాన నింద్రికన్యలు, చంద్రలోకాన చంద్రికన్యలు, భూలోకాన పేరంటాళ్లు కొలనుగట్టెక్కలు నోములునోచంగా, అమ్మల్లారా! అక్కల్లారా!

ఏమినోమేమివ్రితం (చెప్పండంటే) ఆడవారినోములు మీకెందుకనిరి. పెదయ్యగారు తటాకమందు స్నానంచేసి బంగారుచేరువులో పట్టువస్త్రం గట్టుకొని, పెద్దయ్యగారు ఓగద్దెపెట్టుకొని పేరంటాలు ఓగద్దెపెట్టుకొని పెదయ్యగారిచేతిలో అక్షతలు పేరక్క చేతిలోబెట్టి, పెదయ్యగారుకథ చెప్పంగా పేరక్కమ్మ కథవినంగా. ఏటికెదురుగా మాఘమాసాన్ని పున్నంముందర రథసప్తమిని విఘ్నంగాకుండ విఘ్నేశ్వరుల కుండ్రాళ్లు పోసి ఆదిత్యభగవానునికి పాలుపొంగించి, ఆయనను మూడుకోరికలు కోరి అది మొదలుచేసికొని, ముట్టైనాకథ, అంటైనాకథ, పురుడైనా కథ, పుణ్యమైనాకథ, శుభమైనాకథ శోభనమైనాకథ, వడుగైనాకథ, పెండ్లైనాకథ, పంచయజ్ఞాలకథ. పంచక్రితువులాకథ, కథేనిత్యం, కథే నీమం, కథేవాలాయితి—కథామఱచి కుడువరాదు, వ్రితాభంగం చెయ్యరాదు. కన్యకథమఱచి కుడిస్తే బ్రాహ్మడికిభోజనంబెట్టి, బ్రాహ్మడు కథమఱచికుడిస్తే, బ్రాహ్మడికి భోజనంబెట్టి, బ్రహ్మచారి కథమఱచికుడిస్తే, బ్రాహ్మడికి భోజనంబెట్టి, ముత్తైదువ కథమఱచి కుడిస్తే, బ్రాహ్మడికి పసుపూనీళ్ళాగడిగి భోజనంబెట్టి, వితంతువుకథ మఱచి కుడిస్తే, ఉపవాసముండి నక్త్రంజూచి బ్రాహ్మడికి కాళ్ళుగడిగి, భోజనంపెట్టి, ఏనుంగాలగథాచరించి, ఏడాదికాగానే షష్ఠినాడు ఉపోషముండి, సప్తమినాడు చెఱుకుగట్లల అరటిస్తంభాల పందిళ్ళువేసి, చేమంతిపువ్వుల మెత్తులుపెట్టి, అట్లతోను అరుగులువేసి, బుట్టలతో మూలలువేసి, కుడుములతోను కోటలవేసి, కుంకుమతోను కుడుళ్ళువేసి, అల్లంతోను అరుగులువేసి, బెల్లంతోను పాయిలూవేసి, ప్రాలానుప్రిరందీర్చి, పంచెపన్నెల ముగ్గులుపెట్టి, పన్నెండూపద్మాలూపెట్టి, పసుపుతోనుగడపాపెట్టి, ఏడుమానికల బియ్యానా సూర్యదేవునికి మండపంబోసి, ఏడుమానికల బియ్యానా చంద్రిదేవునికి మండపంబోసి, చిన్నంబాతికబంగారాన సూర్యదేవునకు ప్రితిమచే

యించి, చిన్నంబాతిక వెండితోను చంద్రదేవునకు ప్రతిమ చేయించి, పైడిగిన్ని పచ్చవస్త్రానా సూర్యదేవు నలంకరించి వెండిగిన్ని వెల్లవస్త్రానా చంద్రదేవు నలంకరించి, నేగిందాకా ఆటాపాట, ఏదోవిధాన జాగరంచేసి, వేగంగానే తానులేచి, అలికిపూసి ముగ్గులుపెట్టి ఆవు నేతాదీపంబెట్టి, ఆవునేతాబూరెలువండి, చిరగకపోయిన అరటాకులలో మరవబోయిన బెల్లంబెట్టి, మోసుకుపోయేకుండాపెట్టి, అల్లంబెట్టి బెల్లంబెట్టి తేనెపెట్టి కుంకాయపెట్టి, అరటీపండ్లా అత్తింపెట్టి, ఆదినారాయణున కారగింపబెట్టి, ఉమాదేవిపేరుచెప్పి, రోహిణీదేవిపేరుచెప్పి, పన్నిద్దరు బ్రాహ్మణులతోను, ఇద్దరైనాముత్తైదువలకు ఇష్టాన్నములు తుష్టిగాబెట్టి, శక్తితోడను తాంబూలమిచ్చి, భక్తితోడను నమస్కరించి, ఈనోమునోచినవారి కేమిఫలంగద్దమ్మా అంటే—ఇష్టాన్నములు తుష్టియాయె, దృష్టాంతరమే మోక్షమాయె, చావనిసంతానంబాయె, సంతానంబభివృద్ధాయె, చెడ్డాఅర్థం చేరివచ్చె, పడ్డఅర్థంప్రాప్తిల్లె, దవ్వులచుట్టాలు డాయవచ్చిరి, వట్టిగోవులసురలుపితికిరి, ముసున్నరుకోకేండ్ల అయిదోతనంచేసిరి, గొడ్రాలునోస్తే కొడుకులగనెను, కోమటినోస్తే కోటిపడగలెత్తె, రాజులునోస్తే లక్షపతాయె, పునిస్త్రీనోస్తే పువ్వులు ముడిచె, పుత్రపుత్రికలనెత్తె, వితంతువునోస్తే వేయివేళ్ళకు వెధవరికములేదు, శివలోకం విష్ణులోకం కట్టిన్నుంటే, ఎక్కినగద్దెలు పైడిగద్దెలాయె, అత్తిన నల్లపూసలాభరణాలాయె, కట్టినవస్త్రాలు పట్టువస్త్రాలాయె, పుణ్యంగల యీకథవింటిని, భాగ్యంగల యీకథవింటిని, ఆచారంగల యీకథవింటిని, ఆదినారాయణమూర్తికథవింటిని, ఆదినారాయణమూర్తికి నమస్కరిస్తేను నాకు నమస్కరించవద్దు, నాపాలిటి నారాయణమూర్తికి నమస్కరించుమనెను. దివాకరుడా దివ్యమూర్తి, ప్రభాకరుడా! బాలభాస్కరుడా, అలంకారాల ఆదినారాయణా ఆదినారాయణుకి నమస్కరించి అక్షతలుతలలో వేసికొనవలెను.

భక్తితప్పకున్న ఫలంతప్పదు. అక్షతలుతప్పినా అయిదువేలేండ్లు అయిదవతనము తప్పదు.

## 20. బారవత్తులు, మూరవత్తులునోముకథ.

ప్రతిదినము బారెడువత్తి పోగొకటి మూరెడువత్తిపోగొకటి, తీసికొని, బారెడుపోగూ ముప్పది చుట్లుచుట్టి, మూరెడువత్తిపోగూ ఆరుచుట్లులు చుట్టి, శివరాత్రినాడు మొదలు, మళ్ళీశివరాత్రిదాకా సంవత్సరమువరకూ ఈలాగువత్తులు చేసికొని, శివరాత్రినాడు శివాలయములో క్రొత్తమూకుడులో మూనెడునూనెపోసి, ఆవత్తులువెలిగించవలెను. తరువాత మానెడుసోలెడు బియ్యము, క్రొత్తవస్త్రము దక్షిణతాంబూలముతో బ్రాహ్మణులకు భోజనముపెట్టి యియ్యవలెను. ఈనోము నోచినవారికి బ్రహ్మలోకాలు ప్రాప్తించును. ఈకథ శివునివలన విని పార్వతీదేవి తనభక్తురాలైన యొకకుంటిగుడ్డిదానికి చెప్పగా, ఆభక్తురాలు భక్తిశ్రద్ధలతో ఈనోచి అంగవైకల్యముపోయి బ్రహ్మజ్ఞానముగలిగి, బ్రహ్మలోకము చూరగొన్నదట. భక్తితో నోచినవారికి ఫలంతప్పదు. కథలోపమైనా వ్రతలోపం కారాదు. అక్షతలు లోపమైనా లక్షయేండ్లదోషం తప్పదు. వత్తులుచేయుట కెప్పుడైనా వీలులేకపోతే అన్నీకలిపి మరొకనాడు చేసికొనవచ్చును.

---

## 21. అక్షయబొండాలనోముకథ.

అక్షయబొండాలనోమునోచిన అతివకు అక్షయమైన అయిదోతనం—అక్షయమైన కడుపుచలువ గలిగి అక్షయలోకాలు చేకూరును. ఈకథ, చెప్పుకొని, అక్షతలువేసికొని, ఏడాదీ రోజుకైదుగురు ముత్తయిదువలకు అయిదేసి చిన్నచిన్న పసుపుండలు ఇచ్చుచు ఏడాదియైన

తరువాత మంచిమంచి కొబ్బరిబొండాలు తాంబూలములు, దక్షిణలు, రవికెలగుడ్డలు, పసుపుకుంకుమలు, వాయనమియ్యవలెను. కథలోపమైనా వ్రతలోపము కాగూడదు. భక్తితప్పినా ఫలముతప్పదు.

---

## 22. లింగదానమునోముకథ.

కార్తికమాసాన, కలిగినదినాన, కరుణలింగమూర్తిని ఘనభక్తి గొలిచి, పండితబ్రాహ్మణుని భక్తితోబిలిచి, శక్తితప్పకుండాను భక్తి తప్పకుండ, బంగారువెండితో లింగాలుచేయించి, తమశక్తికొలదిన్ని దక్షిణలుంచి, పచ్చిపోకలతోను పండుటాకులతో, పచ్చకప్పురముతో బహుదినుసుతోను, తగినరీతిని భక్తితాంబూల మమరించి, బంగారు ప్రమిదలో పదివత్తులుంచి, వెండిప్రమిదలోనవేసి పదివత్తులు, దీపాలువెలుగుచూ తేజరిల్లగను, అవియన్ని బ్రాహ్మణున కందీయవలెను. బ్రాహ్మణునకు సాష్టాంగప్రణామంచేసి, భూదేవుదీవనల్ పొందగావలెను. లింగదానంనోచిన యంగనలకెల్ల, భవబంధనములెల్ల బాసిపోవంగ, పార్వతీపరమేశ్వర్లు బహుకరుణతోను, శివలోకసాయుజ్య సిద్ధినిచ్చెదరు ఉద్యాపనము పైపాటలో నేయున్నదికనుక వ్రాయలేదు.

---

## 23. గూనదీపాలు, బానదీపాలునోముకథ.

గూనదీపాలు, బానదీపాలునోచినవారికి గూనెడు కుంకుమ, బానెడుపసుపుగలిగి, గ్రహదోషాలుపోయి, ఘనతేజంగలిగి, కడుపుచల్లనగలిగి, కడవలాదిపాడిగలిగి, యిరుగుచల్లనగలిగి, పొరుగు చల్లనగలిగి, యెడతెగనిపంటగలిగి, యెల్లభాగ్యాలుగలిగి,. సుఖసంతోషాలుగలిగి, సుందరరూపముకలిగి, పార్వతిదయగల్గి, పరమేశ్వరునిదయగల్గి, ఇహముగలిగి పరముగలిగి, ముక్తిగలిగి మోక్షము గలుగును. ఈ థచెప్పుకొని అక్షతలువేసికొనవలెను.

ఉద్యాపనము:—అయిదుకుంచములనెయ్యి, అయిదుకుంచముల నూనె, కొత్తగూనలలోను, కొత్తబానలలోనుపోసికొని, కొత్తగుడ్డలతో మూటలవలె రెండు పెద్దపెద్దవత్తులుచేసికొని, అవి గూనలలోను, బానలలోను, నేతిలోని, నూనెలోను తడిసి కార్తికమాసములో, శివాలయములో. విఘ్నేశ్వరపూజచేసి, శివాభిషేకము చేయించి, ఆదీపాలు వెలిగించి, శక్తికొలది బ్రాహ్మణులు మొదలగువారికి సమారాధనము చేయవలెను.

---

## 24. సహస్రసహస్రఫలాలనోముకథ.

సహస్రఫలాలు నోచినచాన పుణ్యము వర్ణించుటకు సహస్రశిరముల ఆదిశేషునకైనా అలవిగాదు. ఎల్లకాలము చేసెడినోము ఏమిటయ్యా అనిపార్వతిశివునడుగగా ఎల్లకాలమునోచేనోము ఫలాలనోమే బాలాపార్వతీ! ఈనోమునోచినయింతికి, ఇయ్యరానివరములులేవేభక్త పార్వతీ! ఈనోమునోచిన భామలమీద, నీకూదయ నాకూ దయ, విష్ణునకూదయ, లక్ష్మికీదయ, బ్రహ్మకూదయ, సరస్వతికిదయ, చంద్రునకూదయ; సూర్యునకూదయ; ముక్కోటిదేవతలకూ దయ; మూడు లోకాలకూ దయ; ఈనోమునోచినవారికెల్ల కోరికలుతీరి, ఇహపరము వారిదే యగునే పార్వతీ యని పరమేశ్వరుఁడు చెప్పినాడట.

ఈకథచెప్పుకొని అక్షతలువేసికోవలెను.

ఉద్యాపనము:—ఒక్కొక్కపండు దినుసుకు వేయిచొప్పున వేయిదినుసులపండ్లు వానివానికి దగిన దక్షిణలతో, బ్రాహ్మణదంపతులకు దానమీయవలయును. ఏకాలంలో దొరికేపండ్లా కాలములో చేసికోవచ్చును. ఇచ్చినవారికీయకుండా వేయిదినుసులు, వేయిమంది బ్రాహ్మణదంపతులకు ఈయవలెను. భక్తితప్పకున్న ఫలము తప్పదు.

---

## 25. పెండ్లిగుమ్మడిగౌరి నోముకథ.

"పెండ్లిగుమ్మడిగౌరి పేరక్కపట్టింది,
ఇండ్లువాకిండ్లలో నెపుడుకల్యాణాలె,
ఇండ్లువాకిండ్లలో నెడతెగనిపంటలే
ఇండ్లువాకిండ్లలో నెడతెగనిభాగ్యమే
గుమ్మడిపండ్లావంటి కొడుకులూ అల్లుండ్రు
గుమ్మడిపండ్లావంటి కూతుండ్రు కోడండ్రు
మాణిక్యములవంటి మనుమలామందలు
పసుపులు కుంకములు వాయనిభూషలు
కలిగె నానందాలు కన్నులాపండుగలు
ఈనోము నోచినా యింతులకు కొదవేమి ?"
ఈకథచెప్పుకొని అక్షతలు వేసికొనవలెను.

ఉద్యాపనము:—మూడు బూడిదగుమ్మడిపండ్లు తెచ్చియుంచుకొనవలెను. అందులో నొకపండు, మూనెడుసోలెడుబియ్యము, దక్షిణతాంబూలమునుంచి, అవిపట్టుకొని బ్రాహ్మణుని యింటికివెళ్ళి, అవి ఆయనకిచ్చి, నమస్కరించి, నోము చేసికొందును వాయన మందుకొనుటకు రావలెనని, యాబ్రాహ్మణవృద్ధిని బిలువవలెను. ఆయన మనయింటికి వచ్చినతరువాత, రెండవగుమ్మడిపండు, అడ్డెడుతవ్వెడు బియ్యము, దక్షిణతాంబూలము ఆయనకిచ్చి నమస్కరింపవలెను. ఆ తరువాత మూడవగుమ్మడిపండును అయిదుసేర్ల బియ్యము, స్వయంపాకముతో పట్టుకొని బ్రాహ్మణునియింటికివెళ్ళి, ఆయన భార్యకు వాయనముతో అందించి, వారియింటిలోనే ఆనాడు నోము చేసికొన్న యిల్లాలు భోజనముచేయవలెను.

---

26. మూసివాయనాలనోముకథ.

"మూసివాయనాలు నోచిన చానకు మోసుకుపోయిందాక పసుపు, కుంకుమ—మూసివాయనాలు నోచిన కాంతకు మోసుకు పోయిందాక పాడి పంట—మూసివాయనాలు నోచినయింతికిమోసుకు పోయిందాక కడుపుచలువ—మూసివాయనాలు నోచినపణతికి మోసుకుపోయిందాక పెనిమిటి యనురాగం—మూసివాయనాలు నోచిన భామకు మోసుకుపోయిందాక చుట్టాల ప్రేమ—మూసివాయనాలు నోచినలేమకు మోసుకుపోయిందాక యిహం—మోసుకు పోయాక పరం—"

ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికోవలెను.

ఉద్యాపనము:—ఈనోముకు ఆరు మూసివాయనాలు ఆరు గురు ముత్తైదువలకు ఇయ్యవలెను. పెద్దచేటలతో ఇచ్చినవి, పెద్ద మూసివాయనాలు; చిన్న చేటలతో ఇచ్చినవి చిన్న మూసివాయనాలు అందురు. ఎవరిశక్తి కొలది వారిచ్చెరు. ఒకచేటనిండా కుంకుమపోసి పైని ఇంకొకచేటబోర్లించి, రవికలగుడ్డ, తాంబూలము, దక్షిణ, నల్ల పూసలు, లక్కజోళ్లు, పండ్లు పెట్టి యియ్యవలెను. అట్లే ఒకచేటనిండా పసుపుపోసి పైని చేటబోర్లించి, తాంబూలము దక్షిణ మొదలగు వానితో రెండో మూసివాయనము, ఇంకొకచేటనిండానల్లపూసలుంచి రెండోచేటబోర్లించి, తాంబూలము, దక్షిణమొదలైనవుంచి మూడో మూసివాయనము, ఒకచేటనిండాపువ్వులుపోసిపైనిచేటబోర్లించి, తాం బూలము, దక్షిణమొదలయినవిపెట్టి నాలుగో మూసివాయనము, ఒక చేటనిండాపండ్లుపోసి పయినఇంకొకచేటబోర్లించి,తాంబూలము, దక్షిణ మొదలయినవి వుంచి, అయిదోమూసివాయనము ఒకచేటనిండా గాజు లుపెట్టి పైన మరివకచేట బోర్లించి తాంబూలము దక్షిణమొదలైనవి వుంచి ఆరో మూసివాయనము నియ్యవలెను. ఈ మూసివాయనా

లన్నియు, ఒక్కమారైనను సరే, లేక ఒక్కొక్కటిచొప్పననైనాసరే, రెండేసి మూడేసి చొప్పననైనా సరే వీలును బట్టి యిచ్చుకొనవచ్చును.

---

## 27. భాగ్యాదివారాలనోముకథ.

బ్రాహ్మణబాలిక, రాజుబాలిక, భాగ్యాదివారాలనోము పట్టిరి. బ్రాహ్మణబాలిక, భక్తిశ్రద్ధలతో నోచింది. రాజబాలిక పాలుమాలి కచే నోము ఉల్లంఘనచేసింది. రాజుకూతురు భాగ్యముపోయి పరమ దరిద్రురాలై పార్వతీపరమేశ్వరులను ప్రార్థించుచు, నట్టడవులపాలై పోయింది. బ్రాహ్మణబాలిక సిరిసంపదలతో తులతూగుచు, నిండు కుండవలె, చెక్కు చెదరకుండ, ఆనందముతో కాలముగడుపుచుండెను. అడవులపాలై అల్లాడుచున్న రాజుకూతురిని చూచి, పార్వతీ పరమేశ్వరులు భక్తురాలైనదికనుక, పాలింతమనియెంచి, ముసలిదంపతులవేషాలతో ఒకనాడామెదగ్గిరకువచ్చి ఆమెను పరామర్శించినారు. ఆవిడ మాటాడేమనుష్యులులేక పలుకాడేబంధువుల్లేక యేకాకినియై యేడ్చుచున్నది. కనుక, వారినిచూడగానే ప్రాణములులేచివచ్చి, తనకష్టమంతా వెళ్ళబోసికొన్నది. అప్పుడు పార్వతీపరమేశ్వరులు "ఓచిన్నదానా! నీవు భాగ్యాదివారాలనోముపట్టి, ఉల్లంఘనచేసితివి. జ్ఞప్తికి తెచ్చుకో" మన్నారు. అప్పుడావిడ అదంతా తలపోసికొని, తన తప్పు తెలిసికొని దీనికి పరిహారము చెప్పుడని వారిని ప్రార్థించింది. అప్పుడా దంపతులు బిడ్డా! భక్తిశ్రద్ధలతో మరలభాగ్యాదివారాలనోము నోచుకో. భాగ్య భోగ్యాలు, పాడిపంటలు పోయినవన్నీ మళ్ళీవస్తాయి. కడుపుచలువతో తరగనైశ్వర్యోత్సవముతో, కైలాసానికి వెళ్ళగలవని చెప్పినారు. ఆవిడ వెంటనే భక్తిశ్రద్ధలతో భాగ్యాదివారాలనోముపట్టి, ఉద్యాపన చేసికొని, పోయినభాగ్యభోగ్యాలుపొంది, సకలసంపదలతో,సౌభాగ్యంతో

స్వర్గానికి వెళ్ళింది. ఆమె నోచిననోము భామలంతా నోచారు. భక్తి తప్పకుంటే ఫలము తప్పదు.

ఉద్యాపనము:—శక్తిగలవారు పట్టుదిగాని, లేనివారు వట్టిది గాని సన్ననికుట్టుతో, చక్కనికుట్టుతో, ఒకరవికకుట్టి, దానికి చేతికిందకూర్పులుమాత్రము కుట్టకుండా, వదలివేయవలెను. ఆరవిక ఒకచేటలో పరచి, ఆరవిక చేతులలో ఒకచేతినిండా పసుపు, రెండవచేతినిండా కుంకుమపోసి, పండ్లు దక్షిణ, తాంబూలము, మట్టెలు మంగళసూత్రములు ఉంచి, చీర రైక ఉంచి పైనొక చేటమూసి, ఒకముత్తైదువకు అవి వాయనమీయవలెను. ఏడాదివరకు ప్రతిఆదివారము కథచెప్పి అక్షతలు వేసికొనుచు, పార్వతీపరమేశ్వరులను, పూజించుచు, ఒంటిపూట భోజనము, రెండవపూట ఫలాహారము చేయవలెను.

## 28. మూలగౌరినోముకథ

భక్తిశ్రద్ధలతో మూలగౌరినోముపట్టి, ఉద్యాపనము చేసికొని, పార్వతీపరమేశ్వరులను ప్రత్యక్షముచేసికొని, ఒక భాగ్యవతియైన రాజు భార్య, ఎవ్వరికిలేని భాగ్యభోగ్యాలతోను, ఎవ్వరికిలేనిసిరిసంపదలతోను ఎవ్వరికిలేని సుఖసంతోషాలతోను, పరమేశ్వరునివంటి హృదయేశ్వరునితోను, కుమారస్వామివంటి కొమాళ్ళతోను, ముక్కోటిదేవతలవంటి మునిమనుమలతోను, మహాగర్వం గలిగి, మహిని పాలించుచున్నది. అప్పుడు పార్వతీపరమేశ్వరులు దీనిభక్తియెంత గలదో దీని ధైర్యమెంత గలదో చూతామని మరియొక దేశపు రాజు హృదయంలో ప్రవేశించి, ఆ రాజు నీ రాజు మీదికి యుద్ధానికి పంపిరి. దైవబలంతో ఆరాజు ఈరాజచక్రవర్తిపైకి యుద్ధానికివచ్చి, మహాబల సంపన్నుడైన రాజును, బిడ్డలతోను, మనుమలతోను, మునిమనుమలతోను, సకలసైన్యముతోను, పడగొట్టివేసెను. అప్పుడా రాజు రాజ్య

మంతా పరరాజు చు ురగొనబోస్తుచుండగా రాజుభార్య మహాధైర్యం తో యుద్ధభూమికివెళ్ళి యమదూతలను తరుముచు, ఈలాగన్నదట— పడకగదిలో పగడాలు వాయనమిచ్చాను. పండువంటి నాఐదోతనం భంగంచేయలేరు. పారిపొండి యమదూతలారా పారిపొండి—ముత్తై దువతనంకోసం మూలనుండి ముత్యాలువాయనమిచ్చాను. ముట్టలేరు నాపెనిమిటిని ముట్టకండి యమదూతలారా! పారిపొండి—భాగ్యభోగ్యాలకోసం పడమటింటిలో పట్టుచీర వాయనమిచ్చాను. నాభాగ్యాలు పాడుచేయలేరు. పారిపొండి, యమదూతలారా పారిపొండి—తోటలు దొడ్లు కావాలని తోటలో తోపుచీర వాయనమిచ్చాను తొలగిపొండి యమదూతలారా తొలగిపొండి—ఇల్లూవాకిళ్ళూ గావాలని యిల్లాలికి వెల్లచీరవాయనమిచ్చాను. వెళ్ళిపొండి యమదూతలారా వెళ్ళిపొండి— చెడకుండా కడుపుతీపి చెఱుకుగెడలు వాయనమిచ్చాను, కొడుకుల దరికి చేరలేరు, పారిపొండి యమదూతలారా పారిపొండి—మనుమలు మునిమనుమలు గలుగాలని మరొకమారు చెరకుముక్కలు వాయనమిచ్చాను, పారిపొండి యమదూతలారా పారిపొండి—ఎల్లవారు చల్లగాఉండాలని బెల్లపచ్చులు వాయనమిచ్చాను. నాప్రజలదగ్గరకు రాకుండా పారిపొండి యమదూతలారా పారిపొండి—పేరుప్రఖ్యాతులు పెంపెక్కాలని పెరట్లో పెరుగుముంతలు వాయనమిచ్చాను. పేరూ చెరుపలేరు, పెంపూ చెరుపలేరు పారిపొండి యమదూతలారా పారిపొండి—పాలపాపలతో ఓలలాడాలని పాకలలో పాలకాయలు వాయనమిచ్చాను, నాపాపలదరికిపోలేరు, పారిపొండి యమదూతలారా పారిపొండి సిరీసంపదా చెదరకుండాలని చీకట్లో చిమ్మిలుండలు వాయనమిచ్చాను, సిరిసంపదలుచెరుపలేరు, పారిపొండియమదూతలారాపారిపొండి—సుఖసంతోషాలు చూరగొనాలని సూర్యభగవానునికెదురుగుండాసున్నుండలువాయనమిచ్చాను నాసుఖసంతోషాలజోలికిపోలేరు

పారిపొండియమదూతలారా పారిపొండి—అల్లుళ్ళతో కూతుళ్ళతోఅంద లాలు దిగాలని అరుగుమీద అరిసెలు వాయనమిచ్చాను, అల్లుళ్ళ జోలికి కూతుళ్ళజోలికిపోలేరు, ఆవలికిపొండు యమదూతలారా ఆవ లికిపొండు—కలిమిశుభాలు కలుగుతూనే ఉండాలని గాదెవద్ద గారెలు బూరెలు వాయనమిచ్చాను, కదలిపొండి యమదూతలారా కదలి పొండి—వేసినవింజామరలు వేస్తూనే ఉండాలని వేదికమీద విసనక ర్రలు వాయనమిచ్చాను, వెడలిపొండు యమదూతలారా వెడలిపొం డు—చల్లగా రోజులుజరగిపోవాలని చాపమీద చలిమిడుండలు వాయనమిచ్చాను, చక్కాపొండి యమదూతలారాచక్కాపొండి—చేసి నశుభాలు చేస్తూనేఉండాలని చేరువగా చేటలు వాయన మిచ్చాను, చేరకండి యమదూతలారా చేరకండి—సర్వేశ్వరునికరుణ సర్వకాల మూ ఉండాలని సందులో చక్కిలాలు వాయన మిచ్చాను, జంకిపొండి యమదూతలారా జంకిపొండి—అందరికంటె అధికంగా ఉండాలని హరునియెదుట అరటిపండ్లు వాయనమిచ్చాను, ఆవలికిపొండి యమదూ తలారా ఆవలికిపొండి—కొదవల్లేకుండా కోటివేలేండ్లు కాపురంచెయ్యా లని గొబ్బరిబొండాలు గోడదగ్గరవాయనమిచ్చాను, గొబ్బునపొండి యమదూతలారా గొబ్బునపొండి—ఏగోడవలూ లేకుండా బ్రతకా లని కాగుదగ్గర చేగోడీలు వాయనమిచ్చాను, సాగిపొండి, యమదూ తలారాసాగిపొండి—నిండుకుండలాగుతొణక్కుండా ఉండాలి కాపుర మని నీరాటరేవున నిండుకుండలు వాయన మిచ్చాను, నిలవకుండా పొండి యమదూతలారా నిలవకుండాపొండి—అకలంకమైనకీర్తి వ్యా పించడానికి అటుకకిరింద అద్దాలు వాయన మిచ్చాను, ఆవలికిపొండి యమదూతలారా ఆవలికిపొండి—ఎల్లవారు నాయాజ్ఞ శిరసావహిం చాలని మల్లెపువ్వులదండలు మదురుకిరింద వాయన మిచ్చాను, మాటాడకుండాపొండి యమదూతలారా మాటాడకుండాపొండి—తనివి

లేకుండా దానధర్మాలుచెయ్యాలని తలుపుదగ్గర ధనం వాయనమిచ్చాను, తరలిపోండి యమదూతలారా తరలిపోండి—అని యీయిల్లాలు మహాధైర్యంతో దేవీదేవర్లను నమ్మి యమదూతలను తరుమజొచ్చింది. భక్తి పాతివ్రత్యంగల పడతులపల్కులు యమదూతలు మాత్రం దాటగలరాబాబూ, అని యీయమదూతలు ప్రాణాలు చేతబట్టుకొని, అందరిని వదలిపెట్టి, పారిపోయారు. అప్పుడు యుద్ధములో పడిపోయినవారందఱూ పార్వతీపరమేశ్వరుల కృపచేత నిద్రపోయి లేచినట్లు లేచివచ్చారు. ఆయిల్లాలు భక్తితో పార్వతీపరమేశ్వరులకు మొక్కుచూ పట్టిననోముపట్టకుండా, మున్నూటరవైరోజులు నోములతోను వ్రతాలతోను, పెనిమిటితోను, బిడ్డలతోను, భాగ్యభోగ్యాలతోను, కలకాలంగడిపి కైలాసంచూరగొన్నది. ఆమె నోచిననోము అందఱూనోచారు. భక్తితప్పకుంటే ఫలంతప్పదు. ఈకథ చెప్పుకొని అక్షతలువేసికోవలెను.

ఉద్యాపనము:—కథలో చెప్పిన యిరవైయైదు దినుసులుశక్తిగలిగినప్పుడు ముత్తైదువల కిచ్చుకోవలెను. పట్టుచీర, తోపుచీర, వెల్లచీరమాత్రం ఒక్కొక్కటి చొప్పున ముత్తైదువలకియ్యవలెను. నీళ్ళకడవలు అయిదుమాత్రమే అయిదుగురు ముత్తైదువలకు దక్షిణతాంబూలాలతో పసుపుపూసిబొట్టుంచి వాయనమియ్యవలెను. తక్కిన దినుసులన్ని ఇరవైయైదుచొప్పున జతపరుచుకొని, అయిదుగురు ముత్తైదువలకైదేసి పంచియిచ్చుచుండవలెను. ధనము వారిశక్తి కొలది అయిదుగురు ముత్తైదువలకైదేసికాసులో రూకలో కానులో యియ్యవలెను.

---

## 29. కృత్తికదీపాలనోముకథ.

ఈనోము కృత్తిక నక్షత్రము కార్తిక పున్నమినా డెప్పుడు కావచ్చునో అప్పుడు పట్టవలెను. నిండుపున్నమి వలెను. పట్టినయేడు

నూటయిరువదిదీపములు శివాలయములో వెలిగించి విఘ్నేశ్వర పూజ, శివాభిషేకము చేయించి, బ్రాహ్మణుడికి మూనెడు సోలెడు బియ్యము, దక్షిణ తాంబూలములుఇచ్చి పాడ్యమినాడుదయమున పదిమందికి తక్కువగాకుండా బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఈలాగే ఖండతిధిగాకుండా కృత్తికనక్షత్రంతోగూడిన కార్తీక పున్నమి నాడేగాని, యీనోమునోచకూడదు. మూడేండ్లు నోచవలెను. రెండోయేడు రెండునందల నలభై దీపాలు, మూడోయేడు మూడునందల అరవై దీపాలు, అదేవిధంగా వెలిగించవలెను. కృత్తికదీపాల నోము నోచినవారికి శివసాయుజ్యము తప్పకుండా లభించును.

---

## 30. గండాలగౌరినోముకథ.

రాజుకూతురు, ప్రధానికూతురు గండాలగౌరిదేవినోము పట్టి రాజుకూతురుల్లంఘనంచేస్తే, ప్రధానికూతురు భక్తిశ్రద్ధలతో నోచి, ఉద్యాపనచేసింది. ప్రధానికూతురికిమగనికి,బిడ్డలకు, ధనానికి, ధాన్యానికి, దాసదాసీజనానికి, ఇండ్లకు, వాకిండ్లకు, దూడలకు దుడకలకు, కార్యాలకు కథలకు, శుభాలకు శోభనాలకు, అన్నిటికీకూడ, దేనికీ యేగండం లేకుండా తీగలేసినట్లొక్కలాగు జరిగిపోతూ ఇరుక్కీ పొరుక్కీ చుట్టాలకీ బంధువులకీ అందరికి కన్నులపండువుగా కాపురం చేస్తూండట. రాజుకూతురికి అడుగడుగుకు గండాలే—కదిలితే గండం, మెదిలితేగండం, మొగుడికి గండం, బిడ్డలకుగండం, ప్రజలకు గండం, బ్రతుకంతా గండాలేమైపోతూండట. అలా ఉంటే ఆ చిన్నది పార్వతీపరమేశ్వరులనుగూర్చి తపస్సుచేసిందట. అప్పుడు వారు ప్రత్యక్షమైబిడ్డా! గండాలగౌరిదేవి నోముపట్టి, ఉల్లంఘునచేసితివని చెప్పగా, అప్పుడావిడ వారికాళ్ళకు మ్రొక్కి, వారి యాజ్ఞా ప్రకారంగా మళ్లీ నోముపట్టి, యథావిధిగా ఉద్యాపనం చేసికొని, యేగండం యెరుగనీ

కుండాగండాలన్నిగడచిపోయి, పుత్రధానికూతురులాగు, పెనిమిటితోను బిడ్డలతోను, భాగ్యంతోను, భోగ్యంతోను, వేయేండ్లువర్ధిల్లి, పార్వతీ సన్నిధానమునకేగినదట. ఆమెపట్టిన నోమందరూ పట్టారు. భక్తితప్ప కుంటే ఫలముతప్పును. ఏడాది అక్షతలువేసికోవలెను.

ఉద్యాపనము:—అయిదుసేర్ల బియ్యం చలిమిడి, అయిదుసేర్ల పప్పుచిమ్మిలి, చేసికొని, పదమూడేసిఉండలక్రిందచేసి, పదునిద్దరుబ్రాహ్మణులకయినా, ముత్తైదువలకైనా, వాయనమియ్యవలెను. దక్షిణ కాని, కానియుంచి, తాంబూలాలు ఇయ్యవలెను. పదమూడుజోడాలు తక్కెడచిప్పలు చేయించి, ఒక్కచిప్పలో ఒక్కచిమ్మిలుండా, ఒక్క చలిమిడుండాఉంచి, ఇంకోతక్కెడచిప్ప పైనమూసి, ఆవరుసనుపం డ్రెండు వాయనాలియ్యవలెను. పదమూడోది నయివేద్యం పెట్టితాను తనవాళ్ళూ భుజింపవలెను.

---

## 31. లక్షపసుపునోముకథ

లక్షపసుపునోము నోచినచామకు లక్షవేలేం డ్లైదువ తనము, లక్షవేలేండ్లు కడుపుచలువ, లక్షవేనవేలక్షయభాగ్యం అక్షయలోక ప్రాప్తికలుగును. ఈకథచెప్పుకొని అక్షతలువేసికోవలెను.

ఉద్యాపనము:—పసుపుకొమ్ముల బస్తాదగ్గర నడుమువిరుగని పసుపుకొమ్ములు జతపడినపుడెల్ల వాడలో వేలో దొరకినన్ని యేరు కొని, ఆకొమ్ములు పట్టించుకొనివెళ్ళి, యింటింటివద్ద దోసెడికి తక్కువ కాకుండా తోచినన్ని పంచిపెట్టుచుండవలెను ఆలా లక్షకొమ్ములయ్యే పర్యంతం పంచిపెట్టవలెను. పసపుకొమ్ములతో తోచినంత కుంకుమ గూడా ఇయ్యవలెను. కొందరు ముందుగా గౌరీదేవికో లక్ష్మీదేవికో లక్షనామాలతో కుంకుమపూజచేయించి, ఆకుంకుమ జాగ్రత్తచేసి కొని, అది పసపుకొమ్ములతో కలిపి పంచిపెట్టుచుందారు.

---

## 32. గడపగౌరినోముకథ.

గడపగౌరినోము నోచినవారికి గడపరాని గండాలుండవు. గౌరీశంకరుల కరుణకు కొదవుండదు. ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికోవలెను. ఒకయేడాది ఒకయింటిగడపకు పసుపురాచి మూడుకుంకుమ బొట్లు ప్రతిదినము ఉదయమున పెట్టుచుండవలెను.

ఉద్యాపనము:—ఏడాదిలోగాని, తరువాతగాని, గారెలు పదమూడుజోడాలు ఒకపళ్ళెములోనుంచి, చీర, రైక, పసుపు, కుంకుమ, మట్టెలు, మంగళసూత్రమునుంచి ఒకముత్తైదువకు వాయనమీయవలెను

---

## 33 కల్యాణగౌరినోముకథ.

"కల్యాణగౌరినోముపట్టిన కాంతకు నిత్యకల్యాణం, పచ్చతోరణము" అని చెప్పుకొని అక్షతలు వేసికోవలెను. ప్రతిదినము నొకపేరంటాలికి "నీవే నాపాలిటి పార్వతీదేవి" వని చెప్పి తలంటిపి బొట్టుపెట్టి పంపుచూ, ఒకయేడాది యిట్లు నోచవలెను; ఏడాదిలోపునగాని, తరువాతగాని, ఉద్యాపనముచేసికోవలెను.

ఉద్యాపనము:—పెండ్లియగుచున్న పిల్లకు మంగళసూత్రధారణమైన పెండ్లికూతురు పీటలమీదినుండి లేచినవెంటనే యీక్రింద చెప్పిన రీతిని వాయన మీయవలెను. ఒకపళ్ళెములో చీర, రైక, మట్టెలు మంగళసూత్రములు, (బొడ్డుపుస్తెలుపెట్టెదరు) పువ్వులచండలు, అత్తరువు, పన్నీరు, గంధము, పసుపు, కుంకుమ, ఉంచుకొని ఆపళ్ళెము సహితముగా పెండ్లికూతునకు వాయనమీయవలెను. కథలోపమయినా వ్రతలోపముకాకూడదు. భక్తి తప్పినా ఫలముతప్పదు.

---

కాకినాడ:—జార్జిప్రెస్‌యందు ముద్రింపబడినది. 1936. 5,000 ప్రతులు.

☞ ప్రతులు దొరకుచోటు :—

బాలాంత్రపు వేంకటరావుగారు,

ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,

కాకినాడ.

